*Issued on 24—9—1956*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

# OFFICIAL REPORT

*MONDAY, 3rd OCTOBER, 1955.*

VOLUME X — No. 2.

CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1956

Price 6 annas.

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Monday, the 3rd October* 1955.

The House met in the Assembly Chamber, Kurnool, at eleven of the Clock. MR. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## CONDOLENCE

Reference : The death of Sri N. Satyanarayana.

MR. SPEAKER : It is my painful duty to mention to the House that Sri N. Satyanarayana, an ex-Member of the Madras Legislative Council, a co operator, a member and Secretary of the Bharath Sevak Sangh and a well-known gentleman of public activities passed away in the Bombay Hospital, while attending a board meeting of the State Bank. In memory of the departed soul we will observe one minute prayerful silence.

The House observed silence for a minute, all Members standing.

## QUESTIONS AND ANSWERS.

### Starred questions.

*Fall of prices of agricultural products.*

487—

* 41 Q.—SRI S. VEMAYYA :

SRI G. RAMASWAMI REDDI :

SRI B. APPA RAO :—

Will the Hon. the Chief Minister be pleased to state—

(*a*) whether the Government are aware of the fact that there is a fall of prices of agricultural products in the State ;

(*b*) if so, the action taken thereon ; and

(*c*) the quantity of agricultural products exported from this State to other States for the year ending 1954 ?

[3rd October 1955

THE HON. SRI B. GOPALA REDDI :--

(*a*) Yes.

(*b*) As the Honourable Member is aware, all restrictions on inter-State movements in regard to agricultural produce having been lifted, any measures for price regulation or stabilization will lie on the part of the Central Government only. In the case of Jowar, bajra, maize, the Central Government have offered to purchase from cultivators if the prices of these commodities should fall below Rs. 5-8-0 per maund in the case of jowar and maize and Rs. 6 per maund in the case of bajra. Also, as the Honourable Member is aware the Central Government had negotiated with the Government of the People's Republic of China for the sale of our tobacco.

So far as the State Government is concerned they have endeavoured to secure :—

(*a*) adequate supplies of wagons for movement from the producing to the consuming centres ; and

(*b*) adequate quotas for export of our surplus produce,

(*c*) A total quantity of 1,94,643·21 tons of rice was moved to other States during 1954, including a quantity of 12,619·9 tons moved to Madras State by the private trade upto 10—7—1954. No particulars are available regarding the quantities of other agricultural commodities exported from this State.

Sri S. VEMAYYA :—ఈ exports ఇతర రాష్ట్రాలకు సరిగా జరగడం లేదని, ఎక్కువ ప్రతిబంధకంగా ఉన్నదని తెలుస్తున్నది. దాన్ని తొందరగా move చేయడానికి Railway Department నుంచి మనకు ఏదైనా response వచ్చిందా? వచ్చిఉంటే, ఏలాంటి response వచ్చింది ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఈ విషయం గురించి పదే పదే Railway Board వారికి చెప్పుతున్నాము. మొన్న ఢిల్లీకి పోయినప్పుడుకూడ ఇది చర్చించడం జరిగింది. అది బెజవాడనుంచి మద్రాసువరకు కొంత improvement చేయడానికి ప్రయత్నం చేస్తున్నారు. వారుకూడ అన్ని విధాలా మనకు సహాయపడడానికి ప్రయత్నం చేస్తున్నారు.

3rd October 1955]

SRI B. APPA RAO :—Jaggery Marketing Board ఏర్పాటు చేయాలని చాలా కాలంగా రైతులు ఆందోళన చేస్తున్నారు. ఈ సంవత్సరం Jaggery ధరలు చాలా పడిపోయినవి. ప్రభుత్వము దానిపైన ఏలాంటి చర్య తీసుకొన్నట్లు లేదు. కనుక, త్వరలో ఒక Jaggery Marketing Board ను ఏర్పాటు చేయాలనే proposal ప్రభుత్వానికి ఉన్నదా ?

THE HON SRI B. GOPALA REDDI :—ఎక్కడెక్కడ Jaggery Marketing Boards పెడితే అనుకూలంగా ఉంటుందో, అక్కడ తప్పకుండా పెట్టడానికి ఆలోచిస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—రైతు దగ్గర చాలా తక్కువధరకు ధాన్యంకొని, వ్యాపారస్థులు మరీ ఎక్కువ ధరకు అమ్ముతున్నారనేది ప్రభుత్వానికి తెలుసుననుకొంటాను. అలా కాకుండా, రైతుదగ్గర కొనేధరకు వ్యాపారస్థులు అమ్మేధరకు ఉన్నటువంటి disparity ని తగ్గించడానికి ప్రభుత్వము ప్రయత్నం చేస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—Co-operative Societies ఎక్కువగా వ్యాప్తమైనప్పుడు ఇది సాధ్యమౌతుందేమోగాని ఇప్పుడు, decontrol చేసినతరువాత, we have left it for free trade.

SRI PILLALAMARRI VENKATESWARLU :—రైతుదగ్గరనుంచి వ్యాపారస్థుడు కొన్నతరువాత, దానికి కొంత percentage లాభమువేసి, ఆ విధంగా ధరలు fix చేసేటటువంటి orders జారిచేయడానికి వీలుంటుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఇప్పుడు అన్ని prices decontrol చేసినాము. కాబట్టి అటువంటి ఆలోచనేమీ లేదు.

SRI S. VEMAYYA :—ఈ పంటలకు ధరపడి పోయిందనేది ప్రభుత్వ దృష్టికి తీసుకురాబడిందా ? అయితే, ప్రభుత్వము వాటిని గురించి ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొంటుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—కొన్నిటికి ధరలు పడిపోయినాయి అనేది నిజమే. కాని కొన్ని commodities మరల ధరలు pick up చేసుకొంటున్నాయి. Government of India వారు ఈ విషయంలో శ్రద్ధ వహిస్తున్నారు. ముఖ్యంగా బియ్యంవిషయంలో ఇటీవలవాళ్లు ఒక conference కూడ పెట్టుకొన్న కొన్ని సలహాలుకూడ చేసినారు. కాబట్టి ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వంవారు రాష్ట్రప్రభుత్వంవారు తీవ్రంగానే ఆలోచిస్తున్నారు.

Sri N. C. SESHADRI :—మన రాష్ట్రానికంతా ముఖ్యమైనటువంటి commercial crop అయిన వేరుశనగయొక్క ధరల స్థిరీకరణకు ప్రభుత్వం ఏమైనా చర్య తీసుకొంటుందా ? దీంట్లో ఎక్కువ కోటా ఇవ్వవలసిందని కేంద్ర ప్రభుత్వానికి సిపార్సు చేసిందా ?

The Hon. Sri B. GOPALA REDDI :—ఇది చాలావరకు కేంద్ర ప్రభుత్వానికి సంబంధించినటువంటి విషయము. అందులో ఇది పెద్దసమస్య. కనుక తొందరనే ఈ విషయంలో మేము ఏమిచేయలేకుండా ఉన్నందుకు విచారిస్తున్నాను.

Sri P. SREERAMULU :—ధరలు పడిపోయేటటువంటి పంటలకు ధరలు స్థిరీకరణచేసే విషయంలో రాష్ట్ర ప్రభుత్వముచేసిన సిపార్సులను అనుసరించి కేంద్రప్రభుత్వము నిర్ణయించడానికి ఇంకా ఎంతకాలము పట్టుతుందో చెప్పగలరా ?

The Hon Sri B. GOPALA REDDI :—వాళ్లు కొన్ని కొన్ని ధాన్యాలు మాత్రము తీసుకొని ప్రయత్నం చేస్తున్నారు. కాని అన్నిటికి ఒకే పంథాగా చేయడంలేదు. కాబట్టి కొన్ని కొన్ని విషయాలలో వాళ్లు చేస్తున్నారు. ఇంకా కొన్ని ఆలోచనలో ఉన్నాయి. మరికొన్ని ఆలోచనలో కూడ లేవు.

Sri B. V. SIVAYYA :—కేంద్ర ప్రభుత్వంవారు ఎగుమతి కోటాలను నిర్ణయించే విషయంలో, ఊడ్పు అయినతరువాత ఏ 5, 6 నెలలకో, కోటాలు announce చేయడంవల్ల వచ్చే ఆ లాభమంత వ్యాపారస్థులకే వస్తుందా ? ఆ లా కాకుండా harvest కు ముందుగానే, కోటాలు నిర్ణయం చేయవలసిందని కేంద్రప్రభుత్వానికి సిపార్సు చేయడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా.

The Hon. Sri B. GOPALA REDDI :—Harvestకు ముందుగానే నిర్ణయించుటకు కొన్ని ఇబ్బందులు ఉంటాయి. పంట ఎంతపండింది, మనకు ఎంత కావలసి యుంటుంది, ఎంత ఎగుమతి చేయవలసియున్నది అనే విషయాలు harvest అయినతరువాతగాని లెక్కలు తెలియవు. కనుక అటువంటి ఇబ్బందులు ఉంటాయని అనుకొంటాను.

Sri K. VIJAYABHASKARA REDDI:—అధ్యక్షా, వేరుసెనగవిషయములో ప్రతిసంవత్సరము export quota జూలై, ఆగస్టునెలలలో కేంద్రప్రభుత్వము నిర్ణయము చేస్తుంది. ఆ లైసెనుకు రైతులందరు అమ్ముకొనివుంటారు, వ్యాపారస్థులు లాభము సంపాదించుకో గలుగుతున్నారు. కనుక కేంద్రప్రభుత్వము రైతులకు పంటవచ్చే సమయములో export quota settle చేసేటట్లు ప్రభుత్వము ఏర్పాటుచేస్తుందా ?

3rd October 1955]

THE HON. SRI B. GOPALA REDDI :—కేంద్రప్రభుత్వముతో ఉత్తరప్రత్యుత్తరములు జరుపుతున్నాము.

SRI K. APPA RAO :—ఆహారధాన్యముల ధరలు సకాలములో స్థిరీకరణ చేయకపోవడమువల్ల, ప్రభుత్వమువారు సకాలములో శ్రద్ధతీసుకొనకపోవడమువల్ల ముఖ్యంగా కళ్లములలోనే అమ్మకొనే సన్నకారు రైతులకు మధ్యతరగతి రైతులకు చాలా నష్టమువస్తున్నదనే సంగతి ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON. SRI B. GOPALA REDDI :—తెలుసును. కాని యీ విషయములో ప్రభుత్వము యేమీచేయలేకుండ వున్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—వేరుశనగ ధర విషయములో కేంద్రప్రభుత్వముతో ప్రత్యేకంగా సంప్రదించటానికి ప్రభుత్వము పూనుకొంటుందా ?

THE HON. Sri B. GOPALA REDDI :—పూనుకొంటుంది.

SRI C. SUBBARAYUDU :—అన్నిధాన్యాలలోకి జొన్నలకు ధర విపరీతంగా తగ్గిపోయిందని ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON. SRI B. GOPALA REDDI —తెలియదు.

SRI N. P. CHENGALRAYA NAIDU :—అధ్యక్షా, రైతులపైన కొత్తపన్నులువేయటానికిగాను ముఖ్యమంత్రిగారు చూపేశ్రద్ధ యీ ధరలను ఎక్కేటందుకు శ్రద్ధచూపడములేదు. వారికి అధికంగా finance అని, agriculture అని, యీ వగైరా portfolios వున్నందున, వారికి పనులు ఎక్కువగా వుంటున్నవి. అందువల్ల యీ విషయమును చూడటానికి వేరేమంత్రిని వేయటానికి ముఖ్యమంత్రిగారు ప్రయత్నిస్తారా ?

MR. SPEAKER :—It is only a suggestion and not a question.

SRI A. BAPINEEDU :—అధ్యక్షా, ఆంధ్రరాష్ట్రమునుంచి ఎగుమతి చేయాలంటే, మద్రాసునుంచి చేయవలసివస్తున్నది. విశాఖపట్టణంనుంచి, కాకినాడ నుంచి Ceylon కు chillies ను ఎగుమతి చేయటానికి ఏమాత్రము అవకాశాలు లేకుండావున్నవి. ఇక్కడినుంచి సరకు మద్రాసుచేరేటప్పటికి, ఆలస్యం అవుతున్నది. Ready గా waggon supply కావడములేదు. అందువల్ల మనకు

యిక్కడ విశాఖపట్టణమునుంచి గాని, కాకినాడనుంచిగాని chillies ఎగుమతిచేయ టానికి ప్రభుత్వము ఏమైనా చర్యతీసుకుంటూరా ?

THE HON SRI B. GOPALA REDDI :—ఈ దినమే, యీ ఎగుమతి విషయములో యిబ్బంది వున్నదన్న సంగతి తెలిసినది. రేపుగూడా యీవిషయము చర్చింమదామని అనుకున్నాము. ఈ విషయములో కేంద్రప్రభుత్వమువారికి తెలియ పరచవలసివున్నది. మనకు యిక్కడ విశాఖపట్టణమునుంచి, కాకినాడనుంచి ఎగు మతిచేయటానికి ఏమేమి అవసరముంటుందో అది తప్పకుండా కేంద్రప్రభుత్వానికి తెలుపుతాము.

SRI V. VISWESWARA RAO:—ధరలు తగ్గిపోయేటట్లయితే, కొన్ని రకముల పంటధాన్యాలవిషయములో కేంద్రప్రభుత్వమువారు interfere అయి, ఆ ధాన్యాలను కొంటామని చెప్పారు. అందులో ప్రత్యేకించి జొన్నలకు, బాజరాకు, ధరబాగా తగ్గిపోయినది. అటువంటప్పుడు ఎన్నిమణుగుల ధాన్యము మన ఆంధ్ర రాష్ట్రములో కేంద్రప్రభుత్వమువారు కొన్నారు ? కొనకపోతే, యీ ధరలు నిర్ణ యించడము అనేది మన ఆంధ్రప్రజల కళ్లనీరు తుడవటానికేనా కేంద్రప్రభుత్వము ఆ విధంగా చెప్పింది ?

THE HON SRI B. GOPALA REDDI :—అది ఏది అయినప్పటికినీ, కళ్లనీరుతుడవటానికి చెప్పారనేది మేము ఒప్పుకోము. వేరేప్రశ్న వేయండి చెబుతాను.

SRI SHAIK MOULA SAHIB :—అధ్యక్షా, ఆహారధాన్యాలధరలు గత యుద్ధకాలమునాటికి ముందువుండే ధరలకంటేగూడా యిప్పుడు పడిపోయినవా? లేకపోతే, ఇప్పటిధరలు control టైములోవుండే ధరలకంటె యిప్పుడు తగ్గి పోయినవా ? 2. ధాన్యానికి ధరలు తగ్గినవి, తగ్గినవి అని పదేపదే చెప్పుతున్నారే, వ్యవసాయానికి కావలసిన యినుపపరికరాలు, ఆసాములకు కావలసిన గుడ్డలు పగైరాల యొక్క ధర అదుపులోనికి ప్రభుత్వము ఎందుకు పెట్టకూడదు ? అట్లా తీసుకొని రాలేనప్పుడు పేదప్రజానీకానికి ఆహారధాన్యాలు పెంచినట్లయితే, కష్టతరమవుతుం దని ప్రభుత్వము గుర్తించిందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఆ ! గుర్తించింది.

MR. SPEAKER :—We have spent 15 minutes over this question.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ప్రభుత్వము యీ ధరలను నిర్ణయించే బదులు మామూలుగా జనవరి ఫిబ్రవరి మాసాలలో పంటలు వచ్చేటప్పుడు వున్నటువంటి ధరలు తక్కువగా వుండడము దరిమిలాన పెరగడము జరుగుచున్నది. రైతులు శిస్తులు కట్టవలసిన సమయము వచ్చేటప్పటికి అందరూగూడా ధాన్యము అమ్ముకొని శిస్తులు కట్టుతారు. ఈ కారణముచేత యీ శిస్తులు చెల్లించే విధానాన్నిమార్చి తరువాత చెల్లించే విధానాన్ని అప్పటికి ధరలు పెరుగుతాయి గనుక, ప్రభుత్వము అవలంబించగూడదా? రైతులుగూడా లాభంగా అమ్ముకుంటారుగదా?

Mr. SPEAKER :—You are driving at a different question.

THE HON. SRI B. GOPALA REDDI :—వేమయ్యగారు యీ విషయములో ఒక cut motion యిచ్చారు గదా? ఇంకేమి, మరి.

SRI K. SUBBA RAO :—ఈ దేశములో పంటలుపండించే రైతులకంటే పండిన పంటను కొనితినేవారు ఎక్కువగా వున్నారు గనుక భూసంస్కరణల విధానము చక్కగా అమలులోకి వచ్చేటంతవరకు ధరలగొడవలలో ప్రభుత్వము జోక్యము కలిగించుకోకుండా వుంటుందా?

THE HON. SRI B. GOPALA REDDI .—No answer.

*Stocks of paddy and rice and stabilization of prices.*

488—

*769 Q.—SRI S. R. Y. SIVARAMA PRASAD BAHADUR:
SRI M. RAJESWARA RAO :—

Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the stocks of paddy and rice at the disposal of the Government on 31st March 1955 ;

(b) the reasons for not releasing those stocks so far ; and

(c) whether there is any proposal with the Government for the stabilization of the prices of paddy during the current year ?

THE HON. SRI B. GOPALA REDDI :

(a) A quantity of 38,089·94 tons of the rice was held by the procuring agents on behalf of the Government on 31—3—1953.

(b) The above stocks were earmarked for supply to the Central Reserve and as the Government of India could not make arrangements for lifting them, they could not be released till recently. All the stocks have since been released, except a quantity of 218·54 tons held in Nellore district, which is covered by the stay orders issued by the High Court.

(c) The attention of the Honourable Member is invited to the answer to the starred question No. 41, given notice of by Sri. S. Vemayya.

SRI. M. RAJESWARA RAO : and Sri S. R. Y. S. prasd bahadur ధాన్యాలను భద్రముగా వుంచటానికి ప్రభుత్వమువారు godowns ద్వారాగాని, మరి ఏవైనా నిర్మించడము ద్వారాగాని, ఏర్పాట్లు ఏవైనా చేసి వున్నారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—చేసివున్నారు. ఇప్పటికి అవిఅన్నీ release అయిపోయినవి. కాబట్టి ఇక యిప్పుడు ఆ ప్రశ్నలేదు. 118 టన్నులు తప్ప తక్కినవిఅంతా release అయిపోయినవి.

SRI D. KONDAYYA CHOWDARI :—Paddy కి కేంద్రప్రభుత్వము నిర్ణయించిన ధర చాలా తక్కువగా వున్నది. మణుగు 1 కి రు. 11 లు అని అన్నారు. అంతకు తగ్గితేమాత్రం స్థిరీకరణ చేస్తామని చెప్పారు. తగ్గకపోతే తగ్గేటంతవరకు చూస్తామని చెబుతూ వచ్చారు. ఈ విధంగా కేంద్రప్రభుత్వం చెప్పటం చాలా అధర్మంగావుంది. ఈ సంగతి ప్రభుత్వానికి తెలుసునా ?

ఇంతేకాకుండా నెల్లూరు బియ్యమునకు ప్రత్యేకమైన ధర వేయటానికి, యీ ధరల స్థిరీకరణ విషయములో మన ప్రభుత్వము ఏవైనా ప్రయత్నాలు చేస్తున్నదా ?

THE HON. SRI B. GOPALA REDDI :—నెల్లూరు బియ్యము మొదటి తరగతికి చెందినవి కాబట్టి యిప్పుడు దాని ప్రశంస యేమీలేదు. కేంద్రప్రభుత్వమువారు చెప్పినది రెండవరకపు బియ్యము విషయలో మాత్రమే. అదిగూడా ధర

తగ్గితే అప్పుడు మేము కొంటామని కేంద్రప్రభుత్వమువారు చెప్పారు. అంతకు పైనవుంటే, free market కే వదిలివేస్తున్నారు. అంతకన్న తగ్గితే, రైతులకు యిబ్బంది అవుతుందనే ఉద్దేశ్యముతో రెండవగకము బియ్యము మాత్రము మణుగు పదకొండు రూపాయల ప్రకారము కొంటామని వారు చెప్పారు.

SRI M. NAGI REDDI :—ఆహార ధాన్యాలధరల స్థిరీకరణ వెంటనే చేయటానికి వీలులేకుండా ఉన్నదని కేంద్రప్రభుత్వమువారు అంటున్నారు. అదే సందర్భములో ఆహార ధాన్యముల ధరలు పడిపోగా, ఎరువుల ధరలుమాత్రం అంతే ఉంటూ వస్తున్నవి. వీటినిగురించి ఎసెంబ్లీలో చాలాసార్లు ప్రస్తాపన వచ్చింది. ఎరువుల ధరలు వెంటనే తగ్గించటానికి ప్రభుత్వము యెందుకు పూనుకో కూడదు ?

THE HON. Sri B. GOPALA REDDI :—అదిసరే. దానికి ఎన్నో కోట్ల రూపాయలు invest చేశారు. వారి investment కు వడ్డీ ఎంతఅయింది. వారికి అయ్యేఖర్చులు, వడ్డీ, యివన్నీకూడా లెక్క చూచుకుంటే గిట్టవలెగదా ? ఎరువులకు యింకను ధర తగ్గించమంటే, యిక వాళ్లు దివాలా తీసిపోవటానికి పూను కోమని అంటారా ?

SRI L. LAKSHMANA DAS :—ఆంధ్రదేశములో కేవలము వ్యవసాయముమీద ఆధారపడి వున్నవారు చాలామంది వున్నారు. కాబట్టి ధరల స్థిరీకరణ విషయములో కేంద్రప్రభుత్వముతో నచ్చచెప్పటానికి ప్రభుత్వము ప్రయత్నము చేస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—చేస్తున్నది. ఇటీవలనే పోయిన మాసములో కాబోలు వడ్లు, బియ్యము వగైరాల విషయములో సంప్రదింపులు జరిగినవి.

*Construction of Public Works Department Workshop.*

489—

* 397 Q.—SRI P. RANGA REDDY : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the Public Works Department Workshop is proposed to be constructed at Seethanagaram and if so, at what cost and when it will be completed ; and

(b) what for this workshop is mainly intended ?

THE HON. SRI N. SANJEEVA REDDI :

(a) The answer is in the affirmative. The cost of the scheme is Rs. 8 lakhs. The buildings are almost completed now.

(b) It is intended to provide new equipment and machinery for all the Irrigation projects of the State and for the manufacturing of gates, shutters etc.,

SRI P. RANGA REDDI :—మొదట్లోనో, లేక యింతకు ముందో రాష్ట్రములో ఏదైనా workshop లో P. W. D. వారి works వుండినవా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—విజయవాడలో ఒకటి వున్నది. అదిగాక తుంగభద్ర ప్రాంతములో ఒకటి వున్నది. రెండూ వున్నవి. కాని విజయవాడా చాలాయిరుకుగా వున్న కారణముచేత, యిప్పుడు దాన్ని యివతల యింకొకచోటకు మార్చటం జరుగుచున్నది.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా ! ఇప్పటికి 8 లక్షలు ఖర్చుచేసి కట్టమన్నారని చెప్పారు. దీనిలో కృష్ణా బారేజి స్కీముకుగాను కావలసిన shutters వగైరాలు గూడా తయారు చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ప్రభుత్వముయొక్క ప్రయత్నము వాటిని అన్ని అక్కడ తయారు చెయ్యాలనే. తుంగభద్ర ప్రాంతములో వున్న machinery కూడా యిక్కడికే వచ్చింది. అది, యిది అంతా కలిపి, యీ shutters ను అన్నీ యిక్కడ తయారు చేయించాలనే ప్రభుత్వము వుద్దేశిస్తున్నది.

11-30 a.m.

SRI P. SREERAMULU :—తుంగభద్ర workshop లో తయారయ్యే వస్తువులు ఏమిటో, సీతా నగరములో తయారయ్యే వస్తువులు ఏమిటో సెలవిస్తారా ?

TEH HON. SRI N. SANJEEVA REDDI :—అవసరమైన వస్తువులు అక్కడ, ఇక్కడ కూడా తయారుచేస్తారు. ప్రాజెక్టు పనులను బట్టి ఏవి కావలసి వస్తాయో అది తయారు చేసుకుంటారు. అంతే కాని ఇక్కడ division లేదు.

SRI N. VENKAYYA :—ప్రాజెక్టు నిర్మాణానికి అనువుగా నందికొండ work shop ప్రారంభిస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—అక్కడ ప్రాజెక్టు ప్రారంభం కానిదే worshop అవసరములేదు. ఉన్న workshop లలో పని ఎక్కువ అయి అక్కడ అవసరం అయినప్పుడు ఆలోచించుకోవచ్చును. ఇంకా ప్రాజెక్టు ప్రారంభములోనే ఉన్నది.

SRI N. C. SESHADRI :—మనం ద్వితీయ ప్రణాళికలో ప్రాజెక్టులకు అధిక ప్రాముఖ్యత ఇస్తున్నాము. శీతానగరం workshop చాలా దూరంలో వున్నది కాబట్టి ప్రతి Superintending Engineer Circle కు కూడా ఒక workshop స్థాపించే ప్రయత్నం ప్రభుత్వము చేస్తుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇప్పుడు Superintending Engineer Circle కు ఒక workshop అవసరములేదు. ఇప్పుడు తుంగభద్రలో ఒక shop వుందని చెప్పాను. తరువాత శీతానగరంలో ఉన్నది. ధవళేశ్వరవరంలో ఒకటి ఉన్నది. ఇంకా ఎక్కువ చేస్తే ఖర్చు ఎక్కువ అవుతుంది తప్ప లాభములేదేమో ?

SRI M. NAGI REDDI :—ఈ workshop ల్లో ఆంధ్ర దేశంలోని ఇరిగేషను ప్రాజెక్టుల కొఱకు కావలసిన పనిముట్లు తయారు చేయుటకని చెప్పినారు. ఇప్పుడు ఆంధ్ర దేశంలో కల్లా ఇప్పుడు నిర్మించబోయ్యే నాగార్జున సాగరు ప్రాజెక్టు బ్రహ్మాండమైనదని అనుకొంటున్నాము. అందువల్ల అక్కడకూడా ఒక workhop వుండడం అవసరము. అట్లులేకపోతే దానికి కావలసిన పనిముట్లు ఎక్కడనుంచో తెప్పించుకొంటే చాలా ఆలస్యము అవుతుంది పనికుంటు పడుతుంది. ఇక్కడ చిన్న చిన్న పనులుకు అవసరమైన వాటిని తయారుచేయడానికి workshop ఏర్పాటు చేస్తారా ? ప్రాజెక్టు పని కుంటు పడ్డా ఫరవాలేదనుకుంటారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—వేసిన ప్రశ్న మరల వేశారు. ఇంవొక సమాధానము చెప్పాను. నందికొండ ప్రాజెక్టు మన కంట్రోలులో లేదు. ఒక బోర్డు కంట్రోలులో వున్నది. అక్కడ workshop పెట్టడానికి మనకు హక్కులేదు. మనకు కెనాల్సుమీద మాత్రమే హక్కువున్నది. కెనాల్సు త్రవ్వటానికి work shop అవసరము లేదు. కొబట్టి ఇప్పుడుకూడా కొంతబోర్డు వారి కంట్రోలులో work shop పెడతారా లేదా అనేది నేను ఇప్పుడు సమాధానము చెప్పలేను.

SRI D. KONDAIAH CHOWDARY:—ఇప్పుడు మన ఆంధ్రదేశంలో వున్న ఈ మూడు work shop లు కూడా ఇంజనీరింగు కాలేజీలు వున్నచోట ఎక్కడాలేవు. అందువల్ల ఆ కాలేజీలు వున్నచోట work shop లు పెడితే విద్యా

ర్థులు సక్రమంగా నేర్చుకోడానికి వీలుంటుంది. లేనిచో work shop లు వున్న చోట కాలేజీలు పెట్టితే బాగుంటుందేమో మంత్రిగారు ఆలోచిస్తారు ?

THE HON. SRI N. SANJEEVA RRDDI .-ఊరికే ఆలోచిస్తాము అని చెప్పితే సులభంగానే వుంటుంది. ఇపుడు అటువంటిపద్ధతి అవసరములేదు. ఇంజనీరింగు కాలేజీలదగ్గర విద్యార్థులు చదువుకు సంబంధించినంతవరకు చిన్నచిన్న మెషినరీలు గల work shop లు వున్నాయి. అందువల్ల అక్కడ అవసరము లేదు పెట్టడానికి సాధ్యము కాదనుకుంటాను.

SRI RAJA SAGI SURYANARAYAN RAJU :—సీతానగరము ఏ జిల్లాలో ఉన్నదండి.

THE HON. SRI N. SANJEEVA REDDI :—కృష్ణానదికి ఇవతల ఒడ్డున ఉన్నది. అది గుంటూరు జిల్లాలోనిదే కాని కృష్ణానదికి అవతల ఒడ్డున ఇంతవరకు work shop వుండేది. అక్కడ్క డర్టీగా ఉన్నదని ఇవతల ఒడ్డునకు మార్చినారు.

SRI P. KODANDA RAMAYYA :—ధవళేశ్వరములో వున్న work shop చాలా కాలమునుంచి ఉన్నది. కనుక అందులో విశేషంగా కావలసిన సామగ్రిని తయారుచేసే ఏర్పాటులు జరుగుతున్నాయా ?

THE HON. SRI N. SANJEEVA REDDI .-అవసరాన్నిబట్టి ఎప్పుడు ఏది కావలయునంటే అది తయారుచేసుకుంటారు. ఇది అక్కడ చేయాలి అనే నిర్ణయము లేదు. ఇంజనీర్లు అవసరాన్నిబట్టి పరికారాలు నిర్ణయించుకొని తయారు చేసుకుంటారు.

Sri V. VISWESWARA RAO :—అధ్యక్షా ! మొదటి పంచవర్ష ప్రణాళికక్రింద అమెరికా ఇస్తున్నటువంటి 13 లక్షల రూపాయిలూ పెట్టి ఈ workshop ను నిర్మిస్తున్నారా ? మన ప్రభుత్వము నిర్మించడము జరుగుతోందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :-ఈ ఎనిమిదిలక్షలుకూడా మన స్వంతమే.

SRI L. LAKSHMANA DAS :— అధ్యక్షా ! ఈ workshop లో ఇప్పుడు ఈ ప్రాజెక్టులకు కావలసినటువంటి పనులకే అంటున్నారు. దానిలో agricultural implements పంపింగ్ సెట్లు తయారుచేయడానికి ప్రభుత్వము ఏమైనా ఆలోచిస్తున్నదా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—Commercial Basis పైనా ఏమీచేయదలచుకోలేదు. ఇది P. W. D. Work shop లు మాత్రమే వ్యాపారసంస్థలు కాదు. P. W. D. కి కావలసినటువంటి పనిముట్లువారు తయారు చేసుకొంటారు. ఇంకేమైనా కావాలంటే ప్రభుత్వమువారు ఇంకో కంపెనీ పెట్టుకొని తయారుచేసుకుంటారు.

SRI S. VEMAYYA :—ఈ workshop irrigation కు సంబంధించినటువంటిదే కాకుండా ప్రైవేట్ డిపార్టుమెంటులో లారీలు, రోలర్లు చాలా idle గా వున్నాయి. వాటినికూడా రిపేరుచేయడానికి ఈ workshop లను కొంత విస్తరణ చేసి ప్రోత్సాహము చేయడానికి ప్రభుత్వము పూనుకుంటుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—వాటికి ప్రత్యేకమైన work shop లు వుంటే మంచిదా లేక దాంట్లో కలిపితే మంచిదా అనే విషయము ఆలోచించాలి. ఇప్పుడు ఇరిగేషన్ వారికి అంత అవకాశాలు వున్నాయో లేదో తెలియదు. దానికి మరొక ప్రశ్న వేస్తే సమాధానము చెబుతాను.

*Peishkush collected in Fasli* 1363.

490—

* 139 Q. —SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Revenue be pleased to state—

(*a*) the amount of Peishkush collected in Fasli 1363 ; and

(*b*) the amount yet to be collected in the State ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(*a*) An amount of Rs. 13,96,969-14-11 was collected towards peishkush in Fasli 1363.

(*b*) The balance of peishkush outstanding at the end of Fasli 1363 was Rs. 14,95,215-13-3.

SRI S. VEMAYYA :—14 లక్షల 95 వేల రూపాయలు peishkush వసూలు కాకుండా నిలబడిపోయింది. దానిని వసూలుచేయడానికి ప్రభుత్వము ఏమి చర్యలు తీసుకొంది.

THE HON. SRI K. CHANDRAMOULI :—వాళ్ళకు in turn payments compensation లు మనముకూడా ఇవ్వవలసివున్నది. ప్రతి [illegible]

అప్పుడప్పుడు పిలుసుబట్టి ఈ మొత్తమునుంచి adjust కొంతవరకు చేస్తూవుంటారు. కొంతవరకు payments కూడా జరుగుతున్నాయి.

SRI PILLALAMARRI VENKATESWARULU :—వారికి ఇవ్వవలసిన payments వారిముందర మినహాయించు కుంటారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—మనకు వారు ఇవ్వవలసిన మనము వారికి ఇవ్వవలసినదాంట్లో adjustment చేసుకొంటాము.

Sri P. GOPALU REDDI:—అధ్యక్షా, ఆంధ్ర దేశములో తిరుత్తని తాలూకాలో కొన్ని గ్రామాలల్లో అధికముగా రైతులవద్ద వసూలుచేయబడి ప్రాప్రయిటర్లకు చేరింది. అటువంటి మొత్తము ప్రభుత్వము ఇప్పుడు adjust చేయడంలో రైతులకు ముందర ఇస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అసలు ప్రశ్నకు దినికీ సంబంధము లేదు. అయినా చిత్తూరు జిల్లాలో బకాయిలు వున్నాయి.

*Top level services of Health and Medical Departments.*

491—

* 154 Q.— SRI S. VEMAYYA: Will the Hon. Minister for Planning and Industries be pleased to state whether there are proposals for amalgamation of the top level services of Health and Medical Departments in the State now ?

THE HON. SRI K. VENKATA RAO :

The answer is in the negative.

SRI S. VEMAYYA :—లోగడ ఈ పెద్ద ఉద్యోగస్థులంతా కూడా ఒకటిగా చేసి పని సాగించాలనేటటువంటి విచారణ జరుగుతున్నట్లు తెలిసినది. ఆ విచారణ ఏమైనా జరిగినదా ? జరిగితే drop చేశారా ?

THE HON. SRI K. VENKATA RAO :—లోగడ అంటే ఎంత దూరము వెనక్కు పోతుందో నాకు తెలియదు. నేను charge తీసుకున్న తరువాత ఇటువంటి విచారణ జరగలేదు.

*House-sites to Harijans in Andhra State.*

492—

*1130 Q.—SRI M. RAJARAM : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state the

amount allotted for house-sites to Harijans in Andhra State and the amount spent in Anantapur district for 1954-55 ?

THE HON. SRI G. LATCHANNA :—

Amount provided in the Budget for 1954-55 for house sites to Harijans was Rs. 2·6 lakhs, in addition to the special fund of Rs. 10 lakhs constituted for the purpose.

The amount spent in 1954-55 in Anantapur District was Rs. 10,781-0-5.

THE HON. SRI G. LATCHANNA :—హరిజనులకు ఇండ్ల స్థలముల నిమిత్తమై 10 లక్షల రూపాయిలు ప్రత్యేకనిధి కాకుండా బడ్జటులో కూడా 1954-55 సం॥ మునకు 2 లక్షల 60 వేల రూపాయలు కేటాయించబడ్డది. 1954-55 సం॥ లో రు. 10,781 అనంతపురం జిల్లాకుగాను ఖర్చు చేయుబడింది.

SRI N. C. SESHADRI :—అధ్యక్షా, ఇది house-sites కు మాత్రమే అని మంత్రిగారు సెలవిచ్చారు. ఇండ్లు కట్టుకోడానికి గాను హరిజనులకు ఏమైనా ఈ సోషలు వెల్‌ఫేర్ డిపార్టుమెంటువారు ప్రావిజను చేస్తున్నారా ? చేస్తుంటే వివరాలు ఎక్కడ అయినా ఇచ్చినారా ?

THE HON. SRI G. LATCHANNA :—ఇచ్చినాము. కాని ప్రశ్న ఇండ్ల స్థలాలకు అని మాత్రమే పెట్టబడింది. దానిని మాత్రమే సమాధానము చెప్పాను. ఇండ్లు కట్టుకోవడం విషయంలో ప్రభుత్వము ఆలోచిస్తున్నదని ఇదివరకు 2, 3 పర్యాయములు శాసన సభలో చెప్పినాను.

SRI P. SREERAMULU :—హరిజనుల ఇండ్ల స్థలాలకు ప్రతి సంవత్సరము acquisition proceedings చాలా ఆలస్యము అవుతున్నందువల్ల ఏ సంవత్సరము కేటాయించబడుతున్న ధనము ఆ సంవత్సరము ఖర్చు అవుతున్నదా ? లేక lapse అవుతున్నదా ?

THE HON. SRI G. LATCHANNA :—Lapse అయ్యే అవకాశము లేదు. ఒక వేళ ఏవైనా గత సంవత్సరము ఖర్చుకాకపోతే జమ తెచ్చుకోవడము జరుగుతున్నదిగాని lapse అవడములేదు. ఇప్పుడు గౌరవనీయులైనటువంటి సభ్యులు చెప్పిన పరిస్థితులను బట్టి ప్రత్యేకంగా 13 గురు ఆఫీసర్లను అదనంగా acquisition కార్యక్రమము-తొందర చేయడానికిగాను తయారు చేయబడ్డది. వారు ఈ అక్టోబరు ఒకటవ తేదీకి రిపోర్టులు పంపవలసినదిగా తాకీదులు పంపబడ్డాయి, 2, 3 రోజుల్లోనే రిపోర్టులు రాబోతున్నాయి.

SRI B. SANKARAIAHA :—ఇప్పుడు చాలాకాలము pending లో ఉన్నటువంటి వాటినీ అన్నింటికీ మొట్ట మొదట పూర్తిచేయుడానికి త్వరలో ఏదైనా చర్య తీసుకుంటారా ?

THE HON. SRI G. LATCHANNA :—నేను దీనికి ఇందాక సమాధానము చెప్పాను.

11-30 a.m.

SRI K. BRAHMANANDA REDDI:—ప్రస్తుతం అమలులో ఉన్నటువంటి Land Acquisition Act క్రింద చర్యతీసుకోవాలంటే ప్రభుత్వానికి 10 సంవత్సరాలలో కూడా వీలులేదు అని ప్రభుత్వానికి తెలుసునా ? ఆ Act amend చేయడానికి ప్రభుత్వ ఆలోచనలో ఉన్నారా ?

THE HON. SRI G. LATCHANNA :—రివెన్యూ డిపార్టుమెంటువారు దీనిని గురించి పరిశీలన చేస్తున్నారు. ఇప్పుడు ఉన్న Act లోనే acquisition proceedings తొందర చేయడానికి special rules క్రింద కార్యక్రమం నడిపించాలని జిల్లా కలెక్టర్లకు తాఖీదులు ఇవ్వబడ్డాయి.

SRI P. SATYANARAYANA RAJU :—House sites గురించి 1948 సంవత్సరంలో రు. 474 లు డిపాజిట్ చేశారు. ఇప్పటికికూడా ఈ సంగతి తేలలేదనే సంగతి ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON. SRI G. LATCHANNA :—గౌరవ సభ్యులు ఉత్తరం వ్రాస్తే భోగట్టా తెప్పిస్తాను. ఇది house sites గురించి వేసిన general ప్రశ్న.

SRI A. YERUKU NAIDU :—ఇండ్లస్థలాలుగురించి హరిజనులు స్వంత డబ్బును ప్రభుత్వానికిఇచ్చారు. స్థలాలుకొన్నప్పుడు ఆడబ్బు వారికి refund ఇస్తారా?

THE HON. SRI G. LATCHANNA :—ఇందులో refund కు సంబంధించిన ప్రశ్నలేదు.

SRI P. RAJAGOPAL NAIDU :—అదనంగా నియమించిన ఉద్యోగస్థుల కాలపరిమితిని అక్టోబరు తరువాత పొడిగిస్తారా ?

THE HON SRI G. LATCHANNA :—అవసరాన్నిబట్టి ఆలోచిస్తాము.

SRI G. NAGESWRA RAO :—1954, 1955 సంవత్సరాలలో 10 లక్షలు, 20 లక్షలు 60 వేలు రుపాయలు కేటాయించాము అన్నారు. ఇందులో నుంచి ఖర్చుచేసినతరువాత మిగిలింది ఎంతఉన్నదో తెలియచేస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—గత ఏడాది 10 లక్షలలో 2 లక్షలు ఖర్చు అయినది. 8 లక్షలు మిగులు 1955-56 లో చేర్చబడింది.

Sri K. VIJAYABHASKARA REDDI:—హరిజనులకు sites ఇచ్చే విషయంలో ప్రతి site కు ప్రతిగ్రామంలో తగాదాలు వస్తున్నాయి. అందరికి అనుకూలమైనచోట్లు చూపించడానికి ప్రయత్నిస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—తగాదాలు లేకుండాచేయాలనే ప్రభుత్వప్రయత్నం. సభ్యులు తోడ్పడితే సరిగానే చేయవచ్చును.

SRI P. SUNDARAYYA :—అక్టోబరు 1 నాటికి ఉన్న అన్ని దరఖాస్తులు dispose of చేస్తామని మంత్రిగారు గత శాసనసభలో వాగ్దానంచేశారు. ఆ రీతిగా house-sites దరఖాస్తులు మంజూరై హరిజనులకు ఇండ్లవసతులు దొరికాయా ?

THE HON. Sri G. LATCHANNA :—Pending గా వున్న దరఖాస్తులన్నీ అని general గా చెప్పలేదు. Acquisition proceedings నడుస్తున్నవన్నీ పూర్తిచేయడానికి తాఖీదులు పంపామని మనవిచేశాను. ఆ విషయమై రిపోర్టులుకూడా చేరబోతున్నాయి.

SRI P. SUNDARAYYA :—వీటివల్ల సంవత్సరాలకొలది ఇండ్లవసతులు రావడంలేదు. క్రొత్త Constitution ప్రకారం Act తెచ్చి ప్రభుత్వం సరాసరి acquire చేయడానికి ఆలోచిస్తుందా ?

THE HON. SRI G. LATCHANNA :—గౌరవసభ్యులు వేసినప్రశ్నకు ఈవిషయమై రివెన్యూడిపార్టుమెంటువారు ఆలోచిస్తున్నారని ఇదివరకే మనవిచేశాను.

SRI C. SUBBARAYUDU :—హరిజనులు కోరుకున్న స్థలాలు ఇవ్వడమా, లేక వీలుగావున్నచోట్ల ఇవ్వడమా ? కోరింది ఇవ్వాలనేకారణంచేత విలువైన పొలాలున్న రైతులను ఇబ్బందిపెట్టిన కారణంగా చాలాచోట్ల తగాదాలు వస్తున్నాయి. దీనిమీద ప్రభుత్వం చర్యతీసుకుంటూరా ?

THE HON. SRI G. LATCHANNA :—వారు కోరింది ఇవ్వాలని లేదు కాని వారికి అనుకూలంగా ఉండేది ఇవ్వాలని ఉన్నది. ప్రభుత్వం ఏస్థలం కొనడానికి వీలుంటే అది ఇస్తుంది. కోరితే ఇచ్చేది లేదు, వద్దంటే మానేదిలేదు, ప్రభుత్వం తన సౌకర్యం చూచుకుంటుంది.

SRI P. SUNDARAYYA :—హరిజనుల ఇండ్లవసతులకోసమై ఏర్పాటు చేసిన స్థలాలను భూస్వాములు హరిజనులకు దక్కకుండా చేయడానికి రు. 200 లు ఖరీదుచేసే స్థలాలను రు 2000 లు, రు. 10,000 లు అనిచెప్పి దరఖాస్తులు పెట్టుకున్నా ఆలస్యంచేయడం ప్రభుత్వదృష్టిలోనికి వచ్చిందా ?

THE HON. SRI G. LATCHANNA :—ఖరీదులు విషయంలో ఇరుగు పొరుగు market rates ను బట్టి ఉంటుంది కాని ఎంత అడిగితే అంతా ఇవ్వరు.

Sri T. JIYYAR DAS :—ఇండ్లస్థలాలకోసము ప్రత్యేకించిన 10 లక్షలు బడ్జెటులో సూచించిన 20 లక్షల 60 వేలరుపాయలు పెట్టి ప్రత్యేకంగా మాలపల్లెలు, మాదిగపల్లెలు కట్టిస్తారా? గ్రామంమధ్యలో Compulsary Acquisition Act క్రింద స్థలాలు సేకరించడానికి వినియోగిస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—ఇపుడు ఎటువంటి అవకాశం వుంటే ఆవిధంగా పరిశీలిస్తాను.

*House-sites for the Harijans in Srikakulam district.*

**493—**

* 1066 Q.—SRI P. GUNNAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(*a*) the amount sanctioned by the Government towards the house-sites for the Harijans in Srikakulam district for 1953–54 ;

(*b*) the villages to which subsidies were paid up to the end of March 1955 ; and

(*c*) the amount spent and the balance ?

THE HON. SRI G. LATCHANA :

(*a*) Rs. 4,700.

(*b*) Nil.

(*c*) Amount spent Rs. 1078-13-1,
Balance Rs. 3621-2-11.

SRI P. GUNNAYYA :—శ్రీకాకుళంజిల్లాకు ఇచ్చినవి 10 వేలరూపాయ. అందులో ఖర్చు అయినవి రు. 1000 అని మంత్రిగారు సెలవిచ్చారు. ఇటు

పైన ఎక్కువడబ్బు ఎక్కువస్థలాలు ఇచ్చి హరిజనులకు సదుపాయాలు చేయడానికి ఏర్పాట్లు చేస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—ప్రశ్న 1953-54 కు సంబంధించింది కాబట్టి అప్పటిలెక్కలు చెప్పాను. గత ఏడాది 10 లక్షలు కేటాయిస్తే సమస్థాయాలలో అన్నిజిల్లాలకు బట్వాడాచేయడం జరిగింది. అందువల్ల సభ్యులు తమ జిల్లాకు తగ్గిపోతుందనే ఆదుర్దా అవసరంలేదు.

*Rural Co-operative Housing Society, Palasa.*

494—

* 1343 Q.—SRI N. RAMULU : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state—

(a) whether it is a fact that the Rural Co-operative Housing Society, Palasa, since its inception could not grant more than one loan in spite of having a Senior Inspector of the Department as its paid secretary at the cost of Government for a period of two years ; and

(b) if so, the reasons therefor ?

THE HON. SRI D. SANJIVAYYA :

(a) No, Sir. Out of ten loan applications sent so far by the society to the Registrar of Co-operative Societies, seven loan applications have been sanctioned ; one applicntion was returned to the society as the applicant was reported to have died ; and one was rejected as the repaying capacity of the applicant was found to be inadequate. In the remaining application further documents to prove the legal title of the applicant to the site have been called for from the society and they are still awaited.

(b) Does not arise.

SRI N. RAMULU :—ఈ Co-operative Inspector కు జీతంక్రింద రెండు సంవత్సరాలుగా రు. 3000 లు ఖర్చుచేసి నప్పుడుఒక loan క్రింద రు. 5000 లు grant చేశారు కదా. రు. 8000 లు ఖర్చుచేసి రు. 5000 లు loan ఒకటి grant చేయడంలో ఇది department అశ్రద్ధ అని ప్రభుత్వానికి తెలుసునా?

[3rd October 1955

THE HON. SRI D. SANJIVAYVA :—నేను చదివిన answer వినలేదనుకుంటాను.

SRI N. RAMULU :—ఒకటే grant సొమ్ము ఇవ్వబడింది. మిగతా వాటికి ఇవ్వబడలేదు. రెండుసంవత్సరాలు ఉద్యోగంలో ఉండి రు. 3000 లు జీతం తీసుకుని ఒకే application కు రు. 5000 ఇచ్చారు. రు. 5000 లు ఇవ్వడానికి రు. 3000 లు ఖర్చుచేసిన...

MR. SPEAKER :—You are making a speech.

THE HON. SRI D. SANJIVAYYA :—దానికికూడా కారణం ఉన్నది. 1953 జనవరి ప్రాంతంలో Composite State లో రు. 3000 లు కంటె ఎక్కువ అప్పు యివ్వకూడదని అందులో సభ్యులుగా వున్నవారికి ఆదాయం నెలకు రు. 200 కంటె మించకుండా వుండాలని ఉండేవారికి యివ్వకూడదని ఒక విధానం ఏర్పాటు చేశారు. ఆ కారణంగా ఈ application sanction చేయడానికి వీలులేక పోయింది. ఆంధ్రప్రభుత్వము ఏర్పడిన తరువాత రు. 5000 లు వరకు అంతకు ముందువున్న విధానం అమలుచేస్తూ ఏర్పాటు చేశారు. అందువల్ల 7 applications sanction అయినాయి.

SRI N. RAMULU :—ఏడు applications grant అయినాయి. కాని సొమ్ము ఒక application కు మాత్రమే ఇచ్చారు. మిగతా వాటికి ఇవ్వలేదు.

MR. SPEAKER :—You are making a speech.

THE HON. SRI D. SANJIVAYYA :—నాదగ్గరవున్న information ను బట్టిచూస్తే ఏడు applications విషయంలో loans sanction అయినాయి అని వున్నది. Actual గా disbursement అయినదా, లేదా అంటే నాదగ్గర information లేదు. కావాలంటే తెప్పిస్తాను.

*Supply of wagons for movement of paddy.*

495—

* 370 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Chief Minister be pleased to state whether this Government have requested the Government of India to arrange for more wagons for the movement of paddy in and from the State ?

THE HON. SRI B. GOPALA REDDI :

Yes.

SRI S. VEMAYYA :—కేంద్రప్రభుత్వముతో మనరాష్ట్రం సంప్రదింపులు ఎప్పుడు మొదలుపెట్టింది? అక్కడనుండి జవాబు రాకపోతే రిమైండరు ఇచ్చిందా? ఎంతకాలంలో జవాబువస్తుందని ఆశించవచ్చును?

THE HON. SRI B. GOPALA REDDI :—చాలాకాలం క్రిందటనే సంప్రతింపులు ప్రారంభించారు. ఇవి రైల్వేవారు చెయ్యవలసిన విషయాలు. బెజవాడనుంచి మద్రాసుకు ఎక్కువ వాగన్లు ఇవ్వడానికి ప్రయత్నం చేస్తున్నారు.

SRI B. SANKARAIAH :—Temporary గా wagons supply అయ్యేవరకు పడవలు యితర విధాలకూడా ఎగుమతి సౌకర్యం కలుగ చేస్తారు. ఇప్పుడు చాలా ఇబ్బందిగాఉంది.

THE HON. SRI B. GOPALA REDDI :—Inland Water ways Board అని ఒకటి వున్నది. అది పడవలలో సరకులు తీసుకుపొయ్యేదానికి వీలువుంటుందా అని ఆలోచిస్తున్నది.

*Widening of Upputeru Drain.*

496—

* 938 Q.—SRI M. RAJESWARA RAO : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(*a*) whether there is any scheme with the Government for widening of "Upputeru Drain" in Krishna district ; and

(*b*) if so, whether the Government propose to take up the scheme during this year ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(*a*) & (*b*). The Scheme was deferred by the Government of the composite State in March 1953 and this Government propose to take it up under the Second Five Year Plan.

*Kollair Drainage Scheme.*

496-A—

*936 Q.—SRI M. RAJESWARA RAO : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(*a*) whether there is any estimate with the Government for the Kollair Drainage Scheme ?

(*b*) if so the total estimated cost of the same ;

(c) the total extent of land subjected to submersion by the Kollair Drain every year ; and

(d) whether the Government have recommended this scheme to the Planning Commission ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) The following schemes to give drainage relief to the Kollair area are under the consideration of the Government

(1) Buddameru Reservoir

(2) Budameru Diversion.

(3) Budameru drain improvements.

(4) Tammileru Reservoir.

(5) Upputeru widening scheme.

(b) The total cost of the above five schemes will be about 4·5 crores.

(c) About 1·5 lakhs of wet area and 50,000 acres of dry area.

(d) The above schemes have been included in the draft Second Five Year Plan under the Flood Control programme.

SRI M. RAJESWARA RAO:—ఇప్పుడు ఈ ఉప్పుటేరు widen చెయ్యక పోవడంచేత కొల్లేరు నూపరిసీడు కాలేను. అందుచేత ప్రతిసంవత్సరము వందలాది ఎకరాలు submersion అగుతున్న విషయం ప్రభుత్వం గుర్తించిందా ? గుర్తించినట్లయితే widen చెయ్యడం ద్వారానే తీసివెయ్యడానికి వీలు అగుతుందా ? నాలుగు స్కీములు అన్నారు కదా widen చెయ్యడం అవసరం లేదని ప్రభుత్వం భావిస్తుందా?

THE HON. SRI N. SANJEEVA REDDI :—మళ్ళీ చదువుతాను. రాజేశ్వరరావుగారు అర్థము చేసుకున్నట్లు లేదు.

(Read in English.)

ఈస్కీములు కేంద్ర Planning Commission కు పంపించాము. 12 కోట్ల 78 లక్షలు ఆంధ్రరాష్ట్రివరద నివారణకు కేటాయించినదానిలో గోదావరి, సోమశిల గాక ఇంకా ముఖ్యమైనవి వున్నాయి. ఇవి sanction చెయ్యబడ్డాయి. ఈ 4 స్కీములు include చెయ్యబడలేదు. నేను 5 వ తేదీన Flood Control Board మీటింగుకు Delhi పోతున్నాను. కేంద్రప్రభుత్వంతో మాట్లాడతాను.

SRI K. APPA RAO :—ఈ కొల్లేరు ప్రాంతములో మురుగు నీరు నివారణకు కొల్లేరు నదిభాగములో tourist కేంద్రముగా సరస్సుగా మార్చడానికి శ్రీ మూర్తిరాజు గారు ఇచ్చిన Memorandum మీ పరిశీలనవుతుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—Drainage సంగతి నాకు తెలుసునుగాని, tourist centre, other amenities hotels pleasure boats గురించి వేరే ప్రశ్న వేసి ఇంకో మంత్రిగారిని కనుక్కోండి.

SRI A. KALESWARA RAO :—బుడమేరుకు కట్టలువేసి నీరు కిందకు తీసుకుపోవడంలో మధ్య మధ్య కొన్ని చోట్ల గోగ్ర అడ్డం వస్తున్నదని అవి తీసివేసి కొల్లేరులోకి బుడమేరు నీరు పోకుండా ప్రభుత్వంవారు చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—మొదటి ప్రశ్నకు సమాధానం కాళేశ్వరరావుగారు వినలేదు. బుడమేరు Reservoir Diversion కాక Budamaru drain improvements అని చెప్పాను. అదికూడా consideration లో ఉంది.

SRI V. VISWESWARA RAO :—కొల్లేరులో మురుగు రావడానికి కైకలూరు, గుడివాడ తాలూకాలలో కొన్ని మురుగు కాలువలు ఎక్కువగా ప్రవహించడం జరుగుతుంది. ఈ నీటిని తీసుకువెళ్ళడానికి కొన్ని కాలవలను సరాసరి మరల్చడానికి proposals ఏమైనా ఉన్నాయా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—ఇవి main schemes. తమ్మిలేరుకూడా చేర్చాము. బుడమేరు ఒక్కటే కాదు. వాననీరు ఇంకా కలపవచ్చును. చిన్న చిన్నవి ఉంటే తరువాత సర్దుకోనవచ్చును. తరువాత Main Schemes బుడమేరు, తమ్మిలేరు ముఖ్యముగా కొల్లేరుకు ప్రమాదం ఉప్పుటేరు widen చెయ్యడం స్కీము ఉంది. అది తరువాత తీసుకోనవచ్చును. సెంట్రలు గవర్న మెంటుమీద ఆధారపడ నక్కరలేదు.

*Road bridge over Upputeru Drain.*

497—

* 939 Q.—SRI M. RAJESWARA RAO : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(*a*) whether the construction of a road bridge on the Upputeru drain in Krishna district was stopped and if so why ; and

(*b*) whether the Government propose to take up the work this year ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—

(a) The answer is in the negative.

(b) Does not arise.

Sri M. RAJESWARA RAO :—ఈ bridge నిర్మాణం ఆపు చెయ్య లేదని మంత్రిగారు శలవిచ్చారు. కాని రెండు సంవత్సరాలుగా. మేము చూస్తున్నాం Progress ఏమీ కన్పించడం లేదు. పై పెచ్చు ఉప్పుటేరు widen చెయ్యడంవల్ల ఇది ఆపుచేసారనుకుంటాను. కాని అది లేనట్లు మంత్రిగారు చెప్పారు. ఇది కృష్ణా పశ్చిమగోదావరి జిల్లాలకు మార్గములు, రవాణా సౌకర్యములు లేవు కాబట్టి దానిని త్వరలో పూర్తిచెయ్యడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—దానికి 10 సంవత్సరాల unfortunate history ఉంది. సర్దుకొంటున్నాము. 1948 లో estimates 2 లక్షలు అనుకొన్నది 10 లక్షలకు revised estimates లోకి పోయింది. ఇంకా ఎంతకు పోతుందో భయంగా ఉంది. Revised Estimates ఆలోచించి ఎందుకు ఇంతవరకు అయిందో ఆలోచించ వలసివుంది. ఆరులక్షలు ఖర్చు అయింది. ఇంకా పూర్తి కాలేదు. ఆలస్యం అయినది. అయినా ఫరవాలేదు. అవకతవకలు పాటించకుండా జాగ్రత్తగా ఆలోచిస్తాము.

SRI P. SUNDARAYYA :—Upputeru road bridge సమీపంలో railway bridge కట్టేటప్పుడు అక్కడ కృంగిపోతుందని Railway Engineers వ్రాశారు. అది గుర్తించకుండా ఈ పునాదులమీద మళ్లీ కట్టి 10 లక్షలు డబ్బు వృధా చెయ్యడంకన్నా cante lever bridge కడితే తేలికగా అవుతుందేమో ప్రభుత్వం పరిశీలిస్తుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—పరిశీలన చెయ్యక ముందే 6 లక్షలు ఖర్చుఅయింది. మళ్లీ యింకా bridge కడితే మరిఎంత అవుతుందోభయముగాఉంది. 2 లక్షలు, 3లక్షలతో పూర్తిచెయ్యాలని అనుకొంటున్నాము. అది వదలిపెట్టి మరో బ్రిడ్జి కట్టడం మంచిదికాదేమో.

SRI P. SUNDARAYYA :—రెండు, మూడు లక్షలు అయితే ఫరవా లేదు. బురదలోపోసిన 6 లక్షలతోపాటు ఇంకో రెండు మూడు లక్షలుపోస్తే ఆ బురదలోనే కృంగిపోతుందేమో. పోసింది పోశాము. బురదలో దిగకుండా హుగ్లీ మాదిరి cante lever bridge కడితే తక్కువతో ప్రభుత్వం బయటపడుతుందని నేను చెబుతున్నాను,

THE HON. SRI N. SANJEEVA REDDI:—ఇదికూడా బురదలో పోసినట్లు అయితే కట్టడం నిలిపివేస్తాం. మీసలహా ఇంజనీర్ల బాగావుంటే మేము ఆలోచిస్తాము.

*Treasure Trove finds in the year* 1953-54.

498—

* 374 Q. SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Revenue be pleased to state—

(i) the number of cases received ;

(ii) disposed of ;

(iii) pending, for the year 1954 under Treasure Trove Act in the State ; and

(iv) the Treasure Trove finds acquired in the year 1953-54 ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(i) :— 17

(ii) :— 8

(iii) :— 9

(iv) :— 9 gold coins weighing 2½ tolas found in Mittapalli villageg, Palamaner Taluk, Chittoor district, were acquired under the Treasure Trove Act, during the year 1953-54.

Sri S. VEMAYYA :—1952 సంవత్సరంనుండికూడా నెల్లూరు జిల్లాలో కేసులు వున్నవి. నేనుకూడా కలెక్టరు దృష్టికి తీసుకువచ్చినా ఏమి జరిగిందో తెలియదు. అది చెప్పగలరా?

THE HON. Sri K. CHANDRAMOULI :—1953 గురించి ప్రశ్న అడిగినారు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా, 1953-54 సంవత్సరం మధ్యలో అమరావతిదగ్గర 350 పెగోడాలు అన్న పేరుతో నాణెములు దొరికినవి. వాటిని తహశీల్దారు తీసుకొని, బజారులో వేలము వెయ్యడానికి గెజెట్ నోటిఫికేషను చేశారు. Treasure Trovs Act క్రింద అమ్మడానికి వీలులేదన్నారే, వాటిని అమ్మారో లేదో తెలియదు. ఎక్కడ ఉంచేవారు?

THE HON. SRI K. CHANDRAMOULI :—వేరప్రశ్న వెయ్యండి.

12 Noon.

*Attacks and deaths from small-pox in the State.*

499—

*1 9 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state the number of small-pox attacks and the number of deaths in the State for the year ending 1954 ?

THE HON. SRI K. VENKATA RAO :—

The number of attacks and deaths from small-pox in the State during the year 1954 are 3069 and 346 respectively.

THE HON. SRI K. VENKATA RAO :—1954 సంవత్సరంలో 3069 మందికి మసూచికం తగిలింది. అందులో 346 గురు చచ్చిపోయారు.

SRI S. VEMAYYA :—క్రొత్తగా ఏదైనా preventive measures ప్రభుత్వం తీసుకుంటుందా లేక పోతే పాతపద్ధతులే అనుసరిస్తూ ఈ మరణములసంఖ్య పెరుగుతూవుంటే చూస్తూ ఊరుకుంటారా?

THE HON. SRI K. VENKATA RAO:—మసూచికానికి మందెవ్వరూ ఇంకా కనిపెట్టలేదండి.

*Works under the Planning Scheme..*

500—

*1134 Q.—SRI M. RAJARAM : Will the Hon. Minister for Electricity and Social Welfare be pleased to state whether there is any proposal to exempt the Harijans from contributing the half share of estimated expenditure in rural areas for the works which will be started under the Planning Scheme ?

THE HON. SRI N. SANJEEVA REDDI :

No, Sir.

The Government have instructed the Collectors of Districts that in respect of works undertaken for the benefit of Harijans under the National Extension Service, Community

Development and Community Project Schemes, the quantum and nature of contribution by way of money, labour or material etc. should be fixed with due regard to their paying capacity, maximum relaxation being allowed in hard cases.

THE HON. SRI G. LATCHANNA :—లేదండి. హరిజనుల విషయంలో contribution ఇవ్వవలసి వచ్చేటప్పుడు వారిశక్తి సామర్థ్యాలను దృష్టిలో పెట్టుకొని వస్తురూపంగాగాని, డబ్బురూపంగాగాని చందాలు నిర్ణయించవలసినదిగా జిల్లా కలెక్టరుకు తాఖీదులు చేయబడ్డవి.

*Grant of forest lands in Divi taluk for cultivation.*

501—

* 940 Q.—SRI M. RAJESWARA RAO . Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether the villagers of Edurumondi of Divi taluk, Krishna district, have applied for a grant for cultivation of the forest lands (Mada forest) within the limits of Edurumondi and whether the same is pending with the Collector, Krishna District since 1953 ; and

(b) if so, the action proposed to be taken in the matter ?

THE HON. SRI B. GOPALA REDDI :

(a) No, Sir.

(b) Does not arise.

*New type tear smoke material used by Police Department.*

502—

* 1447 Q.—SRI N. VENKATAYYA : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether a new type tear smoke material is being used by the Police Department ; and

(b) if so, what is the cost of the same ?

THE HON. SRI N. SANJEEVA REDDI :

(*a*) No, Sir.

(*b*) Does not arise.

*Resolutions passed by the Pandits Conference at Tirupati.*

503—

*1150 Q.—SRI A. KALESWARA RAO : Will the Hon the Minister for Revenue be pleased to state—

(*a*) the important resolutions passed by the Pandits' Conference convened by the Minister at Tirupathi regarding the renovation of old Hindu Temples ;

(*b*) whether the representatives of Trustees and Archakas were invited for the conference ;

(*c*) The action proposed to be taken by the Government on those resolutions ; and

(d) the steps taken to give training to Archakas in the procedure of worship ?

THE HON. SRI K. CHANDRAMOULI :

(*a*) The following is the text of the resolution passed at the Tirupati conference regarding renovation of temples.

"శిల్ప వైశిష్ట్యముకలిగి దేశీయ సంస్కృతికి చిహ్నములై నేడు క్రమముగా జీర్ణించి పోవుచున్న దేవాలయములు ఆంధ్ర దేశమున పలు ప్రాంతములయందు బహు సంఖ్యాకముగా నుండుటను యీ సభవారుగుర్తించి పునరుద్ధరణము సర్వవిధములా వాంఛనీయమని తలచుచూ ఏతత్ జీర్ణోద్ధార కార్యమును లక్ష్యముగా పెట్టుకొను సంఘములను ఆంధ్ర ప్రాంతమునందంతటను నెలకొల్పి వాటిద్వారా జీర్ణాలయ పునరుద్దరణను గావించుట కర్తవ్యముగా యీ సభవారు నిర్ణయించుచున్నారు.

ఈ విధముగా జరుగు ఆలయ పునరుద్ధరణములు పూర్వ సంస్కృతికి శిల్పకళా సాంప్రదాయమునకును అనుకూలముగా నుండవలయునని ఈ సభ వారు తీర్మానించు చున్నారు."

(*b*) No representatives of trustees and archakas as such have been invited as the conference is primarily intended to be a conference of Pandits and departmental officers.

Some of the invitees may be trustees of some temples. Sri Bhagavatula Annapurnayya Sastry Garu who has been invited for the conference is one of the trustees of the Tirumalai Tirupathi Devasthanam. Similarly, Sri D. Ranganathacharyulu of Tenali is the General Secretary of the Archaka Congress. They have been invited in their personal capacity as Pandits.

(*c*) & (*d*) The resolutions passed at the conference and also the proposals for training of archakas are under examination.

THE HON. SRI K. CHANDRAMOULI : తిరుపతి సమావేశములో ఈ క్రింది విధముగా తీర్మానము చేయబడినది:—

"శిల్పవైశిష్ట్యం కలిగి దేశీయ సంస్కృతికి చిహ్నములై, నేడు క్రమముగా జీర్ణించిపోవుచున్న దేవాలయములు ఆంధ్రదేశమున పలుప్రాంతములందు బహు సంఖ్యాకముగా నుండుటను ఈ సభవారు గుర్తించి పునరుద్ధారణ సర్వవిధముల వాంచనీయం అని తలచుచూ ఏ తజ్జీర్ణోద్ధారణకార్యమును లక్ష్యముగా పెట్టుకొను సంఘములను ఆంధ్రప్రాంతమునం దంతటను నెలకొల్పి వాటిద్వారా జీర్ణాలయ పునరుద్ధరణను గావించుట కర్తవ్యముగా ఈ సభవారు నిర్ణయించుచున్నారు. ఈ విధముగా జరుగు ఆలయ పునరుద్ధరణములు పూర్వసంస్కృతికి శిల్పకళాసాంప్రదాయమునకూ అనుకూలంగా నుండవలెనని ఈ సభవారు తీర్మానించుచున్నారు."

(B) No representation......

అర్చకులను, ధర్మకర్తలను అక్కడకు పిలవలేదు. కాని పిలచినటువంటి officer లు, పండితులలో కొంతమంది అర్చకులుగా వుంటే వుండవచ్చును. ధర్మకర్తలుగా వున్నవారుకూడా వుంటే వుండవచ్చును.

(c) and (d) అక్కడ pass చేసినటువంటి తీర్మానాలవిషయం, అర్చకులకు శిక్షణ ఇచ్చేటటువంటి విషయం ప్రభుత్వంయొక్క అలోచనలో వున్నది.

Sri A. KALESWARA RAO :—ఈ దేవాలయాలలో వేదవేదాంగ శాస్త్రములన్నిటినీ బోధించడానికి పాఠశాలలు పెడతారా?

THE HON. Sri K. CHANDRAMOULI :—ఒకటిరెండు చోట్ల వున్నాయండి. అవకాశాన్నిబట్టి సద్వినియోగం జరుగుతుంది. అక్కడ సంఖ్య ఎక్కువగావుండి, అవసరమైతే తరువాత ఇంకా ఎక్కువచేస్తాం.

SRI G. RAMI REDDI :—అధ్యక్షా, రాష్ట్రంలోని అనేక పురాతన దేవాలయములు ఏ register లోనూ లేకుండా వాటికున్నటువంటి భూములన్నీ ఎవ రెవరో అనుభవిస్తున్నారే, ఆ విషయము సమగ్రమైన పరిశీలనచేసి వాటిని పునరుద్ధరణ చేసి ఆభూములను ఆ దేవాలయమునకుచేర్చే ప్రయత్నం ఏమైనా చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇతరు లనుభవిస్తే ఊరుకోరండి. అవిదేవాలయాలకు సంబంధించినవి కాబట్టి దేవాలయానికే ఉంటాయి.

SRI M. NAGI REDDI :—హిందూదేవాదాయ ధర్మాదాయ కమిషనర్ గారు ఆంధ్రరాష్ట్రంలో వీటిమీద ఇచ్చిన report లో ఈ అర్చకులు దేవునికి నైవేద్యం పెట్టడానికిబదులు రాళ్లు నైవేద్యం చేయడానికే మొత్తం డబ్బు అంతా సరిపోతోంది అని వ్రాశారు. దాన్ని అరికట్టడానికి పనులు సక్రమంగా నెరవేర టానికి ప్రభుత్వం ఏమి చర్యలు తీసుకుంటుంది ?

THE HON. SRI K. CHANDRAMOULI :—దేముడికి నైవేద్యంపెట్టి మనకూ పెడతారు. అర్చకులూ తింటారు.

SRI RAJA V. V. KRISHNAMRAJU BAHADUR:— అధ్యక్షా ! మంత్రిగారు ఎన్ని పాడుబడిన దేవాలయాలు బాగుచేయించుటకు ఏర్పాటుచేసే దృష్టిలో వున్నారో సెలవిస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI:—చేయించాలనే ఆలోచనే ఆ తీర్మానముయొక్క వుద్దేశం.

SRI A. KALESWARA RAO :—మన జాతీయనాగరికతా పునాది యావత్తున్నూ మన ప్రాచీనశాస్త్రములలో వున్నది కనుక వాటిని పునరుద్ధరణచేసి తెలుగులోకూడా ప్రచురించి, సంస్కృతమునుకూడా అభివృద్ధిచేసి అన్ని జాతులకూ నేర్పేటట్లుగా అది ఒక జాతీయప్రణాళిక చేయుటకు ప్రభుత్వంవారు ఆలో చిస్తున్నారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—పంతులుగారివంటివారు తోడ్పడి అటువంటిప్రణాళిక కనుక ఏర్పడితే ప్రభుత్వంకూడా దాన్ని తప్పకుండా అమలుజరపడానికి ఆలోచించి ఏదోవిధంగా చేయడానికిసంసిద్ధంగా యున్నది.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా ! పూజార్లకు, ట్రస్టీలకు దేవుడిమీద భక్తి తగ్గిపోతుంటే వారు ప్రజలకు ఎల్లాభక్తి నేర్పగలుగుతారండీ ?

THE HON. SRI K. CHANDRAMOULI :—భక్తి వున్నవారు చాలా మంది వున్నారు, ఈదేశంలో. అందువల్ల వారికోరకేనండి. ఇది భక్తిలేనివారి కొరకు కాదు.

SRI N. C. SESHADRI :—ఇటీవల వార్తాపత్రికలలో ఈ అర్చన క్రమ మంతాకూడా సంస్కృతంలోనుంచి తెలుగులోకి తర్జుమా చేయాలని ప్రభుత్వం ఆలోచిస్తుందని చూచాం. అది ఎంతవరకూ నిజమో సెలవిస్తారా.

THE HON SRI K. CHANDRAMOULI :—అదేమీ అనుకోలేదండి నాకు తెలిసినంతవరకూ.

SRI S. VEMAYYA :—అస్పృశ్యతా నివారణ ప్రభుత్వవిధానంకనుక, కొంతమంది హరిజనులకుకూడా training ఇచ్చి అర్చకులుగా appoint చెయ్యడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—ఒకసారి ఈ ప్రశ్నకు answer చెప్పానండి.

SRI A. KALESWARA RAO :—దేవుణ్ణినమ్మని కమ్యూనిస్టులకుకూడా ఈ అర్చకులలో ఏమైనా స్థానం ఇస్తారా ?

The Hon. SRI K. CHANDRAMOULI :—దేవునిమీద విశ్వాసం లేనివారికి దేవాలయంలో స్థానమే లేదండి.

Sri P. SREERAMULU:—ఈ అర్చనలు పూజలు వగైరాలు సంస్కృతమునుంచి మార్చి అచ్చతెనుగులోనే జరుగుటకు, ఏర్పాటుచేస్తారా ?

THE HON SPEAKER :—లేదని చెప్పారండి.

SRI N. VENKAIAH :—ఈ అర్చకుల విధులకు సంబంధించిన పుస్తకాలు ప్రచురణ చేస్తారా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—చాలా పుస్తకాలు ఇదివరకే ప్రచురణ చేయబడ్డాయండి.

***Irrigation facilities to Kothapeta Panchayat area.***

501.—

*871 Q.— SRI PRAGADA KOTAIAH : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state

the action taken on the resolutions passed by the Kothapet Panchayat Area Development Committee at its meeting on 12th May last at Chirala requesting that certain area in their panchayat be included in the National Extension Service Scheme, for provision of irrigation facilities and for development of 'Vadarevu' into a minor port ?

THE HON. SRI K. VENKATA RAO :

A copy of the resolution requesting that the Kothapet Panchayat area be included in the National Extension Service Scheme was communicated to the Collector of Guntur. The Collector had already been asked to submit proposals regarding the demarcating of the entire district into National Extension Service Blocks. The Collector's proposals have been received and are under examination.

The request made in resolution for provision of irrigation facilities was passed on to the Chief Engineer (Irrigation) for necessary action.

As regards the request for the development of Vadarevu into a minor port, the Government have, after examination, decided that there is no case for reopening a minor port at Vadarevu in view of the poor trade offering at the place.

THE HON SRI K. VENKATA RAO:—జాతీయ విస్తరణప్రణాళికలో చేర్చవలసినదిగా కోరుతూ కొత్తపేట పంచాయితీవారు చేసినటువంటి తీర్మానం గుంటూరు జిల్లాకలెక్టరుగారికి పంపబడియున్నది. గుంటూరుజిల్లాలో ఎక్కడెక్కడ జాతీయవిస్తరణ ప్రణాళికలు, ఏ ఏ సంవత్సరాలలో పెట్టింది Report చేయవలసినదిగా కలెక్టరుగారికి వ్రాయడమైనది. కలెక్టరుగారు అక్కడివారి అభిప్రాయాలు, అక్కడ ఏమిపని చెయ్యవలసియుంటుందో ప్రభుత్వానికి తెలియపరిచారు. అవి ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారు. తమ గ్రామానికి నీటిపారుదల సౌకర్యాలు చేయవలసినదిగా కోరుతూ వ్రాసినదానిని Irrigation Chief Engineer గారికి తగుచర్య తీసుకొనుటకు పంపించడమైనది. వాడరేవును ఒక చిన్నరేవుగా తయారు చేయవలసిందని ఆ తీర్మానంలో వ్రాయబడిన విషయాన్నిగురించి ప్రభుత్వంయొక్క అభిప్రాయమేమంటే అక్కడ రేవు పెట్టడానికి సరిపోయినటువంటి వర్తకం లేదు కనుక వాడరేవును చిన్నరేవుగా అభివృద్ధిచెందించాలనే అభిప్రాయంలేదు.

SRI P. SUNDARAYYA :—తెలుగులోనే ప్రశ్నలకు సమాధానమిచ్చే సత్సాంప్రదాయాన్ని ముందు ముందు అందరు మంత్రులూకూడా అవలంబిస్తారా ?

No reply.

Sri N. VENKAYYA :—ఎక్కువ వ్యాపారప్రదేశమైన గుంటూరు జిల్లాకు సంబంధించి ఏ minor రేవూలేదు. కాబట్టి ఆ జిల్లాకు దాదాపు వందమైళ్ళ సముద్రతీరంఉన్నది కాబట్టి వాడరేవునుగాని, లేకపోతే మరియొక minor రేవును గాని అక్కడ ఏర్పాటుచేయడానికి ప్రయత్నిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—చేయడానికి వీలులేదని ఇప్పుడే మనవిచేశాను.

## III. HALF-HOUR DEBATE RE :—SOUTHERN BOUNDARIES OF THE ANDHRA STATE.

Mr. SPEAKER : Sri Vavilala Gopalakrishnayya has given notice of a motion requesting for half-hour debate relating to starred question No. 2077-D, the southern boundaries of the Andhra State. The matter has already been discussed in this House and we may also even anticipate more discussion on this matter in view of the publication of the States Reorganisation Commission's Report. So I rule the motion out of order. We now go to the next item in the agenda.

## IV. SUPPLEMENTARY ESTIMATES OF EXPENDITURE FOR 1955—56.

### (1) Demand No. XV—Education.

THE HON. SRI B. GOPALA REDDI :—Mr. Speaker Sir, on the recommendation of the Governor I move :

" That the Government be granted a further sum not exceeding Rs. 2,05,400 under Demand XV—Education."

MR. SPEAKER : Motion moved—

" That the Government be granted a further sum not exceeding Rs. 2,05,400 under Demand XV Education.

SRI K. V. S. PADMANABHA RAJU : Mr. Speaker : Sir, I move :

"To reduce the allotment of Rs. 2,05,400 for the Education by Rs. 10."

(To impress upon the Government the necessity of providing more grants to the Osmania College at Kurnool so as to be able to provide adequate accommodation for the students pouring into the prospering Capital City and impose Government authority over the Institution to curtail the exuberant special facilities accorded to the students of a particular community and meet out equal justice for all people, irrespective of caste or community, thus establishing the secular characteristic of the State.)

SRI PILLALAMARRI VENKATESWARLU :

Mr. Speaker, Sir I move:

"To reduce the allotment of Rs. 2.05,400 for Education by Rs. 100."

(To discuss the necessity of the State running the elementary schools mentioned in item No. (3).)

MR. SPEAKER : The main motion and the cut motions are now before the House for discussion.

SRI PILLALAMARRI VENKATESWARLU:—అధ్యక్షా, 1956 మార్చిలోపుగ మన మొదటి పంచవర్ష ప్రణాళికలో నిర్ణయించబడ్డ Elementary Schools కోటా పూర్తి చేయటానికి ప్రభుత్వం తలపెట్టినందుకు ప్రభుత్వాన్ని అభినందించవలసిందే. కాని వారు తలపెట్టిన కార్యక్రమం ఏదికూడ సవ్యంగా మాత్రం చేస్తూఉండరు. ఈ మధ్యనే మంత్రిగారు చెప్పారు. రెండుజిల్లాలలో ఉండేటటువంటి Elementary schools అన్నిటినికూడ ప్రభుత్వం నడపడానికి experimental గ తీసుకొంటాము అని ఏమన్నా చెప్పారా ? ఒకచోట ఏమన్నా experimental గా ప్రారంభించపోతున్నారు. మరొకచోట రాష్ట్రంఅంతట, తమ మామూలు విధానమే మళ్లి అవలంబించటానికి పూనుకొంటున్నారు. దానికోసం ఆరు లక్షల, 30 వేలు రూపాయలు ఖర్చుపెట్టుతూఉన్నాము. ఖర్చుపెట్టుతూ ఇప్పుడు

వీటిని, full subsidy basis మీదనే నడపటానికి పూనుకొంటున్నాము. Subsidised schools వల్ల వచ్చేనష్టాలు మనకందరకు తెలుసు. ఈ House లోనే అనేకతడవలు చర్చించాము. వాటినిగురించి ఎవరుకూడ దీర్ఘంగా ఉపన్యాసం చెప్పవలసిన అవసరంలేదు. దానిమీదనే కుప్పుస్వామి కమిటీ రిపోర్టు అనేకచోట్ల దానివల్ల వచ్చేనష్టాలను ఉదహరించింది. ఏ విధంగా ఈ subsidised స్కూల్సులో ఉపాధ్యాయునికి ప్రభుత్వం గ్రాంటుచేస్తు ఉన్నటువంటి జీతాలు ముట్టకుండా పోతున్నాయో ఆ విషయంకూడ ప్రభుత్వదృష్టికి తీసుకునిరాబడ్డది. Mission schools గాని, ఇతరప్రయివేటు managed schools గాని ఏవీ సక్రమంగా నడవటంలేదని, ఎక్కడకూడ వాసయోగ్యం కానటువంటి, విద్యనేర్చుకోడానికి ఎక్కడ అనుకూలమైన వాతావరణం లేనటువంటి, పసిబిడ్డలు కూర్చోటానికి వీలులేనటువంటి, ప్రాంతంలో, గుడిసెల్లో మురికి కూపాలలో పాఠశాలలు పెట్టి, బిడ్డలకు, ఏవిధంగా చదువురాకుండా చేస్తున్నది, ఆ విషయంకూడ స్పష్టంగా తీసుకొచ్చి చెప్పబడ్డది. అయినప్పటికికూడ ప్రభుత్వం తనయొక్క పూర్వ విధానాన్నే కొనసాగించడం సక్రమమైన పద్ధతి కాదు అని మనవి చేస్తున్నాను. అనేక పరిస్థితులలో కుప్పుస్వామి కమిటీ recommendations లో చాలభాగము అంగీకరించామని, అవి ఆలోచించాలని చెబుతూ వాటిని ఆలోచించకుండానే, వారు తమయొక్క పాతపద్ధతిని తీసుకొనిపోయి ఈ విధంగా కొనసాగించడం ఏ మాత్రం బాగాలేదనిమాత్రం మంత్రివర్గానికి తెలియచేస్తున్నాను. అందువల్లనే ఇప్పుడు ప్రారంభించ పోతూ ఉండేటటువంటి కొత్త schools అన్నికూడ ప్రభుత్వమే నడపటానికి పూనుకోవలెనని కోరుతూ ఉన్నాను. అయితే ఈ ప్రభుత్వం పూనుకొనే టట్లయితే అదనంగా అయ్యే ఖర్చు అంతా మాటిమాటికి ఏ విషయం తీసుకొని వచ్చినప్పటికి అయినాసరే, మనయొక్క ఆర్థిక మంత్రిగారు డబ్బు ఎక్కువ అవుతుంది కనుక మేము చేయజాలము అంటూ ఉన్నారు. దీంట్లో లెక్క వేసి చూస్తే మొట్టమొదట సంవత్సరం 3,076 రూపాయలకంటే ఎక్కువ ఖర్చు కాదు. దాని తర్వాత సంవత్సరానికి ఒకొక్కక్క ఉపాధ్యాయునిమీద రూపాయో, రెండు రూపాయలో అదనం ఖర్చు అవుతుందంటే, సంవత్సరానికి 15, 16 వందల రూపాయలకంటె ఎక్కువగ ఖర్చుకాదు. అలాంటప్పుడు ఈ 30 వేల రూపాయిలు చూచుకొని, వీటిని అన్నిటినికూడ, ఎవరికో కొంతమంది, వ్యాపార పద్ధతుల మీద నడిపేటటువంటి ప్రయివేటు management కు ఇవ్వటం ఏ మాత్రం సరికాదనే అభిప్రాయాన్ని మంత్రిగారి దృష్టికి తీసుకొనివస్తున్నాను. మంత్రిగారిని ఈ విషయాన్ని సాకల్యంగా ఆలోచించమని కోరుతున్నాను. 30 వేల చిల్లర మాత్రమే అదనరగా ఖర్చు అవుతుంది. ఈ ఆరు లక్షల రూపాయలు పైచిలుకు

మనము ఖర్చు పెట్టుతూ ఉన్నాము. ఈ ఆరు లక్షల రూపాయలలోను, ఏ లక్ష రూపాయలలో కాజేయడానికి, వ్యక్తులకు అవకాశం ఇచ్చే దానికంటే, 30 వేల రూపాయలు అదనంగా ఖర్చుపెట్టి ప్రభుత్వమే ఆ పాఠశాలలను, నడిపితే ఎంతో ఉపయోగపడుతుంది. పాఠశాలలుకూడ గ్రామస్థుల దగ్గరనుంచి, మనం అరికట్టించమని ప్రోత్సహించి కట్టించుకోడానికి అవకాశం ఉంటుంది. అందువల్ల ఈ విషయంలో అన్నికూడ ఆలోచించి వెంటనే తప్పనిసరిగా, ఈ ప్రభుత్వం ప్రారంభించ ఉన్నటువంటి నూతనమైన Schools అన్నికూడ ప్రభుత్వమే ప్రారంభించాలని, full subsidy basis మీద కాదని, నేను మంత్రివర్గానికి తెలియచేస్తున్నాను. ముఖ్యం ఖర్చు విషయం మళ్ళీ ఆలోచించమని చెప్పుతున్నాను. 30 వేల కంటె అదనంగా ఖర్చుకాదు. ఆరు లక్షల రూపాయల పైచిలుకు మనం ఖర్చుపెడుతూ ఉన్నాము. ఆరు లక్షలు ఖర్చుపెడుతూ, ఇంకొక 30 వేల రూపాయలకు కక్కుర్తిపడేట్లయితే, లక్షలాది రూపాయలు, వ్యాపార సంస్థలకు మార్చేటటువంటి, వ్యక్తులకు కాజేయటానికి అవకాశం ఇచ్చినటునంటి వాళ్లము అవుతాము అనేటటువంటి విషయాన్ని ఆలోచించమని ప్రభుత్వ దృష్టికి తీసుకొని వస్తున్నాను. తరువాత Osmania కాలేజికి లక్ష రూపాయలవరకు గ్రాంటు ఇచ్చి building కట్టించడానికి పూనుకోవడం కూడ సంతోషించ తగ్గ విషయమే. అయితే Osmania కాలేజి పరిస్థితి అంతా చూచుకొంటే, ఏమి సంతృప్తికరముగ లేదు అనే విషయం మనకు స్పష్టంగా బోధపడుతుంది. నేను చెప్పడంకాదు. మంత్రి వర్యులను తమంతటతాము పోయి చూచుకొనమనండి. దాని hostel చూచుకొనమనండి. Medical facility చూచుకొనమనండి. Library facilities చూచుకొనమనండి. ఏదైనా సంతృప్తికరంగా ఉన్నదని చెప్పుతారా అంటే, చెప్పడానికి వీలులేదని చెప్తున్నాము. విద్యార్థుల దగ్గరనుంచి, term కు 9రు.వరకువసూలు చేస్తూ సరియైన మెడికల్ aid ఇవ్వకుండా నానా బాధలు పెట్టడం జరుగుతోంది. అందువల్ల ఇదిఅంతాకూడా దృష్టిలోకి తీసుకోవాలని చెప్పుతున్నాము. Accommodation విషయం చూస్తే కాలేజి strength రెట్టింపు పెరిగింది. Hostel facilities లేవు. Hostel building కట్టపోతున్నారు. ఆ బిల్డింగుకూడ ఎంతవరకు సరిపోతుందోకూడ తెలుసుకొనేటటువంటి అవకాశంలేదు. తరువాత అనేకమంది పెద్ద పెద్ద ఉద్యోగస్థులు రావటంవల్ల, అనేక కొత్త courseలు ప్రారంభించవలసిన అవసరం ఉంది. ఈనాడు science courseలు కూడా తగినంతగా లేవు. Science Courseలు ఉన్నటువంటి చోటకూడ September పరీక్షలు ఈ కాలేజిలో ఈనాటికి జరగడంలేదు. September పరీక్షలకు అనంతపూరుకో, తిరుపతికో, పోవలసిన అవసరంకూడ వస్తుంది. ఇంతవరకుకూడ మద్రాసుకు పోతూఉన్నారు. ఇపుడు మద్రాసుకు పొయ్యే బాధతొలిగిపోయింది.

అనంతపూరుకో, తిరుపతికో పోవలసిన అవసరం మాత్రం వచ్చింది. దీనినికూడ తొలగించాలని మంత్రిగారి దృష్టికి తీసుకొని వస్తున్నాను. అందువల్ల ఈ కాలేజి విషయంలో ప్రత్యేక శ్రద్ధ పూని మన రాజధాని నగరంలో ఉన్న కాలేజీని ఆదర్శప్రాయంగా ఉండేటట్లుగాను, విద్యార్థులకు అందరకుకూడ అన్ని సౌకర్యాలు కలిగేటట్లుగాను, చూడవలసిన అవసరం ఉందని మాత్రం తెలియచేస్తున్నాను. అందుకోసం అవసరమైతే ఇంకా ఒక లక్షరూపాయలు అదనము ఖర్చుపెట్టి అయినా సరే, సరియైన, పూర్తి accommodation, science course లు ఇవి అన్ని ప్రారంభించడానికికూడ పూనుకోవలసినటువంటి అవసరం ఉన్నదని నేను తెలియచేస్తున్నాను. అందువల్ల నేను Osmania కాలేజిని గురించి ప్రభుత్వ దృష్టికి తీసుకొని వచ్చేది ఏమంటే ఇక్కడ ఉన్న accommodation న్ని, staff ని, ఇవి అన్నికూడ సాకల్యంగా పరీక్షచేయమని కోరుతున్నాను. B. A., B. Sc. లు pass అయినటువంటి వాండ్లు B. A. లకు B. Sc. లకు కూడ చెప్పుతున్నారనే విషయాన్ని మంత్రివర్గ దృష్టికి తీసుకొని వస్తున్నాను. అందువల్ల ఇవి అన్నికూడ ఆలోచించమని తీసుకొని వస్తున్నాను. నేను చెప్పేది పూర్తిగ నమ్మండి, నమ్మకపొండి, కాని మీరు వెళ్లి పరీక్ష చేస్తే పరిస్థితులు బోధపడుతాయి గనుక, ఈ విషయాన్ని జాగ్రత్తగ ఆలోచించమని చెప్పుతున్నాను. Science కోర్సులు ఏమి లేకుండా ఉన్నాయి. అంతే కాకుండా Bachelor of Oriental Languages పెట్టారు. బాగానే ఉంది. కాని అందులో తెలుగు లేదే? తెలుగుభాషలో B.O.L. తయారు అయ్యే దానికి అవకాశం లేదు. అందుకొరకు వసతులు కల్పించి, Managing Board వారితోకూడ చర్చించి సరయైన పద్ధతులలో ఈ కాలేజి నడిపేటట్లుగా చూడవలెనని మంత్రివర్గ దృష్టికి తీసుకొనివస్తున్నాను. అందువల్ల building విషయంలో గాని, మిగిలిన కొరతలు ఏవి ఎట్లా ఉన్నప్పటికయినా సరే, ఈ కాలేజియొక్క అభివృద్ధికి మనము పూనుకొనవలసిన అవసరం ఉంది. మన శాసనసభ్యులకు కొత్త hostel ఎంత అవసరమని అనుకొంటున్నారో, అదేవిధంగా మన క్రింద పనిచేసేటటువంటి ప్రభుత్వోద్యోగుల బిడ్డలు చదువు నేర్చుకోడానికి, అన్ని కోర్సులు ఏర్పాటుచేయడానికి, అక్కడ చదువుకునే విద్యార్థులకుకూడ హాస్టల్ వసతులు ఏర్పాటుచేయవలసిన అవసరం ఉంది. అదిమాత్రం మంత్రివర్గం దృష్టికి తీసుకొని వస్తున్నాను. అందువల్ల ఈవిషయంలో ఎక్కువ చెప్పవలసిన అవసరంలేదుగాని ఇపుడు ఈ కాలేజికి ఇచ్చే డబ్బు సక్రమంగా వినియోగం కావాలని, అందుకు తగిన చర్యలకు పూనుకోవాలని, కావలసిన కోర్సులన్ని open చేయాలని, మంత్రివర్గంయొక్క దృష్టికి తీసుకొని వస్తున్నాను. మళ్లీ తిరిగి ముగించకముందు నా cut motion ను మంత్రివర్గం తప్పకుండా ఆమోదిస్తుందని ఆశిస్తాను. అందులో బ్రహ్మాండమైన విషయం ఏమీ లేదు. మంత్రివర్గం ప్రతి దఫా చెప్పేటటువంటి అదనపు ఖర్చుకూడ లేదు. 30 వేల రూపాయలు

Sri Pillalamarri Venkateswarlu] [3rd October 1955

మాత్రమే ఆరులక్షల 30 వేల రూపాయలు ఖర్చుపెట్టుతున్నారు. ఇంకా అదనంగా 30 వేలు ఖర్చుపెట్టేటట్లయితే మీరే ఈ పనిని నడపడానికి వీలు ఉంటుందని మంత్రివర్గ దృష్టికి తీసుకొనివస్తూ నా cut motion ను ప్రతిపాదిస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఇంజనీరింగు కళాశాల విషయంలో, దానికి అదనంగా గ్రాంటుయిస్తూ తీసుకువచ్చిన budget ప్రతిపాదన అందరు హర్షింపదగినదే. అయితే ఈ విషయములో వున్నటువంటి ఇబ్బందులు గురించి general discussion లో మనవిచేశాను. దాన్ని ప్రధానంగా మనవిచేయవలసిన అవసరమున్నది. మనదేశములో ముఖ్యంగా అనేకమంది విద్యార్థులు technical examinations మొదలైనవాటికి వెళ్లుతున్నారు. అది నిజంగా అభినందించదగిన విషయము. అదే ఉద్దేశంతోనే polytechnic schools ప్రారంభించినప్పుడు, ఎక్కువమంది వాటికి వెళ్లుతూవచ్చారు. వారిలో చాలామంది ఇప్పుడు నిరుద్యోగులు గా ఉన్నారు. దీనిని నేను మరల report చేస్తున్నానని అంటారేమో, అయినప్పటికి దాని importance బట్టి చెప్పమన్నాను. ఆ విద్యార్థులందరు ఆ విధంగా ఖాళీగావుండగా, కొత్తవిద్యార్థులను తీసుకురావడానికి సౌకర్యాలు కలుగచేస్తున్నారు. కొత్త school వద్దని నేను చెప్పడంలేదు. ఇంకా ఎక్కువ Engineering Colleges పెట్టవలసిందే. గుంటూరు జిల్లా Planing Committee వారుకూడ, ఆ జిల్లాతరఫున ఎనిమిది లక్షల రూపాయలు ఇస్తాము పెట్టబోతున్నటువంటి Engineering కళాశాలను గుంటూరులోనే పెట్టండని ఏకగ్రీవంగా తీర్మానం చేశారు. దాంట్లో శాసనసభ్యులుకూడ వున్నారు. అందువల్ల Engineering కళాశాలలు ఎక్కువ పెట్టాలనే నేను కోరుతున్నాను. అయితే యిదివరకు polytechnics లో చదువుకొని నిరుద్యోగులుగా వున్నవాళ్లకు ఉద్యోగము చూపించే విషయము ఆలోచించకుండా, కొత్తవిద్యార్థులను తర్ఫీదు చేయుటకు సౌకర్యములు కల్పిస్తే, రేపు ఎక్కువమంది విద్యార్థులు తయారై, ఇప్పుడు నిరుద్యోగులుగా ఉన్నవారి సంగతి మరచిపోవడం జరుగుతుంది. అందువల్ల తయారైన విద్యార్థులకు ఉద్యోగాలు చూపించే అవకాశాలు కల్పించవలెనని మనవి చేస్తున్నాను.

అటుతరువాత దీంట్లో compressed diploma course అని 2½ సంవత్సరాల course ఒకటి తీసుకువచ్చారు. అందుకు చాలా సంతోషము. ఆ course లో Intermediate చదువుకొన్నవాళ్లు ప్రవేశించవచ్చునని ఉన్నది. Intermediate pass అయినా కాకపోయినా, mathematics science sections లో pass అయితే, దాంట్లో ప్రవేశించవచ్చు అని వున్నది. ఈ సందర్భంలో ఒకటి మనవి చేస్తున్నాను. ఇప్పుడు ఈ compressed course లో Intermediate చదివిన

వాళ్ళనుచేర్చి 2½ సంవత్సరములు శిక్షణ యిస్తారు. ఇక్కడ polytechnicsలో ఉన్నవాళ్లు school final అయి, 4 సంవత్సరములు అంగులో చదువుకొన్న తరువాత వాళ్లకు licence ఇస్తున్నారు అనుకోండి. వీరికి ఉద్యోగం దొరకనప్పుడు ఇంకా చదువుకోవాలని ఇష్టం ఉన్నట్టయితే, అటువంటివారికిగాను, ఒకటి, రెండు సంవత్సరములకు సరిపోయే ఒక course పెట్టి, వీరిని పై course వారితో సమానంగా తీసుకొని వచ్చినట్లయితే, వీరికికూడ B. E. సంపాదించుకోడానికి అవకాశ మిచ్చినవారవుతారు. వీరు ఇదివరకు చదువుకొన్నదికూడ నిరుపయోగం కాకుండా పోతుంది.

THE HON. SRI B. GOPALA REDDI :—ఈ Intermediate చదువుకొన్న వాళ్లకుకూడ B. E. degree ఇవ్వరు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—పోనీ Diploma ఇస్తారనుకోండి. Diploma కు, licence కు తేడావుంది. అందువల్ల వారికి ఒక stage అయినా మారడానికి అవకాశముంటుంది. నా అభిప్రాయంలో, ఈ polytechnics లో నాలుగు సంవత్సరములు చదువుకొన్నటువంటి వారికి B. E. course లో 1, 2 సంవత్సరములు ప్రథమంలో వదలిపెట్టేసి, మిగతా advance course లో చదువుకోడానికి అవకాశ మిచ్చినట్లయితే, B. E. తో సమానంగా వస్తారు. అయితే, Intermediate చదివినవాళ్లకు ఉన్నటువంటి efficiency వీరికి ఉండదంటారేమో. దాన్ని ఒప్పుకొంటాను. కాని వీళ్లు engineering section లో కావలసినటువంటి విజ్ఞానం నాలుగు సంవత్సరాలు పొందివున్నారు. కనుక దాన్ని రెండు సంవత్సరాలు preliminary గా తీసుకొని, మిగతా advance course కు అవకాశ మివ్వవలసిన అవసరమున్నది. గనుక ఆ విధంగా చేయవలసిందని మనవిచేస్తున్నాను.

రెండవది వీళ్ళకు apprentice విషయంలో మీరు కొంత ఉదారంగా ఆలోచించవలసిన అవసరమున్నది. వీరికి diploma ఇచ్చేముందు apprentice కావలసియున్నది. Diploma ఇచ్చిన తరువాతకూడ apprentice కావలసియున్నది. ఈ apprentice విషయంలో వీరు చాలా కష్టపడుతున్నారు. బయట private undertakings లో వీరిని ఎక్కడా చేర్చుకోవడంలేదు. మాకేదో 2, 3 రోజు లుండిపోయేవాళ్ళు, machines ముట్టుకొని చెడబెట్టి పోతారు. మేము చేర్చుకోమంటారు. కనుక వారికి Government Workshops లోనే యీ apprentice కు అవకాశ మివ్వవలసిందని కోరుతున్నాను. ఆ విధంగా యివ్వకపోతే వారికి ఏమీ ప్రయోజనం ఉండదు. ఎందుకంటే వారు 6 నెలలు apprentice

Sri Vavilala Gopalakrishnayya] [3rd October 1955

అయిపుం చేసేగాని వారికి ఉద్యోగం ఇవ్వరు. కనుక వీరికి అటువంటి సౌకర్యము కలుగజేయవలసిందని మనవిచేస్తున్నాను.

తరువాత ఈ elementary schools విషయంలో ఇప్పుడు జిల్లాబోర్డులకు ఏదో grant ఇస్తున్నామని చెప్పారు. ఇక్కడ అది Item (5) లో ఉన్నది. జిల్లాబోర్డులకు ఇచ్చేవిషయంలో, కేంద్రప్రభుత్వము మొదటితడవ 75 పంతులు ఇస్తామనేది, రెండవ సంవత్సరం 50 పంతులు, ఆ తరువాత పాతికపంతులు, ఈ విధంగా ఇవ్వడం జరుగుతుంది. ఈ విధంగా జిల్లాబోర్డులకు వారు నిర్వహించేటటువంటి Hospitals గాని, రోడ్లుగాని స్కూళ్లుగాని, వీటికిగాను మొదట కొంత డబ్బుఇచ్చి ఆ పనులన్నీ వారికి ఒప్పజెప్పడం, ఆ తరువాతవాళ్లకు సరిగా డబ్బులేక వాటిని భరించలేకపోవడం, అందువల్ల అటువంటివి చాలా మూసివేసే పరిస్థితివస్తున్న సంగతి మనకుతెలుసు. మొదటేమో 75 percent ఇస్తున్నారని వీటిని తీసుకొంటున్నారు. తరువాత 50 percent ఇవ్వడం జరుగుతుంది. ఆ తరువాత రాను రాను మొత్తము వీరే ఆ ఖర్చు అంతా భరించవలసివస్తుంది. అప్పుడు అవి మూసివేసే పరిస్థితి వస్తుంది. ఆ విధంగా మూసివేసేటటువంటి పద్ధతిలో, రెండు సంవత్సరాలు పాఠశాలలు పెడితే ఏమి ప్రయోజనంలేదు. అంగువల్ల ఈ విషయంలో ప్రభుత్వము ఇది సక్రమంగా జయప్రదంగా నడవబడతాయని, అందుకుతగిన ఏర్పాట్లు చేస్తామని ఒక హామి ఇవ్వవలసియున్నది. Finance implications ఏమైనాఉంటే, దీనిని మేము oppose చేయవలసియున్నది. అందుకు అవి జయప్రదంగా అమలుపరచడానికి, దానికి రాబోతున్న ఇబ్బందులు ముందుగానే మనవిచేస్తున్నాను.

ఈ స్కూల్సు విషయంలోనే ఇంకొక విషయం మనవి చేయవలసియున్నది. ఇదివరకు మీకు ఎన్ని స్కూల్సు కావాలని గవర్నమెంటు అడిగితే ఆ కాగితాలన్నీ ఏ ఆఫీసులోవి ఆ ఆఫీసులో మూలపడేశారు. ఆ విధంగా మూలపడేసి మొదట ఇస్తామన్న allotment మనం తీసుకోలేదు. తరువాత Director ఈ proposals త్వరగా పంపించవలసిందని చాలా తొందరచేసినందువల్ల పనులు జరిగాయి. కనుక మళ్ళీ ఇవి ఏ మూలనైనా పడవేసి, ఈ అవకాశాన్ని పోనీవద్దు, వచ్చేటటువంటి స్కూళ్లను రానీకుండా చేయవద్దు, ఈ అవకాశాన్ని పూర్తిగా మనం వినియోగించుకోవాలని చెప్పుతున్నాను. క్రిందటితడవ అట్లాంటిది వచ్చినప్పటికిని, list పూర్తికాలేదు. ఈ తడవమాత్రం ప్రభుత్వముకూడ వొత్తిడిచేసింది, Director కూడా వొత్తిడిచేశారు. అందువల్ల వీటి allotment lapse కాకుండా చూడవలసిందని నేను కోరుతున్నాను.

తరువాత Osmania collage గురించి ఒక విషయం మనవిచేయదలచు కొన్నాను. ఆ యూనివర్సిటీ వ్యవహారమంతా వాళ్ళే చూసుకోవాలిగాని మనం మాట్లాడకూడదనుకొంటాను. కాని అక్కడ ఉన్నటువంటి administration చాలా అసంతృప్తికరంగా ఉంటున్నదని వింటున్నాము. మనము దానికి grant ఇస్తున్నప్పుడు, అది బాగా ఉండాలని మనకోరిక. మన గవర్నమెంటుకు బహుశా ఆ యూనివర్సిటీతో direct గా సంబంధం ఎక్కువ ఉండదనుకొంటాను. అయి నప్పటికిన్నీ, మనం కొద్దిడబ్బు ఇస్తున్నాము కాబట్టి మన డైరెక్టరుగాని మరెవరైనా గాని, ఆ University Commission వారు వచ్చినప్పుడు, వారితో ఈ విషయం కొంచెము హెచ్చరించి ఈ College లో ఎటువంటి staff ఉన్నది, వీరంతా చాలా పాతవాళ్ళా ఓపికగలవాళ్లను వేశారాలేదా, మంచి energetic and fully qualified వాళ్లను వేయవలసిన అవసరమున్నదా, మొదలైన విషయాలన్నీ బాగా ఆలోచించి దాని standard కొంచెము improve చేసేటట్లు చూడవలసియున్నది. అసలు వారు అటానమిక్ గా ఉన్నందువల్ల వారిని మనమేమి ముట్టుకోడానికి వీలులేకున్నప్పటికీ మనంకూడ కొంతడబ్బు ఇస్తున్నాము కాబట్టి, వాళ్లు ఇష్టం వచ్చినట్లు చేసుకోనేట్లు కాకుండా, ఇక్కడఉన్న మన విద్యార్థులకు సరియైన instruction విషయంలోను, examination విషయంలోను, మనం శ్రద్ధతీసు కోవలసియుంటుంది. రాయలసీమలో S.S.L.C. Examination results లో, వీరికి first prize వచ్చిందని విన్నాము. కాని Colleges విషయంలో, ఈ Osmania college లో చాలా తక్కువమంది pass అయినారని తెలుస్తున్నది. దీనివల్ల Secretariat staff అంతా, ఈ College లో మనపిల్లవాళ్లు fail అవుతారేమో, ఇంకెక్కడికైనా పంపించవలసి వుంటుందేమోనని భయము కల్పించిన వాళ్ల మవుతామేమో అనకొంటాను. అందువల్ల ఈ Collegeలో efficiency ఎందువల్ల కుంటుబడ్డది, teaching లో లోపమున్నదా, equipment లో లోపమున్నదా, ఇదంతా ప్రభుత్వము, యూనివర్శిటీకలసి ఆలోచన చేయవలసిన అవసరమున్నదని చెప్పుతూ విరమిస్తున్నాను.

Sri N. VENKAIAH :—అధ్యక్షా, ప్రభుత్వమువారు వ్యయముచేసే మొత్తములో చాలా ఎక్కువ భాగముగాను ప్రాథమికవిద్యకు వ్యయముచేస్తు న్నారు. ఇంకను అధికంగా పాఠశాలలను తెరవటానికి ప్రభుత్వము ప్రయత్నము చేస్తున్నది. అయితే ప్రాథమికవిద్య ప్రజలకు అందేటట్లు చేయటానికి ప్రభుత్వము బాగుగా ఆలోచించి, సొమ్మును సక్రమంగా ఖర్చుచేయడానికి తగినంత కృషిచేయ వలసివున్నది. అందుకు కుప్పుస్వామి కమిటీ సిపార్సులు కొంతమటుకు ఉపకరిస్తాయని అనుకుంటున్నాను. ఈ సిఫార్సులు యింకను పరిశోధన చేయడానికి తొలాకా

Sri N. Venkaiah] [3rd October 1955

సంఘాలు ఏర్పాటుచేయడమునుగాని, పాఠశాలలను అన్నింటినీ ప్రభుత్వము స్వాధీనము చేసుకొను విషయముగాని, యింకను ఆలోచనలోనే వున్నదని ప్రభుత్వము చెప్పడము చాలా విచారకరము. ఈనాడు పల్లెప్రాంతాలలో ఒక గ్రామములో రెండువందలమంది పిల్లలువుండేచోట ప్రైవేటు మేనేజిమెంటువల్ల నడపబడే స్కూలు ఒకటివుంటున్నది. ఇవిగాక హరిజనులకుగాను Labour school ఒకటి నడపబడుతున్నది. ఇంకను ఒకబోర్డు పాఠశాలవున్నది. ఈ విధంగా చాలా మటుకు ప్రతిగ్రామములోను నాలుగుఅయిదు రకముల స్కూల్సు ఉండడమువల్ల ఏ స్కూలులో చూచినా నలుగురు అయిదుగురు మాష్టర్లుకూడా లేకుండా వుండడము కన్పిస్తున్నది. అందువల్ల తరగతికి ఒకమేష్టరుఅయినా లేకపోవడమువల్ల విద్యాబోధన లోపభూయిష్టముగా వుండడము జరుగుచున్నది. నాలుగు రకాల పాఠశాలలకు బదులు ఒకే రకపు పాఠశాలవుంటే యిప్పుడువున్న ఉపాధ్యాయులను తగ్గించుకోవడమేగాక తరగతికి ఒక ఉపాధ్యాయుడని అయినా ఏర్పాటుచేయటానికి, విద్య బాగా అభివృద్ధి కావటానికి అవకాశము వుంటుంది. ఈ రోజులలో గ్రామములలోని పాఠశాలలకు అనేకమంది పిల్లలను పంపించి, ఆ పాఠశాలల మీద నే ఆధారపడుతూ తమ పిల్లలకు చదువుచెప్పించుకొని విద్యపూర్తి చేయించుకోవాలని తలిచే తలిదండ్రులు చాలా పొరపాటుపడుతున్నారు. పైగా ప్రైవేటుగా పిల్లలకు చదువు చెప్పించినప్పుడే, ఒక్కొక్క సంవత్సరమునకు ఒక్కొక తరగతిచొప్పుననైనా పాఠాలు పూర్తిచేయ గలుగుతున్నారేగాని, చాలాభాగము యీ పాఠశాలలో చాలామంది ఉపాధ్యాయులు విద్యను బోధించడములో ఒక సంవత్సరమునకొక పుస్తకము ప్రకారము అయినా అందులోని పాఠాలు పూర్తి చేయలేని స్థితిలో వుంటున్నారు. అందువల్ల విద్యాభివృద్ధి చాలా తక్కువగా వుంటున్నది. Education Department ను బాగుగ సంస్కరించడములోనూ, పాఠశాలలను కేంద్రీకరించడములోనూ, అన్నివిధములలోగూడా విద్యాబోధన పెంపొందించడము చాలా అవసరము. పైగా, ఒకవేళ యీ విద్యయే నిర్బంధ ప్రాథమిక విద్యగా ఏర్పాటుచేసినప్పుడుకూడా, వివిధ రకాలుగా పాఠశాలలు వుండడమువల్ల ఎక్కువమంది ఉపాధ్యాయులు వుంటున్నారని అనుకుంటున్నాను. నా అనుభవములో మా చుట్టుప్రక్కల గ్రామాలలో మామూలుగా అయిదారుమంది ఉపాధ్యాయులకు సరిపోయే పాఠశాలలువుంటే, అందులో ఒక్కొకదానిలో ఏ పదిహేనుమందో మాత్రము ఉండడము చూస్తున్నాము. కాబట్టి యీ విషయములో ప్రభుత్వము అన్ని సంగతులు జాగ్రత్తగా పరిశీలించి సరియైన విధానము యేర్పాటుచేసినప్పుడే, ప్రభుత్వము యీనాడు ఖర్చుచేయబోయే సొమ్ము పిల్లల కుపయోజనకరంగా వుంటుందని, విద్యకు అవకాశాలు ఏర్పడుతాయని మనవి చేస్తున్నాను. అందువల్ల విద్యవిషయములో సంస్కరణ ఆనేదానికి చాలా జాగ్రత్తగా ఆలోచించి, తీవ్రగమనముతో కృషిచేస్తే తప్ప, పిల్లలకు తగినంత విద్యాభివృద్ధి జరగ

దని మనవి చేస్తున్నాను. విద్యాబోధనకు ప్రభుత్వము వెచ్చించబోయే సొమ్ము చాలా ఎక్కువగానే వుంటుంది. గనుక యీ సొమ్ముతోనే ప్రాథమిక విద్యాబోధన పెంపొందించటానికి అవకాశము వుండాలి.

అదేవిధంగా medical విద్యవిషయములో మనకు అనేకచోట్ల ఆయుర్వేద కళాశాలలు వున్నవి. ఆయుర్వేద విద్యాబోధనకు తగినంతమంది ఉత్తీర్ణులైన డాక్టర్లులేరు. ఇంతవరకు మన దేశీయవైద్యకళాశాల యొకటి మద్రాసులో వుంటూ వచ్చిందిగాని మనకు యిక్కడ ఆంధ్రరాష్ట్రములో ఒక్క కళాశాలగూడ లేకపోవటము అందరికి తెలిసినవిషయమే. ఇది చాలా శోచనీయము. ఈ విషయము మనకందరికీ తెలిసిన విషయమే. ఇటువంటి ఆయుర్వేద కళాశాల మన రాష్ట్రములో లేకపోవడమువల్ల, మనకు ఆయుర్వేద డాక్టర్ల కొరత ఏర్పడివున్నది. ఈ కొరతవల్ల ఏ బి క్లాసు డాక్టర్లను నియమించడ మవుతున్నది. ఆయుర్వేద వైద్యమును చదివి ఉత్తీర్ణులైనవారు తయారు కాకపోవడము జరుగుచున్నది. అందువల్ల మన రాష్ట్రములో గూడ ఒక ఆయుర్వేద కళాశాలను ఏర్పాటుచేసుకోవటము ముఖ్యావసరమైన విషయము. ఇకమీదటనైనను మనము ఒక కళాశాలను నిర్మించుకోకపోతే, ఆయుర్వేద విద్య మరింత అడుగునపడిపోయి, అధ్వాన్నస్థితికివచ్చి, ఆయుర్వేద వైద్యము పేరు గూడా లేకుండపోయి, ప్రజలకు నిరుపయోగము అయ్యే స్థితి ఏర్పడుతుంది. ఇప్పుడు రాష్ట్రములో ఆయుర్వేద వైద్యము తెలిసినవారు పేరుకు చెప్పుకోదగినవారు ఏ కొద్ది మందో వుంటున్నారు. కాబట్టి ప్రభుత్వము తగు శ్రద్ధతీసుకొని ఆయుర్వేదవైద్య విద్య వెనుకబడిపోకుండా చూడాలని మనవి చేస్తున్నాను. ప్రస్తుతము ప్రభుత్వానికి ఆర్థిక స్తోమతు యీ కళాశాల నిర్మాణమునకుగాను తగినంత లేకపోవచ్చును. ఆర్థిక స్తోమతు చక్కబడినప్పుడైనా ఒక ఆయుర్వేద కళాశాలను నిర్మించి, యీ వైద్యమును ముందుకు తీసుకొని రావటానికి ప్రభుత్వము కృషిచేయవలసిందిగా కోరుతున్నాను. ఆయుర్వేద వైద్యము అంటే ప్రజలకు ఎంతో నమ్మకమువున్నది. దీనియొక్క ప్రభావము, ఉపయోగము ప్రజలు మరచిపోలేదు. మన ప్రజలు పూర్వము ఆయుర్వేద వైద్యమునే ఉపయోగించుకొనేవారు. ప్రజలలో యీ ఆయుర్వేద వైద్యాభివృద్ధిని గురించి ప్రచారముమూలంగా ప్రజలను ఆకర్షింపజేసి, ఆర్థికస్తోమతును విరాళాల మూలంగా సంపాదించి ఒక ఆయుర్వేద కళాశాలను నిర్మించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఆయుర్వేద కళాశాలను ప్రభుత్వము భరించలేని స్థితిలోవుంటే, మనకు రాష్ట్రములోవున్న Hospitals వృద్ధిగావున్నచోట, యీ ఆయుర్వేద వైద్యమునుగూడ ఒక భాగముగా వుపయోగపరచినట్లయితే, ప్రభుత్వమునకు వ్యయము తక్కువగా వుంటుంది. ఇప్పుడువున్న హాస్పిటల్సులో, దీన్నిగూడా పెంపొందింప చేసినవార మవుతాము. హాస్పిటల్సు లేనిచోట ఆయుర్వేద వైద్యకళాశాల ప్రారం

Sri N. Venkaiah] [3rd October 1955

భించడమునకు ఖర్చు భరించలేక పోతే, ఉన్న చోటనైనా యీ ఆయుర్వేద వైద్యము ప్రారంభించడము మంచిది. ఇంకను నా ఉద్దేశ్యములో వీలయినన్ని చోట్లలో యీ ఆయుర్వేదవైద్యమును వ్యాపింప జేయడము అవసరమని అంటున్నాను. హాస్పిటల్సు లేనిచోట, ఆయుర్వేద వైద్యులను ఏర్పాటు చేయవచ్చు. ప్రస్తుతము యిక్కడ కర్నూలులో ఒక Medical College ప్రభుత్వము ఏర్పాటు చేయబోతున్నారుగదా ఇది సంతోషకరమైన విషయమే. అయితే భవనాల విషయములోనూ, యింకను యితరవిషయములలోనూ ప్రభుత్వానికి ఏదైనా లోటువుంటుందని తోస్తే, యిప్పుడు విశాఖపట్టణములోను, గుంటూరులోను, హాస్పిటల్సు ఎక్కువగా వృద్ధిచెందినవి వున్నవి గదా! అక్కడనైనను ప్రస్తుతానికి యీ ఆయుర్వేద వైద్యవిద్య ఒక భాగముగా ప్రవేశపెట్టించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఆ విధంగానైనా ఆయుర్వేద వైద్యమును ప్రభుత్వమువారు పెంపొందింపజేసినవారవుతారు. కాబట్టి ఆయుర్వేద వైద్యము విషయములో ప్రభుత్వము నిరుత్సాహము ప్రదర్శించక, తగుశ్రద్ధ వహించి దీన్ని ముందుకు తెస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

SRI B. APPA RAO :—అధ్యక్షా, ఇటీవల జరిగిన బడ్జటుసమావేశములో Education Demand మీద సభ్యులు చాలామంది మాట్లాడారు. చాలా తీవ్ర చర్చలు జరిగినవి. Education portfolio ముఖ్యమంత్రిగారిచేతులలో వుండడము చాలా ప్రశంసనీయమైన విషయము. విద్యాశాఖలో జరుగుతున్నవనీ మనము కొంచెము తీవ్రంగా పరిశీలించిచూస్తే, కొంతమటుకు మనము సంతృప్తి వెల్లడించవలసివున్నది. శాసనసభకూడా రాష్ట్రములోని విద్యకు తగినంతప్రోత్సాహము యివ్వటానికి కావలసినడబ్బు కేటాయించటానికి ఆమోదించింది. ముఖ్యంగా రాష్ట్రములో మన ఆంధ్రులు ఇతర రాష్ట్రములకువెళ్లి కార్మికులుగాను, వృత్తి విద్యలోను చాలా ప్రశంసించదగ్గకీర్తి ప్రతిష్టలు గడించారు. అదేవిధంగా మన రాష్ట్రములో అటువంటిప్రోత్సాహము లేదని చెప్పుకోవలసివస్తున్నది. పోతే, ప్రభుత్వము గుర్తించినవిషయమేమిటంటే ఇంజనీర్లుగా తగిన తరిఫీదు యివ్వటానికి మనరాష్ట్రములో రెండు మూడు కాలేజీలు పెట్టడానికి నిశ్చయించారు కాని వాటిల్లో skilled workers ను తయారుచేసుకునే ఏర్పాట్లుయేవీ కన్పించవు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు దేశములో పరిశ్రమలకు తగిన ప్రాధాన్యత యిస్తున్నారు. ఇటువంటి పరిస్థితులలో మనరాష్ట్రమునకు welders కావాలన్నా, fitters కావాలన్నా, electricians కావాలన్నా, radio mechanics కావాలన్నా, arc welders కావాలన్నా, trades కు సంబంధించిన skilled workers కావాలన్నా మనరాష్ట్రములో బహుకొద్దిమంది వున్నారు.

పోతే, Employment Exchanges వద్దకు పోయి ఉద్యోగాలు కావాలని middle class కు చెందినవారు ఎంతోమంది ఉద్యోగాలు, ఉద్యోగాలు అని మొరపెట్టుకుంటూంటే, వాళ్లకు ఉద్యోగాలకోసం లేక తిరుగులాడుతూ అప్లికేషనులు యిస్తున్నారుకాని వారిని చూడగా అవసరమైన training qualifications ఏవిధంగానులేవు. కాని అప్లికేషన్సుమాత్రము వందలకొద్దీ వేశారు. Skilled workers గా పరిశ్రమలలో పనిచేయటానికి తగినంత training, quali'ications లేనికారణముచేత ఉద్యోగాలు దొరకక సతమతమవవలసి వస్తున్నది. రాష్ట్రములో పరిశ్రమలాలేవు. Industries చూస్తే, అవి అంతకంటే లేవు. ఇక యివి లేనప్పుడు వున్న కొద్దిమందికైనా, వుద్యోగాలు దొరకటములేదు. ఇటీవలనే Scindia Steam Navigation Company కి సంబంధించిన Hindustan Ship Building Yard వున్న విశాఖపట్టణములో arc welders కావాలని మొన్ననే ఒక advertisement పత్రికలలో పడ్డది. Arc welders కావాలంటే యిక్కడ మనకు సాంఘికంగా తరిఫీదుపొందిన workers, నైపుణ్యము సంపాదించ గలిగిన ప్రాంతమైన విశాఖపట్టణములోనే యీ arc welders కు కొరతవచ్చింది. ఇతర రాష్ట్రములకు పోయి ఎక్కడో ప్రైవేటుకంపెనీలలో చేరి, పని నేర్చుకొని సర్టిఫికేట్లు సంపాదించుకొనివచ్చి యిక్కడ వుద్యోగము యిన్వమని అడిగినప్పుడు, యీ సర్టిఫికేట్లు పనికిరావు, మేముచేర్చుకోము, పొమ్మని అంటున్నారు. వీరిని వుద్యోగాలలో చేర్చుకోకుండా, ఎక్కడో మలబారునుంచి వచ్చినవారు దరఖాస్తులుపెట్టుకుంటే, వారిని చేర్చుకుంటున్నారు. వారికి first priority యివ్వడము జరుగుతోంది. దీనికి కారణమేమిటంటే, మనకు యిక్కడ ప్రభుత్వము తరపున యీ qualification కు గాను తగినస్కూళ్లు లేకపోవడమే. వారి ప్రైవేటు సర్టిఫికేట్లు వుపయోగించలేదు. కాబట్టి ప్రభుత్వము యిటువంటి skilled workers ను తయారుచేసి ప్రభుత్వముతరఫున certificates యివ్వటానికి అవకాశములు కలుగజేయాల్సివుంది. ప్రభుత్వము యీ విషయములో తగుశ్రద్ధ వహిస్తారని ఆశిస్తున్నాను. తగినంతమంది Mechanical Engineers ను, Civil Engineers ను తయారుచేయాలి. ఇందుకు తగినన్ని Engineering కళాశాలలు ఏర్పాటుచేయాలి. వివిధ పరిశ్రమలకు పనికివచ్చే mechanics ను కళాశాలలుపెట్టి తయారుచేయాలి. ప్రభుత్వము యిప్పటికియినను ప్రాంతీయవిబేధాలు మాని తగినన్ని schools పెట్టి, యీ mechanics ను, Engineers ను వెనువెంటనే తయారుచేయటానికి ఏర్పాటు చేయాలి. రాష్ట్రములో ఎంతోమంది యువకులు ఉద్యోగాలు లభించక తిరుగులాడు చున్నారు. ఈ యువకులకు ప్రభుత్వము ప్రోత్సాహమివ్వాలి. ప్రభుత్వము తీవ్రంగా ఆలోచించవలసిన విషయముయిది. డబ్బువున్నవారు విదేశాలకు పోయి ఉన్నతవిద్య నభ్యసించి వస్తున్నారు. ఇక డబ్బులేనివారు ఎక్కడికి పోగలరు?

Sri B. Appa Rao] [3rd October 1955

ప్రభుత్వము ఏదోవిధంగా కళాశాలలను నిర్మించి machanics ను తయారుచేయా లని అంటున్నాను. డబ్బులేనివారు S. S. L. C. కూడా పూర్తిచేయలేక అంత టితో ఆగిపోతున్నారు. రాష్ట్రములో S. S. L. C. తప్పినవారే చాలామంది వున్నారు. ఈవిధంగా తప్పినవారికి ప్రభుత్వ కచ్చేరీలలో చూస్తే, ఉద్యోగము లభించదు. ప్యాసు అయినవారికి ఏవిధంగానైనను ఉద్యోగాలు లభిస్తాయి. తప్పిన వారిసంగతి యేమిటి ? అందుకనే ప్రభుత్వము యిటువంటి training colleges అయినను ఏర్పాటుచేసి mechanics మొదలైనవారిని తయారుచేస్తే వారందరికి జీవనోపాధి ప్రభుత్వము కల్పించినట్లవుతుంది. ప్రభుత్వోద్యోగాలకు ఎన్నో నిబం ధనలు ఏర్పడివున్నవి. తప్పినవారికి ఆ నిబంధనలు అడ్డమువస్తున్నవి. నా సూచన అంగీకరిస్తే, నిరుద్యోగసమస్యగూడా చాలమటుకు solve అయిపోతుంది. S.S.L.C. తప్పినకారణముచేత, వారికి యితరత్రా mechanics మొదలైన qualifications లేనికారణముచేత, వుద్యోగాలు లభించని కారణముచేత, వారు తమ తలిదండ్రులను పోషించుకోలేనిస్థితిలో వుంటున్నారు. వారికి ప్రభుత్వము ఏదోవిధంగా training యిచ్చి వుద్యోగాలు దొరికేటట్టుచూడాలి. అటువంటి సందర్భములో ప్రభుత్వము ఎక్కువశ్రద్ధ వహించవలసిందిగా కోరుతున్నాను. ఇటీవల బడ్జటుసమావేశములో ముఖ్యమంత్రిగారు, అమలాపురం అనకాపల్లిలోవున్న colleges కు గ్రాంటు యివ్వబోతున్నామని చెప్పారు. ఈ విషయములో యింతవరకు ఏవిధమైన రిపో ర్టులు రాలేదని అన్నట్లుగా తెలుస్తున్నది ఆ రిపోర్టులను ప్రభుత్వము వెంటనే తెప్పించి చాలాకాలమునుంచి pending గా వున్న ఆ రెండుకాలేజీలకుకూడా grants యిచ్చి, రాబోయేరిపోర్టుల ప్రాతిపదికపైన grants యిప్పిస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

SRI K. V. S. PADMANABHA RAJU :—అధ్యక్షా, ప్రస్తుతం నాది ఒక cut motion కూడా ఉన్నది. ఇప్పుడు ఉస్మానియా కాలేజీకి ప్రత్యేకంగా ఒక లక్ష రూపాయిలు కేటాయిస్తున్నట్లు చూపించారు. చాలా సంతోషం. కాని ఒకటి మాత్రం వున్నది. ఇవాళ కర్నూల్ జిల్లా మొత్తము మీద ఈ కర్నూలులోనే ఉస్మానియా కాలేజీ వున్నది. కర్నూలు ఈనాడు రాజధానిగా వుండడంవల్ల, జిల్లా అంతటికి ఒకే కాలేజి వుండడమువల్ల ఇంకా చాలా ప్రాధాన్యత ఇవ్వాలని అనుకుంటాను. కాని ఇవాళ ఇక్కడకు ఇతరత్రా వచ్చేటటువంటి జనాభాగాని, ఆఫీసులువచ్చి ఇక్కడ వుండడమువల్లగాని చాలావరకు అక్కడ వున్నటువంటి administration ను కూడ సరియైన పద్ధతిలో పెట్టడానికి ప్రభుత్వము బాధ్యత తీసుకోవాలని చెప్పి అనుకొంటాను. కాని ఈ కాలేజీలో ఇప్పుడు జరుగుతున్న పరిస్థితిని మాత్రం ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తాను. దానిని మరొక విధముగా భావించవద్దని చెబుతున్నాను. ఇవాళ

ఆ కాలేజిలోవున్నటువంటి సీట్ల విషయంలో చాలామంది స్నేహితులు నాకు చెప్పారు. అక్కడ ముస్లిం విద్యార్థులకు సీట్లు అన్నీ పూర్తి అయిన తరువాత ఏమైనా ఖాళీ వుంటే రెండవ జాతివారికి ఇవ్వాలనే సిద్ధాంతాన్ని అక్కడ నడుపుతున్నారు. కాని ఇటువంటి Secular State లో అది మాత్రము సమంజసము కాదని నేను మీ దృష్టికి తీసుకువస్తున్నాను. అక్కడవున్న లైబ్రరీ సంగతి తీసుకుంటే అందులో 10 వేల పుస్తకాలు వున్నాయని అందులో అరేబిక్ పర్షియన్ లైబ్రరీ 3 వంతులు భాగంగావున్నదని, ఈవిధంగా దాంట్లో వుంటున్నప్పుడు మనం Secular State లో ఒక కాలేజీని నడిపిస్తున్నప్పుడు నాల్గు రకాలుగా ప్రాధాన్యము ఇవ్వాలి. వారు చేసుకోనేటటువంటి మత ప్రకారము వారు చేసుకోనవచ్చును. దాని కేమీ అభ్యంతరములేదు. ఆ కాలేజికి ప్రభుత్వం ఒక లక్షల రూపాయిలే కాదు ఇంకా హెచ్చుగా కూడా ఇవ్వవలయునని సలహా ఇస్తున్నాను. దీనిని అటువంటి పక్షపాత లైబ్రరీకి ఎప్పుడుకూడా పోనీయకూడదని చెప్పి ప్రభుత్వముకూడా ఎప్పటి కప్పుడు అజ్మాయిషీ కూడా తప్పనిసరిగా వుంచుకొని ఇటువంటి అన్యాయాలను జరగకుండా అక్కడవున్నటువంటి ప్రయారిటి గురించి అక్కడ వున్నటువంటి సైన్సు గ్రూపుగాని ఇంకేదైనా ఒక గ్రూప్ కావాలంటే ముస్లింములలో అందరికి పూర్తి అయిన తరువాత ఏదైనా 42 ఖాళీలు వుంటే ఇవ్వడము లేకపోతే లేకపోవడము జరుగుతోందని చెప్పి ఇక్కడ చాలామంది విద్యార్థులు నాకు చెప్పారు. ఇంతకు ముందు మన వావిలాల గోపాలకృష్ణయ్యగారు మాట్లాడుతూ దానిమీద మనకు ఏమీ పెత్తనము లేదని చెప్పారు. పెత్తనం అంటే మరేమీలేదు. ఇవన్నీవున్నటు వంటి కాలేజీ లన్నింటిమీద private individuals నడిపే కాలేజీమీద ప్రభుత్వానికి పెత్తనము అనేది వుంటుంది. ముఖ్యంగా రాజధానిలో వున్నటువంటి ప్రభుత్వముకూడా లక్షలకొలది రూపాయలు దానికి ఇవ్వడము జరుగుతోంది. కాబట్టి ఎటువంటి Secular State అయినా ఇటువంటి పక్షపాతవైఖరిని నిర్వహించడం మంచిదికాదు. అందుచేత దానిని ప్రత్యేకమైనటువంటి ఆధిపత్యము క్రింద తీసుకొని వీటన్నింటినీ సరిగా విచారిస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri N. P. CHENGALRAYA NAIDU :—అధ్యక్షా, ఈ cut motions ను నేను వ్యతిరేకిస్తూ కొన్ని సూచనలు చేస్తాను. ముఖ్యంగా మన ప్రభుత్వం ఇక్కడ single teachers schools ఈనాడు అనేకము ప్రతి గ్రామంలో కూడా ఏర్పాటు చేస్తున్నది. అందువల్ల ప్రాథమిక విద్యావిధానం సక్రమంగా అమల్లోకి వస్తున్నది. మునుపు compulsory elementary education అని ఏర్పాటు చేసినారుగాని అప్పటికంటేకూడా ఇప్పుడు ఈ single teachers schools ఏర్పాటుచేసిన దానివల్ల ప్రాథమిక విద్యావిధానము

సక్రమంగా అమలు జరిగినందుకు ప్రభుత్వాన్ని మంత్రిగారినికూడా అభినందించ వలసివున్నది. ముఖ్యంగా ప్రభుత్వమువారు ప్రాథమిక విద్యాయందే గాక సెకండరీ పాఠశాలలో విద్యావిధానాల గురించికూడా తగు శ్రద్ధ తీసుకొని పాఠశాలలో మార్పులుకూడా చేస్తున్నారు. వృత్తి విద్యకూడా నేర్పుటకు అనేక పాఠశాలలు ఏర్పాటు చేస్తున్నారు. పోతే ఇక కాలేజీల విషయంలో మాత్రము ప్రభుత్వము వ్యాపార దృష్టిలో కాకుండా అక్కడక్కడ కాలేజీలు ఏర్పాటు చేసేందుకు ముందుకు రావాలని మాత్రము మనవిచేస్తున్నాను. ముఖ్యంగా తిరుపతిలో వెంకటేశ్వర యూనివర్సిటీలలో ఒక వైద్య కళాశాల ఏర్పాటు చేయడానికి దేవస్థానము వారు, 50 లక్షల రూపాయి ఇస్తారని చెప్పినారు. ప్రభుత్వమువారు ఎక్కడఅయినా ఒక కళాశాల ఏర్పాటు చేయవలసి వుంటే ప్రజలు విరాళాలు యివ్వాలి అంటారు. ఆదేవిధంగా తిరుపతిలో 50 లక్షల రూపాయలు వారు ఇస్తామనిచెప్పి కొన్ని సంవత్సరములు అయింది. ప్రభుత్వానికి తెలిపినారు. ఇంతవరకుకూడా ప్రభుత్వం అక్కడ వైద్య కళాశాల ఏర్పాటు చేసేందుకు వారు యిచ్చే 50 లక్షల రూ॥లు తీసుకుంటామనిగాని, వైద్యకళాశాలకు కొత్తకట్టడాలు కట్టేందుకు ఏర్పాటులుగాని చేయలేదు. ఇంజనీరింగు కళాశాల విశాఖపట్టణంలో ఆంధ్ర యూనివర్సిటీలో ఏర్పాటు చేసినారు. ఆరీతిగా తిరుపతి యూనివర్సిటీలోకూడా ఒక ఇంజనీరింగు కళాశాలను ఏర్పాటుచేస్తే బాగుంటుంది. ఈ ప్రాంతం ప్రజలందరికీకూడా అందుబాటులో వుంటుంది. మనము ఇప్పుడు ఎన్నో కొత్తప్రాజెక్టులు కట్టుకొంటున్నాము. మనకు చాలామంది ఇంజనీర్లు కావలసి వస్తారు. అందువల్ల తిరుపతిలోగూడా ప్రభుత్వమువారు తగిన శ్రద్ధ తీసుకొని ఒక ఇంజనీరింగు కాలేజిని ఏర్పాటుచేయాలని మనవిచేస్తున్నాను. ఇదివరకు ఒకతూరి మన ముఖ్యమంత్రిగారు ఇంజనీరింగు కళాశాల తిరుపతిలో స్థాపించ డానికి తగిన భవనములులేవు అందువల్ల ఏర్పాటు చేయలేదని సెలవిచ్చారు. అందు వల్ల వచ్చేసంవత్సరముకూడా అదేమాట చెప్పకుండా వుండేందుకు ఆ భవనములు కట్టేందుకు ఏర్పాటు చేయిస్తారని నేను మనవిచేస్తున్నాను. ముఖ్యంగా ప్రతిజిల్లా ముఖ్యపట్టణములోగూడా ఒక కళాశాలను ఏర్పాటు చేస్తామని వారు పదేపదే చెబుతూవచ్చారు. కాని ఈ చిత్తూరుజిల్లా ముఖ్యపట్టణం అక్కడ కళాశాల ఏర్పాటు చేసేందుకు వారు శ్రద్ధయేమీ చేయలేదు. వారు ముఖ్యపట్టణము లన్నింటిలోకూడా కళాశాలలు వుండవలసిందని చెప్పినప్పుడు అది అమలు జరిపేందుకు ప్రయత్నించాలని నేను ముఖ్యమంత్రిగార్ని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

**Sri D. GOPALA RAO**:—Mr. Speaker, Sir, there is a Polytechnic School at Kakinada, which trains boys as techni-

cians. But a difficulty comes in as far as their practical training is concerned. The boys are supposed to have practical training but there are no facilities for such practical training anywhere. So much so, most of these boys who pass out are unable to get practical training in any factory of heavy machinery. I would therefore suggest to the Hon. Minister to take some interest and see that big concerns, where there is heavy machinery, are compelled to give practical training to the boys that come out of this school.

Besides, the demand of every village is also to start High schools. And the difficulty is that we have all sorts of schools springing up with no good education being imparted there. I would request the Hon, minister to examine this question and concentrate on one school where transport facilities and mid-day meals could be provided to the boys, and thus make it an ideal school. Thank you, Sir.

1-0 p. m.

THE HON. SRI B. GOPALA REDDI :—ఉపాధ్యక్షా, ఈ డిమాండుమీద ఎక్కువగా వ్యతిరేకత లేనందుకు చాలా సంతోషం. పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లుగారుకూడా మొదటి పర్యాయంగా ప్రభుత్వాన్ని అభినందించారు చాలా సంతోషం. ప్రాథమిక విద్యాసంస్థలలో single teacher schools ను ఎక్కువగా పెట్టి వ్యాప్తి చేస్తున్నందుకు సభ్యులందరు హర్షాన్ని ప్రకటించారు. ఇది చాలా సంతోషమైన విషయం. కాని శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లుగారు మరల subsidised schools ఎక్కువ చేయడం ఎందుకు, ఒకవైపు aided schools అన్నీ Government తీసుకొంటూ మరొకవైపు వాటిని ఎక్కువచేయడం బాగాలేదని ప్రకటించారు. అందులో సాధకబాధకాలు చాలా వున్నాయి. ప్రతిజిల్లాలోను aided schools 100 కు పైగావున్నాయి. భవనాలు వారివి furniture వారిదే. వీటిని తీసుకుంటే ప్రతిగ్రామంలో సరియైన భవనం దొరకకపోవచ్చును. చిన్న ప్రదేశాలలో నందిగామవంటి చోట aided schools నడుపుతున్నారు. బాగా నడుపుతున్నారా లేదా అన్నది వేరేవిషయం. వాటి అన్నింటిని గవర్నమెంటు తీసుకునే ప్రయత్నం చేసినప్పుడు చాలాకష్టాలు ఉంటాయనే ఉద్దేశంతో విశాఖపట్నం, నెల్లూరు జిల్లాలలో తీసుకుని ప్రయత్నం చేస్తామని అనుకొన్నాము. ఈ జిల్లాలలో ఎక్కువమంది High Court writకు పోరేమోనని ఆశకూడా వున్నది. మిగిలిన జిల్లాలలో writ వేస్తారనే భయంఉన్నది. లేనిపోని దావాలువేసి ఫీక్కునంత

Sri B. Gopala Reddi] [3rd October 1955

స్తంభింప చేస్తారేమో ననే భయంకూడా వున్నది. అందువల్ల క్రమేణా అనుభవం సంపాదించి చేయవలసిన విషయం. వచ్చేసంవత్సరం నెల్లూరు, విశాఖపట్నం జిల్లాలలో తీసుకుని ఎక్కువఖర్చు అవుతుందో లేకపోతే, దానికిగల అంతరాయాలు ఏమిటో అవిఅన్నీ పరిశీలన చేయడానికి అవకాశం ఏర్పడుతుందని మనవిచేస్తున్నాను. ఈలోపల employment opportunities కూడా మనం ఎక్కువ చేసుకోవాలి. అనేకమంది trainee teachers unemployedగా ఉంటే వారికోసం స్కూల్సు ప్రభుత్వంవారు ప్రత్యేకించి ఉంచడం ఉచితమైన విషయం. ఈ విషయంలో Government of India వారు సహాయం చేస్తున్నందుకు చాలా సంతోషించవలసి యున్నది. పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారిని కొంచెం నిదానంగా, సావకాశంగా పరిశీలించాలని కోరుతున్నాను. ఉస్మానియా కాలేజివిషయం ఎక్కువగా డిమాండులో వచ్చింది. ప్రభుత్వంవారు ఈ కాలేజి అభివృద్ధికి లక్ష రూపాయలు యిచ్చారు. రాజధాని నగరంలో అనేక మందికి విద్యాసౌకర్యాలు కలిగించడానికి ఒక్కసారి ఎక్కువైన strength కు తగినట్లుగా accommodation పెంచడానికి ఈ డబ్బు ఇవ్వబడింది, దీనిని అందరూ ఆమోదించినారు. కాని ఈ సందర్భంలో కాలేజీ వ్యవహారాలను గురించి విమర్శించినారు. నా దగ్గర లెక్కలున్నాయి, ఎంతమంది మహమ్మదీయ విద్యార్థు లున్నారో, ఎంతమంది మహమ్మదీయేతర విద్యార్థు లున్నారో. బహుశా నాలుగవవంతు మహమ్మదీయ విద్యార్థులున్నారు. మిగిలిన వారందరు హిందూవిద్యార్థులే. నాకు తెలిసినంతవరకు ఈ కాలేజీకి ఇచ్చిన దాత లందరు మొదటనుంచి మహమ్మదీయులుగానే ఉన్నారు. హిందువులలో ఒక్కరు ఈ కాలేజీకి పెద్ద విరాళాలు ఇచ్చినవారులేరు. Muslims దానిని ప్రారంభంచేసారు. హైదరాబాదు ప్రభుత్వంవారు దానికి రెండులక్షల రూపాయలు ఇచ్చారు. అందువల్లనే ఉస్మానియా కాలేజి అనిపేరు పెట్టారు. అయినా ఇది కేవలం మహమ్మదీయులకే ప్రత్యేకించినట్లు కాక అందరిని చేర్చుకోడానికి వారు ప్రయత్నిస్తున్నారు. ప్రయత్నం చేయడమే కాకుండా లెక్కలప్రకారం అది రుజావు అవుతున్నది. వారి library లో Persian, Arabic గ్రంథాలు మాత్రమే ఉన్నాయి. Secular State లో ఆవిధంగా ఉండడం న్యాయమా అని పద్మనాభరాజుగారు ప్రశ్నించారు.

Sri K. V. S. PADMANABHA RAJU :— మతానికి సంబంధించిన పుస్తకా లున్నాయని వ్యతిరేక భావంతో నేను మాట్లాడడం లేదు. మిగతా పుస్తకాలుకూడా students కు అవసరం కాబట్టి అన్నివిధాలా, ఆ పుస్తకాలకు కూడా ప్రాధాన్యత ఇవ్వాలనే భావంతో చెప్పాను.

THE HON. SRI B. GOPALA REDDI :— మత విషయానికి సంబంధించిన పుస్తకాలే కాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేక అరబిక్, పర్షియన్

పుస్తకాలు వుండవచ్చును. కొంతవరకు ఉరుదూ culture పెంపొందింప చేయడానికి ఒక సంస్థ ఉండడంకూడా అవసరమేమో ? నెల్లూరు, కడప యింకా గుంటూరు మొదలైన యితరప్రాంతాలనుంచివచ్చే మహమ్మదీయులకు ఒక కళాశాల అయినా ఆయువు పట్టుగావుండడము మంచి దేమోనని అనుకుంటున్నాను. మత విషయం వారికి చెప్పటం లేదని ఆ భయం ఎవరికి అక్కరలేదు. మా నేజిమెంటులో లోపాలు వున్నాయని results సరిగా లేవని వావిలాలగారన్నారు. ఆ విషయం కనుక్కోవచ్చు. ఇద్దరు, ముగ్గురు సభ్యులు మాట్లాడారు కాబట్టి ఆ విషయం దర్యాప్తు చేస్తామని చెపుతున్నాను. D. P. I. యూనివర్సిటీని కనుక్కోవాలి అని చెప్పవచ్చు. ఇందులో గవర్నమెంటుకు అట్టే అధికారము లేదు. యూనివర్సిటీవారు చేయాలి. ఆంధ్రా యూనివర్సిటీవారిని అడగితే రేపు జూలైనుంచి వెంకటేశ్వర యూనివర్సిటీకి పోతుంది కాబట్టి అంతవరకు ఆగండి అని చెప్పవచ్చు. వెంకటేశ్వర యూనివర్సిటీ వారిని అడిగితే మా చేతులలోనికి రాలేదు కాబట్టి జూన్‌వరకు ఆగండి అని చెప్పవచ్చును. ఇవన్ని సున్నితమయిన విషయాలు. వీటిని గమనించి కాలేజి పరిపాలనలో లోపాలువుంటే ప్రత్యేకించి కనుక్కుంటాము. కాలేజీవారు యింతవరకు విరాళాలు సంపాదించి పనిచేస్తున్నందుకు చాలా సంతోషం. దానికి చిహ్నంగామాత్రమే యీ లక్షరూపాయలూ యిచ్చాం. కాని సైన్సు subjects అన్నింటికీ యివ్వడానికి చూస్తే చాలా కష్టం వుంటుందేమో దానికి వారి అప్లికేషను రావాలి. యూనివర్సిటీ వారు శాంక్షన్‌చేయాలి D. P. I. ఏమయినా ధనం యివ్వడానికి వీలుంటుందేమో చూడాలి. అంతేకాని, అదిలేదు, ఇది లేదు అంటే డబ్బు ఇస్తే పెడతాము అని మనమీదే భారం వేస్తారు. ఏ కాలేజీకి అయినా మరీ దగ్గరగా పోకుండావుంటే మంచిది. ఇది యూనివర్సిటీ వ్యవహారం. వారు అప్లికేషన్ పెట్టి ఆడిగితే మన వసతిని బట్టి ధనాన్ని యియ్యడానికి వీలుంటుంది. ఇంజనీరింగు కళాశాలలు ఎక్కువ కావాలని వావిలాల గోపాలకృష్ణయ్యగారు, తిరుపతిలో పెట్టాలని చెంగల్రాయ్ నాయుడుగారు, చెప్పారు. వాల్తేరులో 3 వ ఇంజనీరింగ్ కళాశాల పెట్టిన తర్వాత Central Technical Education కమిటీవారు దానికి కొన్ని అంతరాయాలు కలిగిస్తున్నారు. అంటే, వారు చేసేది దురుద్దేశ్యముతో కాదు. ఆంధ్రాలో యిప్పటికే రెండు కాలేజీలు ఉన్నాయి. 3 వది పెడుతున్నారు ; 300 మంది గ్రాడ్యుయేట్సు మీకు అవసరమా ; మీకు కావలసింది ఓవర్సీరులు, సూపర్‌వైజర్లు, డ్రాఫ్ట్సుమెన్‌లు తప్ప 300 మంది గ్రాడ్యుయేట్సును absorb చేసుకోగలరా అని అడుగుతున్నారు. దీనికోసం మరల చర్చలు జరిగాయి. మన చీఫ్ ఇంజనీరుగారు D. P. I. గారు చర్చలు జరిపారు. వచ్చేవారం మన చీఫ్ ఇంజనీరుగారు తిరిగి ఢిల్లీ వెడుతున్నారు. వారి అనుమానాలు తీరలేదు. నందికొండ అయినా, మరొకటయినా ప్రతిసంవత్సరం 300 మంది Graduate Engineersను ఏ విధంగా absorb చేయ

Sri B. Gopala Reddi] [3rd October 1955

గలరని పదేపదే అడుగుతున్నారు. అంతకన్న ఎక్కువగా absorb చేయగలమా అనే పాయింటు సరిగా పరీక్షచేయవలసి యుంటుంది. ఇంజనీరింగ్ కళాశాలలు ఎక్కువ చేసేముందు అనేక విషయాలు పరీక్షచేయవలసి యుంటుంది. పరీక్ష చేయకుండా ప్రారంభిస్తే Central Technical Education కమిటీవారు capital expen-diture కై గ్రాంట్లు సహాయంచెయ్యరు. వారు చేసే పూర్తి సహాయం పొందడానికి వారి అనుమానాలు తీర్చవలసియున్నది. అందుచేత ఇంజనీరింగ్ కళాశాలల విషయం కొంచం సున్నితంగా ఆలోచించవలసి యున్నది. మెడికల్ కళాశాలలు మనకు యింకా ఎక్కువగా కావాలి. అది అవసరమే. అనేక గ్రామాలలో డాక్టరులు లేరు. ఏమి చేయాలి. L. M. P. మాదిరి ఏమయినా చెయ్యడానికి వీలున్నదా ? వైద్యులు, హకీములు తయారుచెయ్యడమా ? అందరూ M.B.B.S. కావాలా ? యిది చాలా పెద్ద విషయం.

ఈ విషయములో కేంద్రప్రభుత్వమువారుగూడా కొంతమటుకు ఆలోచిస్తున్నారు. Engineering course విషయములో కొంతమటుకు రెండున్నర సంవత్సరాల Diploma course ఒక Short term course పెట్టటానికి వీలున్నదా అనేసంగతి కేంద్రప్రభుత్వంవారుకూడా ఆలోచిస్తున్నారు. కాని ఆ Short term course చదువుకొని తయారైనవారు కేవలం యింతకుముందువున్న L. M. Ps. D. M. S. మొదలైనవారి మాదిరిగావుండాలా, లేకపోతే వారు ఒక డాక్టరుక్రింద పనిచేసేవారుగా వుండాలా, అనేవిషయము యింకను కేంద్రప్రభుత్వమువారు నిర్ణయం చేయలేకుండా వున్నారు. కనుక ఆ విషయము పూర్తిగా తేలే వరకూ ఈ Medical education ఎక్కువగా వ్యాప్తింపచేయటానికి వీలు లేకుండావున్నది. కాని ఇంజనీరింగు కళాశాల, Agriculture కళాశాల మాదిరిగా కాకుండా యీ Medical college విషయములో హాస్పటల్సులో చాలా ఎక్కువగా ఖర్చుచేయవలసివస్తున్నది. ఇంతవరకూ, హాస్పటల్సులో ఒక్కొక్క సీటుకు పది beds అయినా వుండాలనివారు కోరుతూవచ్చారు. కాని యిటీవల ఒక్కొక్క సీటుకు 7.5, బహుశ అంతమటుకే కాబోలు ఏర్పాటుచేసినట్లు నాకు జ్ఞాపకము. మనము యిప్పుడు సుమారు యాభై మంది students ను ఒక కాలేజీలో చేర్చుకోవాలిఅంటే, ఆహాస్పిటల్సులో దాదాపు నాలుగువందల beds వుంటేనే గాని, చేర్చుకోటానికి వీలులేకుండా వున్నది, నాలుగువందల beds వుండాలంటే, అక్కడ హాస్పిటల్ లో ఎంతమంది staff వుండాలో ఎంత capital expenditure అవుతుందో ఎంత diet expenditure అవుతుందో, యీ విషయాలన్నీ ఆలోచించవలసివుంటుంది. అందువల్ల Medical college ప్రారంభించాలంటే, కోటి రూపాయలువుంటేనే తప్ప సాధారణపరిస్థితులలో ప్రారంభించటానికి వీలుండదు మొన్న నాగపూరులో ఒక Medical college స్థాపించారు. దానికి దాదాపు

మూడుకోట్లరూపాయలు ఖర్చుఅయినది. నేనుకూడా పోయిచూచివచ్చాను. అక్కడనే సిబ్బందికి Quarters గూడా కట్టారు. వారు యీ Postwar development స్కీముక్రింద ఆ కళాశాల ఏర్పాటుచేశారు. ఒక్క యీ Medical College కొరకే దాదాపు మూడుకోట్ల రూపాయలు ఖర్చుచేశారు. అందువల్ల యితర కళాశాలలమాదిరి కాకుండా, యీ Medical college విషయములోమాత్రము, college ఏర్పాటు చేసేముందు, ఆ హాస్పిటల్ staff strength ఎంత వున్నది, bed strength ఎంతవున్నది, nursing staff, hospital కు staff ఎంతవున్నది, యిటువంటి విషయాలన్నిగూడా ఆలోచించి ఏర్పాటుచేయాలి. కాబట్టి మనముకూడా Medical college స్థాపించాలంటే మన ప్రభుత్వముయొక్క ఆర్థికపరిస్థితి ఏమిటోగూడా తీవ్రంగా పరిశీలించుకోవాలి. ఏదో తిరుపతిదేవస్థానము వారు వెంకటేశ్వర యూనివర్శిటీకి యాభైలక్షలరూపాయలు యిచ్చారు, కాబట్టి మనం యింకా ప్రతిసంవత్సరము వారివద్దనుంచి తీసుకోగలుగుతామని ఆశిస్తున్నాము. కాబట్టి, ఆ యూనివర్శిటీని మనము స్థాపించుకోగలిగాము. యిది యింతటితో ఆగిపోయేదికాదు. ఇప్పటికి మనము Capital expenditure క్రిందనే ఎక్కువగా ఖర్చుచేయవలసివుంటుంది. ఇదిగాక ప్రతిసంవత్సరము పెట్టవలసిన recurring expediture గూడ గుర్తించాలి. ఈ ఖర్చుకంతటికి, ఆ దేవస్థానంవారు యిచ్చారు. యివ్వబోతున్నారు కాబట్టే, మనము ఆ యూనివర్శిటీని పెట్టుకోగలిగాము. కాబట్టి మన ప్రభుత్వముయొక్క ఆర్థికపరిస్థితులుగూడ ఎట్లావున్నాయి అనే విషయము మనం తీవ్రంగా ఆలోచించుకొని చేయవలసివుంటుంది. అందువల్ల వావిలాల గోపాలకృష్ణయ్యగారు చెప్పినదానికి నేనుచెప్పే సమాధానము యేమిటంటే, Polytechnic లో తయారైనవారుగాని, లేకుంటే Short term course చదివి తయారైనవారుగాని, యీ Graduate Engineers కారేమోనని Planing Commission వారు Technical Committee వారుగూడా చెబుతున్నారు. Polytechnics లో చదువుకుని ప్యాసుఅయినవారికి కొన్ని సౌకర్యాలుకూడా కలుగజేయవలసివున్నది. ప్యాసుఅయినవారిని apprentices గా ఎవరున్నా తీసుకోవడము లేదని గోపాలకృష్ణయ్యగారు, గోపాలరావుగారు చెబుతున్నారు. అందువల్ల యీ Polytechnic courses విషయములో Licenciates ను అందరినీ ఏదో కొన్ని Workshop లోనో, లేకపోతే P. W. D. Workshop లోనో తీసుకోటానికి ప్రభుత్వము తప్పకుండా ప్రయత్నిస్తుంది. ఇంతవరకు వారికి వున్నటువంటి యిబ్బందులు ఏమేమివున్నవో అవన్నీ పరిశీలించి, వారికి అటువంటి యిబ్బందులు లేకుండ చేయటానికి ప్రయత్నము చేస్తాము.

Sri B. Gopala Reddi] [3rd October 1955

ఈ కొన్నికొన్ని కళాశాలలకు గ్రాంట్లు కావాలని అన్నారు. అనకాపల్లి కాలేజీకికూడా గ్రాంటు కావాలని సభ్యులు కొంతమంది చెప్పారు. ఆ విషయములు అన్నీ మేము Director వద్దకు పంపివున్నాము. డైరక్టరుగారికి వున్నటువంటి allotment ను బట్టి వారు ఆయాకళాశాలలకు ఎంతెంత గ్రాంటు యివ్వాలో, అదంతా వారు పరిశీలించియిస్తారని మేము అనుకుంటున్నాము. ముఖ్యంగా యీ private colleges కూడా తప్పకుండ సహాయముచేయటానికి పూనుకుంటారని ఆశిస్తున్నాము. ఏది ఏమైనప్పటికిన్నీ, యీ డిమాండుగురించి ఏలాంటి విమర్శ, వ్యతిరేకత లేకుండా అందరుగూడ అనేక సలహాలిస్తూ, ఆమోదించినందుకు చాలా సంతోషిస్తున్నాను. సభ్యులుచెప్పిన విషయములపై నేను చెప్పిన సమాధానము వారిని తృప్తిపరచినట్లయితే వారుతెచ్చిన cut motions ను withdraw చేయవలసిందిగా కోరుతున్నాను.

Sri K. V. S. PADMANABHARAJU:—Mr. Speaker, Sir. I beg leave of to House to withdraw the cut motion moved by me,

...The cut motion was, by leave of the House, withdrawn.

Sri PILLALAMARRI VENKATESWARLU :—Sir, I am pressing my cut motion. ఎందుకంటే, నేను తెచ్చిన cut motion లో raise చేసిన issue ఏమిటంటే, కొత్తగా స్థాపించినస్కూళ్లను fully aided schools గా ఏర్పాటుచేయడమా, లేకపోతే subsidised schools గా ఏర్పాటుచేయడమా అనేదే. అలాంటప్పుడు ప్రభుత్వము కొత్తగా స్థాపించబోయే స్కూల్సు, ప్రభుత్వమే స్థాపించాలని నా భావము. అదీ యింకా తేలలేదుకాబట్టి నా cut motions ను press చేస్తున్నాను.

The Hon. Sri B. GOPALA REDDI :—అధ్యక్షా, అట్లాగే చేస్తున్నాము. కొత్తగా ఏర్పాటుకాబోయే single teacher schools లో పనిచేయటానికి నియమింపబడే టీచర్లవద్దనుంచి మూడుసంవత్సరముల కాలము, ఒకొక్క గ్రామములో వుండి పనిచేస్తామని హామీ ఒకటి పుచ్చుకొంటున్నారు. ఆగ్రామములోనివారి సహకారము పొందటానికి వారిద్వారా యీ స్కూలుకుగాను ఒక భవనము సంపాదించటానికి, ప్రభుత్వముగూడా ఒక గ్రాంటుమాదిరిగా, ఒక subsidy అనేది యిస్తున్నారు. ఈ గ్రాంటుతో ఆ టీచరు ఆ గ్రామములోనే వుండి పనిచేయటానికి వీలుగా వుంటుంది. ఇదంతా ప్రజల సహకారంముతో చేయ

3rd October 1955] [Sri B. Gopala Reddi

వలసివుంటుంది. అలా కాకుండా ప్రభుత్వమే స్థాపించి నడిపేటట్లయితే, ఆ గ్రామములో ఒక భవనము acquire చేయవలసివుంటుంది. ఆవిధంగా చేయడ మంటే, కొన్ని యిబ్బందులు సంభవిస్తాయి. అందువల్ల యీ teacher మీద నే కొంతమటుకు బాధ్యత పెట్టి, యీ మూడుసంవత్సరములు ప్రభుత్వము యిచ్చే subsidy తో, యీ స్కూలును నడపండి, అని యీ మూడు సంవత్సరములు ఆయన అక్కడవుండి పనిచేయటానికి ఒకహామీ తీసుకొని పనిచేయించినట్లు అవుతుంది. ఇదిగాక వారికి ఒక వుద్యోగముయిచ్చినట్లు అవుతుంది, అతనిమీద యీ స్కూలును నడిపేవిషయములో కొంతబాధ్యత పెట్టినట్లు, ప్రజలసహాకారముగూడా పొందేటట్లు, యీ విషయాలన్నీ అందులో యిమిడివున్నాయి కాబట్టి ప్రభుత్వము ఆవిధంగా ప్రయత్నిస్తున్నది. అంతేగాని ఒక్కసారిగా ప్రభుత్వమే యీ స్కూలును స్థాపించటానికి ప్రయత్నిస్తే, భవనము సంపాదించడము, furniture వగైరాలు సప్లయి, యింకా దానికి కావలసినవి అన్నిగూడ ప్రభుత్వముమీద పడడము అనేది వస్తే కొంత ఆలస్యము అవుతుందనే వుద్దేశముతో, ప్రభుత్వము యీ విధంగా స్కూలును ఏర్పాటుచేయటానికి ప్రయత్నిస్తున్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU : —Mr. Speaker, Sir, I beg leave of the house to withdraw the cut motion moved by me.

The cut motion was, by leave af the House, withdrawn.

MR. SPEAKER : Now, the question is :

"That the Government be granted a further sum not exceeding Rs. 2, 05,400 under Demand XV—Education."

The motion was carried and the Grant was made.

## (2) DEMAND XVI—MEDICAL.

The Hon. SRI B. GOPALA REDDI: Mr. Speaker, Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a further sum not exceeding Rs. 400 under Demand XVI—Medical."

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, ఈ medical demand ఆర్థిక మంత్రిగారు ప్రతిపాదిస్తున్నారు. Constitution అనుమతిస్తే అనుమతించ వచ్చును గాని ఆఖరి అయిన సంప్రదాయం కాదు. Supplementary grants

వచ్చినప్పుడు సభ్యులు చెప్పినదానికి మంత్రిగారు సమాధానము చెప్పవలసి ఉంటుంది. అందువల్ల ఈమధ్యాహ్నము ఆయా cut motions లు వచ్చినప్పుడు ఆయాశాఖ మంత్రులు ఉంటే మంచిది. ఆర్థికమంత్రి సమాధానములు చెప్పలేదని కాదు. పార్లమెంటరీ సంప్రదాయాలను అమలుపరచవలెను. అవసరం ఉంటే మంత్రిగారు ఆలస్యముగా రావచ్చును. ఇప్పుడు ఇద్దరు మంత్రులుమాత్రమే ఉన్నారు. గ్రాంట్ల time లోనైనా ఉండడము న్యాయము. మిగతా time లో లేకపోవచ్చును. అవసరం అయితే.

THE HON. SRI B. GOPALA REDDI :—ఈ సంప్రదాయాలు రెండురకములుగా ఉన్నాయి. పెద్ద సమస్యలు raise చేస్తే రప్ప మామూలు సమస్యలు ఉన్నప్పుడు ఆర్థికమంత్రి సమాధానము చెప్పడం ఉన్నది. నేను సమాధానం చెప్పలేని సమస్యలు ఉంటే మంత్రిగారిచేత చెప్పించడానికి ప్రయత్నం చేస్తాను.

MR. SPEAKER : Motion moved :

"That the Government be granted a further sum not exceeding Rs. 400 under Demand—Medical."

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, దీనిలో మేము కొన్ని points ప్రభుత్వదృష్టికి తీసుకొనిరావలెనని చూస్తున్నాము. మద్రాసులో ఉన్న Guindy Institute ను మనము సరిగా ఉపయోగించుకొనలేక పోతున్నాము. మన రాష్ట్రంలో అలాంటి institute అభివృద్ధి చెయ్యడానికి ఏమి చెయ్యబోతున్నామో ఈ demand లో ఎక్కడా లేదు ఒక్క రోజులో Guindy institute లాంటిది అభివృద్ధిచేసుకొనలేముగాని దానికి ఒక plan ఉండవలెను. రెండవ plan కాలములోనో అంతకులోపునో అయినా ఇక institute అభివృద్ధిపొందవలసిన అవసరం వుంది.

MR. SPEAKER : The Andhra Medical College Visakhapatnam. is not in a position to do Pathological, bacteriological and biochemical investigations for the entire State. The Government have therefore decided to open a Regional Laboratory at Visakhapatnam etc., అని అన్నారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—మొన్న శ్రీ వెంకటరావుగారు అదివేరు ఇదివేరు అన్నారు, అందువల్ల అనుమానం కల్గింది.

Village ప్రాంతాలలో ఉన్నట్టి hospitals కు ఒక regional laboratory పెట్టవలెనని అన్నారు. ఆంధ్రదేశ మొత్తానికిఒకటి కావలెను. గుంటూరులోనో ఎక్కడనో ఒకచోట పెట్టించాలి. ప్రతిచోట develop కావలసినదే కాని ఆ సూచనలు ఏవీ లేవని ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. ఈ విషయాన్ని జాగ్రత్తగా ఆలోచించాలని కోరుచున్నాను. గుంటూరు medical కాలేజీ విషయములో కూడా ఎక్కువ facilities కావలెను. అక్కడవున్న beds, treatment medicines వీటి అన్నింటి విషయంలో కూడా complaints వస్తున్నవి. మంత్రివర్గము ఆలోచించి సరియైన చర్య తీసుకుంటుందని expect చేస్తున్నాను. ముఖ్యముగా మనకు ఒక Guindy institute లాంటిది కావలెను. మంత్రివర్గం ఆలోచిస్తుందని అనుకుంటాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా ! ఈ సందర్భంలో ఒక చిన్న విషయం చెప్పవలసిన అవసరం ఉన్నది. ఈ Health Inspectors, Sanitary Inspectors Course మనకులేదు. ఆ Sanitary Engineering Course, Guntur Medical College లో పెడతారని మేము విన్నాం. అది ప్రారంభించారోలేదో information తెలుసుకోవలసిన అవసరం ఉంది. Health Inspectors Course కూడా Guntur Medical College లో పెట్టాలని ప్రయత్నం జరుగుతోంది కాని ఇంకా ప్రారంభం కాలేదన్నారు. నా information wrong ఐతే నా statement ఉపసంహరించుకోడానికి నా కభ్యంతరంలేదు. కాని ఈ course ఎక్కడుంది ఆ విషయం కాస్త వివరంగా చెప్పాలని కోరుతున్నాను. ఈ Sanitary Engineering Course, direct గా Engineering Course కు సంబంధించినదికాదు. అది Medical కు సంబంధించినదే. Madras లో ఒక College ఉంటే, దాంట్లో చదువుకున్న వారికి, Madras Government అప్పుడు ఉద్యోగాలు ఇవ్వడం జరుగుతూ ఉండేది. ఇప్పుడు మనకదిలేదు. అక్కడ pass ఐనటువంటి Andhra students కొందరున్నారు. వాళ్ళను మనం తీసుకోవడమా, లేకమనమే ఒక Sanitary Engineering College పెట్టుకోవడమా, అనే ఈ రెండింటిలో ప్రభుత్వం ఏమని ఆలోచిస్తున్నారు. Sanitary Engineering Course చదివిన వాళ్లు ఉద్యోగస్థులలో మనకు చాలా తక్కువ ఉన్నారు. అందువల్ల అటువంటివారు కావాలని అనుకుంటున్నాం మనం ఈరోజు Planning అమలు జరుపబోతూఉన్నప్పుడు, Sanitary Engineering Course చదివినవాళ్లు ముఖ్యంగా కావలసి వస్తారు. కనుక ఈ రెండింటినీ సమన్వయపరచి ప్రభుత్వం ఏమిచేయబోతోందని తెలుసుకొన గోరుతున్నాము.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అధ్యక్షా! పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు గిండీలో ఉన్నట్లుగా ఇక్కడకూడా Chemical Examiner, ఆయనకు institute ఉంటుందా అనే point raise చేశారు. దానికి సంబంధించిన మంత్రిగారు లేకపోవడం మూలాన, వైద్య రీత్యా ఈ విషయాన్ని గురించి నాకు కొంచం తెలియడము మూలాన, దానికి సమానం చెప్పాలనుకుంటున్నాను. అదే అభిప్రాయంతోనే ఇప్పుడు ప్రారంభం జరుగుతోంది. కొద్ది సంవత్సరాలలో గిండీలో ఎల్లావుందో, యిది పూర్తిగా ఆవిధంగానే ఉండేటట్లు చెయ్యాలనే అభిప్రాంతోనే ప్రారంభం జరుగుతోంది. Token గా Rs 100/ మాత్రం దీంట్లో చూపించారు. Pay of the officers క్రింద దీనికి non-recurring expenditure ఎక్కువ ఉంటుంది, recurring expenditure కంటె, గిండీలో వున్నట్లే దీన్నికూడా తయారు చెయ్యాలనే ప్రభుత్వం యొక్క అభిప్రాయం.

SRI PILLALAMARRI VENKATESWARLU :— యిందులో

"A regional laboratory at Visakhapatnam is one of the schemes included in the First Five-Year Plan" అని ఉన్నది.

MR. SPEAKER : Starting it on a model scale calling it, Regional Laboratory and later on improving it into a State Laboratory అని ఉన్నది.

SRI P. SUNDARAYYA :—ఇప్పుడు వ్రాసినదాన్నిబట్టి ఒక గిండీ institute లాంటిది మనకు చాలదు. నాలుగు గిండీ instituute లాంటివి ఏర్పాటుచేస్తాం అన్నట్లు అర్థమవుతోంది. ఒక region కు సంబంధించి గిండీ institute లాంటిది ఒకటి develop చేస్తాంఅని అర్థమవుతోంది. అది ఒకటా నాలుగా చెప్పండి.

THE HON SRI B. GOPALA REDDI :—అధ్యక్షా, ఎన్నాళ్ళనుంచో మదరాసు రాష్ట్రానికంతా సంబంధించి Guindy institute develop అవుతూ వస్తున్నది. అటువంటివి మూడో నాలుగో పెట్టాలంటే, అది సాధ్యమయ్యే విషయంకాదు. Andhra State Act ప్రకారం 5 సంవత్సరములవఱకూ Guindy institute వల్ల కలిగే ఉపయోగం మనం పొందడానికి వీలున్నది. కాబట్టి కొన్ని కొన్ని ప్రాంతాలనుంచి ఈమూడు సంవత్సరాలూ Guindy institute కు పరీక్ష నిమిత్తమై పంపించుకోవచ్చును. ఒక nucleus మాదిరిగా ఒక సంస్థను

start చేసి, క్రమేణా దానిని అభివృద్ధి చేసుకోడానికి, వీలవుతుందేకాని, తోడనే ఒకేసారిగా, Guindy institute తో మనకు సంబంధ లేకుండా చేసుకోవడం, మంచిదికాదేమోనని మా ఉద్దేశ్యం విశాఖపట్టణానికి చుట్టు ప్రక్కల నున్న Hospitals అన్నీ విశాఖపట్టణానికి Chemical Examination నిమిత్తం పంపించవచ్చును. ఇతర జిల్లాలకు సంబంధించిన వన్నీ Guindy institute లకు పంపించడానికి వీలవుతుంటుంది.

Sanitary Engineering కూడా మన కాలేజీలలో పెడితే బాగుంటుందని శ్రీ గోపాలకృష్ణయ్యగారు చెబుతున్నారు. ఈ Public Health Engineering కూడా ఒక Specialised Course అవుతున్నది. ఆ Course కూడా మనం పెట్టుకోవలసి యుంటుంది. కాకినాడలోనో, విశాఖపట్టణంలోనో, లేక అనంతపురంలోనో పెట్టుకోవలసి యుంటుంది. దానికి ద్రవ్యం కావాలి. University వారు సిలబస్ అంతా తయారుచేసుకోవలసి యుంటుంది. అది University వాళ్ళతో సంప్రతించి ఎంత తొందరలో ఈ Public Health Engineering పెట్టడానికి వీలవుతుందో అంత తొందరగా పెట్టుకోవలసి యుంటుంది. ఇంక ఈ Health Inspectors course ని గురించి కలకత్తా Central Institute లో ప్రతి సంవత్సరంకూడా మనకుకూడా కోటా ఉన్నది. Stipends ఇచ్చి మన విద్యార్థులను అక్కడకు పంపించడం జరుగుతోంది. అన్నీ మన రాష్ట్రంలో పెట్టుకోడానికి వీలులేకపోయినప్పుడు కొన్ని Central Institution కి మన వాళ్ళను stipends ఇచ్చి పంపించడం మంచిదేమోననికూడా ఉద్దేశ్యం. ఈ Sanitary Engineering విషయంలోకాని, తక్కినవికాని సావకాశంగా ఏమి చేయడానికి వీలవుతుందో అదంతా చేయడానికి ప్రయత్నం చేస్తాం.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—మనం ఆ course ఏర్పాటు చేసుకునేటంతవరకూ ఇప్పుడు Madras లో పాసై ready గా ఉన్నటువంటివాళ్ళకు మనం announcement ఇస్తేనేగాని వాళ్ళు qualify కారు. ఆ Sanitary Inspectors ని మనం తీసుకుంటాం అని చెప్పడానికి వాళ్ళ examination మనం recognise చేయ్యాలి. Madras Government recognise చేసింది కాని, Andhra Government ఇంకా recognise చెయ్యలేదు. Technical difficulty ఏదో వచ్చిందట.

THE HON. SRI B. GOPALA REDDI :—అటువంటి విద్యార్థులు మాకు ఆ విషయం తెలిపితే తప్పకుండా పరిశీలనచేస్తాం. ఇంతవరకూ మాకెవరూ చెప్పలేదు. ఏమండీ అక్కడ Sanitary Inspectors course

గ్రాడ్యుయేట్సు వాళ్లు అనేదో మీరు representation చేస్తే ఇక్కడ మనకు కావలసియున్నప్పుడు, అక్కడ పాసయిన వాళ్లున్నప్పుడు తీసుకోడానికి అభ్యంతరం ఏముంటుంది ? దానికేమీ అభ్యంతరం ఉండదు. అది ఎవరైనా మాకు వ్రాస్తే మేము చెయ్యడానికి వీలుంటుంది. ఇందుకు Rs 100/ token గా పెట్టారు. కొన్ని కొన్ని విషయాలలో మాకు saving వుంటే మళ్లీ additional expenditure లేకుండానే, ఉన్నటువంటి allotment లోనే మేము సంబాళించుకో వచ్చుననే ఉద్దేశ్యంతో ఈ Rs. 100/—token గా పెట్టినారు. దీనికి cut motion లేకపోవడం సంతోషం.

MR. SPEAKER : The question is :

"That a sum of Rs. 400 be granted under Demand No. XVI Medical.

The motion was carried and the grant was made.

## DEMAND No. XX—CO-OPERATION.

THE HON. SRI B. GOPALA REDDI : Mr. Speaker, Sir. on the recommendation of the Governor, I move.

That the Government be granted a further sum not exceeding Rs. 58,700 under Demand No. XX—Co-operation.

May I know whether Sri Padmanabha Raju is moving his cut motion ?

MR. SPEAKER : The cut motion regarding the corrupt act of adulteration of milk by the Kurnool Co-operative Milk Supply Society ?

SRI K. V. S. PADMANABHA RAJU :—No, Sir.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, ఈ supplementary grants లో intensive milk supply scheme కొరకే ఎక్కువ భాగాన్ని కేటాయించినట్లుగా కనబడుతోంది. కాని ఈ intensive milk supply scheme కూడా ఒక్క కర్నూలు, గుంటూరు పట్టణాలకు మాత్రమే ప్రభుత్వం పెట్టింది. ఈనాడు ఆంధ్రదేశంలో ప్రధానమైన పట్టణాలు విజయవాడ, విశాఖ పట్టణం, ఈ రెండుపట్టణాలకూకూడా పాల అవసరం ఎక్కువగా వున్నది. ప్రత్యేకించి విశాఖపట్టణంలో పెద్ద hospital కాలేజీలు, ఇంకా military establishments అన్నీకూడా ఉన్నవి. వాటికికూడా milk supply చేయవలసిన అవసరం ఉన్నది. ఈనాడు ప్రభుత్వం పట్టణావాసుల ఆరోగ్యరక్షణకై తీసుకొంటున్న

3rd October 1955] [Sri V. Visweswara Rao

చర్యలు, ఈ milk supply scheme వదలిపెడితే, పూర్తికావు. అందువల్ల విజయవాడ, విశాఖపట్టణానికికూడా ఈ ప్రణాళిక విస్తరింప చెయ్యాలని కోరుతున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, పెట్టబోయే రెండు milk supply societies కు డబ్బుఇస్తామని ఇందులో ఉన్నది. అయితే ఇందునిమిత్తం నియమించే ఉద్యోగులసంఖ్య అనవసరంగా పెంచుతున్నారేమోననే అనుమానం యున్నది. ముఖ్యంగా ప్రతిసొసైటీకి ఒక co-operative Sub Registrar ను, ఒక senior Inspector of Co-operative Societies Dairy Chemist Assistant ఇందరిని వేయవలసిన అవసరం ఎంతవరకూ ఉన్నదో ఆలోచించమని ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను.

THE HON. Sri B. GOPALA REDDI :—Is it at government cost ?

SRI PILLALAMARRI VENKATESWARLU :—అవును. గవర్నమెంటువారి ఖర్చుమీదనే.

THE HON. Sri B. GOPALA REDDI :—అధ్యక్షా, రెండుచోట్ల intensive scheme అమలులోపెట్ట తలచుకొన్నపుడు కొదకు towns కు యిది అవసరంలేదని ఉద్దేశంకాదు. ఈ intensive scheme, ముందు కర్నూలు, High Court ఉన్నటువంటి గుంటూరులో ప్రారంభించి తర్వాత క్రమేణా యితర పట్టణాలకు తీసుకొని పోవలెనని మా ఉద్దేశం. ఇతరచోట్లకూడ, బెజవాడలోకాని విశాఖపట్టణంలో కాని కొన్ని milk supply societies ఇప్పటికే ఉన్నాయి. వాటిని ఇంకా విస్తరణ చేయడానికోసం చేసిన ప్రయత్నం యిది, అందువల్ల పెద్ద పెట్టున ప్రయత్నం చేసినపుడే దానికి సరియైనఫలితం వస్తుంది. అటువంటిదానికి కావలసినటువంటి staff వేయకుండా అది సమగ్రంగా ఉండదు. చేసినపని పూర్ణంగా చేయడం మంచిదికాని, అది అసంపూర్ణంగాచేసి వాండ్లకు ఏదో చేశామని కండ్లనీళ్లు తుడవడం న్యాయంకాదు. అందువల్ల దీనిని Registrar of Co-operative Societies పరిశీలించేసి, ఇంత staff కావలెనని వారు చెప్పారు కొబట్టి చేసిందేగాని ఈ సిబ్బంది నియమించినది. మనదగ్గర ధనం ఎక్కువగ ఉండికాదు ఇది వాండ్లు కావలెనని కోరినందువల్ల press చేసినదానివల్ల, ఇబ్బందేగాని గాని మరొకటికాదు. ఇది ఇతరత్రా, నెమ్మదిగా ఇతర towns కు, విజయవాడ, విశాఖపట్టణం వగైరా పట్నాలకుకూడ విస్తరణ చేసుకోవచ్చును. ఇది కొంత ధన

Sri B. Gopala Reddi] [3rd October 1955

ముతో కూడ సంబంధించింది. Subsidy ఇవ్వవలసి యున్నది. Loans కూడ ఇవ్వవలసియున్నది. ఇది కొంతధనం ఖర్చుఅయ్యేవిషయం కాబట్టి ఇది ఎక్కువ towns కు వ్యాప్తిచేయలేకుండా ఉన్నాము. క్రమేణ తప్పకుండా చేస్తాం.

MR. SPEAKER : The question is :—

"That the Government be granted a further sum not exceeding Rs. 58,700 under Demand No. XX—Co-operation."

The motion was carried and the grant was made.

## DEMAND No. XXI – INDUSTRIES.

THE HON SRI B. GOPALA REDDI : Mr. Speaker. Sir, on the recommendation of the Governor, I :—

"Move that the Government be granted a further sum not exceeding Rs. 100 under Demand No. XXI—Industries."

MR SPEAKER : Motion moved. 'That the Government be granted a further sum not exceeding Rs. 100 under Demand No. XXI—Industries.

SRI VAVILALA GOPALAKRISHNA : Sir, I move :—

"That the allotment of Rs. 100 for Industries be reduced by Re. 1 to elicit the fuller details of the 18 schemes sanctioned by the Government."

SRI K. V. S. PADMANABHA RAJU : Sir. I move "To reduce the allotment of Rs. 100 for Industries by Rs. 10 To discuss the policy of the Government in respect of Small Scale Industries as a means to solve unemployment problem."

Mr. Speaker :—The main motion and the cut motions are now before the House for discussion.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, మన రాష్ట్రములో పరిశ్రమలు చాల వెనుకబడి ఉందని వేరే చెప్పవలసిన పనిలేదు. రెండు కోట్ల జనాభాలో ఒకలక్షమాత్రం పరిశ్రమలలో, organised industry లలో ఉన్నారని అనుకొంటున్నాము. ఈ సందర్భంలో 18 పరిశ్రమలను ప్రారంభించ డానికి ప్రభుత్వం ఉద్దేశించింది అని చెప్పారు. ఆ 18 పరిశ్రమలు ఏవి, ఏ విధంగా నడపవలెనని అనుకొంటున్నారో, ఎక్కడెక్కడ నడుపుతారో తెలిసిఉంటే చాలా

ఉపయోగం అవుతుంది కనుక అది ఏమన్నా చెప్పవలసిందని కోరుతున్నాను. తరువాత అసలు ఈ పరిశ్రమలలో unemployment ను solve చేసేందుకు ప్రాతిపదికగ ఉపయోగపడగలవాటినికూడ మనం ఆలోచించవలసిన అవసరం ఉంది. Ford Foundation Company వాండ్లు అమెరికానుంచివచ్చి ఒక కమిటీ వేశారు. వాండ్లు దేశవ్యాప్తముగా తిరిగారు. Small scale industries ఏవేవి, బాగా ఉంటాయో ఒక నివేదికను తయారుచేశారు. అది బహుశ ప్రభుత్వందగ్గర ఉంది అనుకొంటాను. దానికి సంబంధించిన కేంద్రం మధురను ఏర్పాటుచేశామని ఇదివరకు చెప్పారు. కాని మధురను ఏర్పాటుచేసిన తర్వాత మన పరిశ్రమలు ఏవి తీసుకొన్నారు అనేది ఏమి ఇంతవరకు రాలేదు. కనుక వాండ్లుచెప్పిన scheme Central Government కు అనుసరించింది. వాండ్లుకూడ ఖచ్చితంగా చెప్పింది ఏమైనంతవరకు Co-operative basis మీద కావలసినచోట్లల్లా చిన్న చిన్న పరిశ్రమలుపెట్టి నిర్వహించవలెనని చెప్పారు. మనదేశములో మూడు ప్రధాన సమస్యలు వస్తున్నాయి. ఒకటి పెద్ద పరిశ్రమలు, రెండు small scale industries చిన్న పరిశ్రమలు. మూడు గృహపరిశ్రమలు. మనం ఈవేళ ఉన్నటువంటి పరిస్థితులలో గృహపరిశ్రమలు ప్రారంభిస్తే బాగావుంటుందని మంత్రులు అక్కడక్కడ ఉపన్యాసాలు ఇస్తున్నారు. దానికి ఎవరు వ్యతిరేకులము కాము. కాని మధ్యతరగతి పరిశ్రమలుకూడ మనం నిర్వహించే స్థితిలో లేకపోతే పరిశ్రమలలో చాలా వెనుకబడి ఉండడం జరుగుతుంది. పెద్ద పరిశ్రమలు ఒకటికూడా ఇంతవరకు కేంద్రంగాని ఇచ్చినట్లు తెలియడం లేదు. మొన్న వెళ్లివచ్చారు. దాంట్లో 16 కోట్ల రూపాయలు, మొదటవేసినదానికి మళ్ళీ తీరా తీసేటప్పటి కల్లా, 10 కోట్ల రు. లకు తగ్గించబడ్డది. పరిశ్రమలకు సంబంధించింది మనం న్యాయంగా ఆలోచిస్తే మనరాష్ట్రం వెనుకబడి ఉంది గనుక పరిశ్రమలకు ఎక్కువ భాగముకూడ ఇవ్వవలసినటువంటి అవసరం ఉంది. మన రాష్ట్రంలో ఎక్కువమంది పెట్టుబడి పెట్టేవాండ్లు లేరు. కనుక సాధ్యం కాద నేటటువంటి అభిప్రాయం ఒకటివుంది. అయితే కేంద్రం ఎరువుల ఫాక్టరీ ఒకటి పెట్టాలనిచెప్పి అనుకొన్నది. ఎరువుల ఫాక్టరీ పెట్టేకేంద్రం ఇక్కడ నేపెట్టితే బాగా ఉంటుంది. తరువాత మంత్రి క్రిష్ణప్పగారు (నా జ్ఞాపకం) ఒకసారి బెజవాడలో మాట్లాడుతూ ఇక్కడ ఎక్కువమంది ఎరువు వాడుతారు గనుక, భారతదేశం మొత్తంలోకి, (K. C. Reddi గారు చెప్పారట) ఆంధ్రరాష్ట్రంలోనే ఎక్కువగ ఎరువులు వాడి వ్యవసాయ ఉత్పత్తిచేస్తున్నారు గనుక ఆప్రదేశంలోనే ఒక ఫాక్టరీ ఉండడం బాగా ఉంటుందనేఅభిప్రాయంతోటి వారుసూచనచెప్పారు. వారు Industries Minister కూడాను. అందువల్ల ఈ బాధ్యత వహించేటట్లయితే చాల ఉపయోగపడేది. అందువల్ల కేంద్రప్రభుత్వంమీద ఎంతవరకు ఒత్తిడిచేశారో, ఆ ఒత్తిడి ఎట్లా చేశారో, అది

Sri Vavilala Gopalakrishnayya] [3rd October 1955

ఇపుడు చెప్పరనుకోండి. కాని దానియొక్క ఫలితాన్నిబట్టే ఉంటుంది. మనము పండినపంట తినేదానినిబట్టి ఉంటుందనే పద్ధతిలో వారుచేసిన ఒత్తిడియొక్క ఫలితం మనము సాధించివుంటే అది వచ్చిందని అనుకునేవాళ్లం. అందువల్ల ప్రభుత్వాన్ని మీరు కావలసినంత ఒత్తిడి చేయలేదని, ఒత్తిడి చేసివుంటే అదిచాలకపోతే మేమంతా కూడాను, మాచేతనైన ప్రయత్నం చేయమంటే, ఒత్తిడిచేయడానికి సంసిద్ధంగా ఉన్నామని, అట్లాంటి అభిప్రాయం కావలెనన్నప్పటికిన్ని, శాసనసభా మొత్తం కూడా ఏకగ్రీవంగా అంగీకరించడానికి సంసిద్ధంగా వున్నామని, అందరు అవిధంగా ఒక పరిశ్రమనన్ని తీసుకొని రావలసినది. అదిరాలేదు. చిన్న పరిశ్రమలు 18 ప్రారంభిస్తామని చెప్పారు. నిజంగా ఆలోచిస్తేచిన్నపరిశ్రమలు నయమే. ఆరులక్షలనుంచి ఒకలక్షవరకు అయ్యేటటువంటి పరిశ్రమలు అన్నికూడా చిన్నపరిశ్రమలక్రింద మనం అనువర్తిస్తున్నాము. ఈ చిన్న పరిశ్రమలు ఏ ఏ ప్రాంతములలో పెట్టారు? పెట్టదలచుకొన్నారు? ఏ ఏ పద్ధతిగా ఉంటుంది? అనేదికూడ కొంత వరకు తెలిస్తే అక్కడ పరిశ్రమలు ఎట్లాఉంటాయో, ఊహించుకోడానికి అవకాశం ఉంటుంది. ఇపుడు పరిశ్రమలు పెట్టడానికి ఎవరు వ్యతిరేకులు అనికాదు, కాని అభిప్రాయం తెలుసుకొనుట చాల అవసరం. కనుక మనంవోటు ఇచ్చేటప్పుడుకూడ ఇది మన రాష్ట్రం చేయబోతున్నది మనలను ఎవరైనా అడుగుతారు. ఏమయ్యా మీరు మొన్న 18 Schemes కి ఓటుచేసి వచ్చినారటనే ఆ 18 ఏమిటంటే ఏమిలేదు మూటకట్టారు, 18 అనే అంకెను, ఆ అంకెను అది ఉన్నదట అని చెప్పవలసి వస్తుంది. 18 Schemeలు చదివి వినిపించేటట్లయితే చాల సంతోషం. రెండోది గ్రామపరిశ్రలది ఉంది. గ్రామపరిశ్రమల Rebate ఇపుడు ఖద్దరుఉంది. ఖద్దరుమీద ఏమిచేస్తున్నారంటే ఎక్కువగుడ్డ కొనేటప్పుడువెళ్లితే ఒక చిక్కువస్తుంది. ఒకగుడ్డ 1-3-0 అంటారు. అసలు ఇంకొక దుకాణానికిపోతే ఆ గుడ్డ రు పాయే దానిమీద మూడు అణాలు Rebate ఇచ్చానన్నాడు. కొన్నప్పుడు ఇచ్చింది ఏమన్నా రు పాయకు రావలసినగుడ్డే వస్తున్నది. కాని 1-3-0 అనడం, కేంద్రనుంచి మూడుఅణాలు తీయటం, అదేమన్నా ఖర్చుపెట్టడం. ఈ పద్ధతికన్న అసలు అందరం కొనే పద్ధతులలో చౌకగా వచ్చేటట్లు చేయాలనిచెప్పేసి నా కోరిక. అయితే ఇంకొకటి చెప్పుతారు. పరిశ్రమచేసే ఉత్పత్తిదార్లు ఎవరైతేఉన్నారో వారికి ఎక్కువడబ్బు ఇస్తున్నాము. ఇదివరకు కొన్నిమార్లుచెప్పితే discrimination అవుతుంది ఇట్లా చేసేటట్లయితే విచక్షణ చూపినట్లు అవుతుంది ప్రమాదం అవుతుందేమో అందువల్లచేయం, బీదవాండ్లకు ఒకటి, ధనవంతులకు ఒకరేటు వేసేపద్ధతి చూడండిఅంటే ఇక్కడమాత్రం ఖద్దరుకు ఏమైనా discrimination కలదా, తక్కినవాటికి indiscrimination కావటంలేదా, కనుక ఆ పద్ధతి-

దీనికి అనువర్తించదా ? అందువల్ల నేను మనవిచేసేది గ్రామపరిశ్రమలలో తక్కిన వాటినికూడా చాల ఉత్సాహంగా ముందుకుతీసుకొని పొయ్యేటట్లు చేయకపోతే మనంచేసే ప్రయత్నం ఈ ప్లానింగులో, Industrial section కో చాలవెనుక బడినవాండ్లు అవుతామని అందులో ఆ rcheme లు ఏవో చెప్పమని కోరు తున్నాను. గ్రామపరిశ్రమలకు ముఖ్యంగా కేంద్రాన్నిమాత్రం తప్పకుండా రెండు పెద్దపరిశ్రమలు ఏవైనా ఇచ్చేవరకు ఆంధ్ర శాసనసభ్యులుగాని, ప్రభుత్వంకాని, ఆంధ్ర ప్రజానీకంగాని నిద్రపోకుండా ఆందోళనచేసి సాధించవలసిఉన అవసరం ఉందని, అందుకు ప్రభుత్వం దాయకత్వం వహించవలెననికూడ కోరుతూఉన్నాను.

1-30 p. m.

Sri N. C. SESHADRI :—అధ్యక్షా, ఈ డిమాండును నేను బలపరస్తూ కొన్నివిషయాలు మాట్లాడదలచుకొన్నాను. ఈ Demandలో 18 చిన్న పరిశ్రమలకు ఏదో అవకాశం కల్పించారని చెప్పారు. ఇంతకుముందు గోపాలక్రిష్ణయ్యగారు మాట్లాడుతూ, ఆ పరిశ్రమకు లేవో తెలియదనిచెప్పారు. అయితే నాకు తెలిసి నంతవరకు, ఇప్పుడు రాజమండ్రిలో ఒకరాతిగొట్టాలు తయారుచేసేటటువంటి Factory నెలకొల్పేందుకు సంకల్పించారనిన్ని, ద్రోణాచలంవద్ద పింగాణి వస్తువులు తయారుచేయడానికి అక్కడ ఒక Factory కి కొంత aid ఇవ్వదలచుకొన్నారని పత్రికలవల్ల తెలియవచ్చింది. ఈ సందర్భంలో రాజమండ్రిలో తయారయ్యే రాతి గొట్టముల factory విషయము గురించి కొంత చెప్పవలసియున్నది. ఇక్కడనే నంద్యాలకు సమీపములో మహానందిదగ్గరఉండే Prema forests లో pipes కు కావలసిన సామాగ్రిఉన్నది. ఆర్థికంగాను. పారిశ్రామికంగాను వెనుకబడిన రాయల సీమలోనే, ఆ factory ని స్థాపించినట్లైయితే, ఇక్కడ కొంత పారిశ్రామిక అభివృద్ధి జరుగుతుందని నేను ఆశిస్తున్నాను. అటుతరువాత బేతంచెర్లలో, Prapathi Firebricks and Potteries అని ఒక private enterprise ఉన్నది. ఈ private enterprise ఇక్కడ పెట్టుకొని మరల దానికి 20 మైళ్లదూరములోనే, ద్రోణాచలంలో ఇంకొక పింగాణి Industry ని ప్రభుత్వంవారే స్థాపించినట్లైయితే ఈ Private industry కొంతవరకు suffer అవుతుందని నేను భావిస్తున్నాను. ఇప్పుడు గిద్దలూరుదగ్గర Glass factoty కి కావలసిన సామానులు దొరుకు తున్నాయి, కాబట్టి ఒక Glass factory మనదేశానికి ఎంతో అవసరంగా ఉన్నది. కనుక బేతంచెర్లదగ్గరనే ఒక Rival factory ని పెట్టేదానికంటే, ఒక Glass factory ని మనం గిద్దలూరులో పెట్టినట్లయితే మనకు చాలా అనుకూలంగా ఉంటుందని నేను భావిస్తున్నాను.

SRI Vavilala Gopalakrishnayya] [3rd October 1955

తరువాత ముఖ్యంగా కుటీరపరిశ్రమలలో అతి ప్రధానమైనటువంటి చేనేత పరిశ్రమగురించి కొంత చెప్పవలసియున్నది. చేనేతపరిశ్రమలో ఒక గొప్ప కేంద్రమైనటువంటి రాయదుర్గమును ప్రభుత్వము దృష్టిలో ఉంచుకోవలసియున్నది. రాయదుర్గములో ఇప్పుడు మూడువేల మగ్గాలు ఉన్నాయి. అయితే ఈ Co-operative fold లోకి ఏ 70, 80 మగ్గాలుతప్ప, మిగిలినవి అట్లాగే ఉండిపోయినాయి. అక్కడ ఒక అద్దకం పరిశ్రమగాని లేక ఒక చేనేతలో కొత్తరకమైన మగ్గాలు, కొత్తరకమైన designs విటిలో training ఇచ్చేటటువంటి ఒక స్కూలు లేకపోవడమే రాయలసీమలో ఎక్కడకూడ అటువంటి ఒక training school ఉన్నట్లు కన్పించదు. కాబట్టి ప్రభుత్వంవారు, ప్రభుత్వ అధ్వర్యాన్నే రాయదుర్గంలో అద్దకం పరిశ్రమను, తరువాత చేనేతలో కొత్త కొత్త designs, కొత్త కొత్త రకాల మగ్గములు వాడుకొనేందుకు అనుకూలంగా ఒకస్కూలు స్థాపిస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, ఈ small scale industries ఏవిటో తెలుకోనవలసిన అవసరమున్నదనుకోండి. అయినా ప్రపంచములో అన్ని దేశాలుకూడ మధ్యతరగతి పరిశ్రమలలోను, పెద్ద పెద్ద పరిశ్రమలతోను ఒక వైపు అభివృద్ధి చెందుతూ ఉంటే, మనము ఈ small scale industries ను పట్టుకొని వేలాడడమేనా అనే అనుమానం వస్తూఉంటుంది. ఇవి తప్పనిసరిగా అవసరమైనంతవరకు పెట్టుకోవచ్చు. కాని Asia లో ఎక్కడా లేనటువంటి బ్రహ్మాండమైన Coach Factory మద్రాసులో నెలకొల్పారు. అందుకు వాళ్ళతోటి మనంకూడ సంతోషిస్తాము. కాని మన ఆంధ్ర దేశము విషయం వచ్చేటప్పటికి, అలాంటిది కాకపోయినా, దాంట్లో సగము వుండే దాన్నిగురించి అయినా ఒక మాటకూడ ఎత్తకుండా ఉన్నారు మన కేంద్ర ప్రభుత్వ మంత్రులు రాష్ట్ర ప్రభుత్వ మంత్రులు. రాష్ట్రమంతులకు లోపల ఉద్దేశమున్నప్పటికిని వారేమి చేయగలరు, పాపము, మనలాగనే కూర్చోవాలి. ఈవిషయంలో ఒక ఊసకూడ ఎత్తకుండా ఉండడం అనేది చాలా బాధకరమైనటువంటి విషయము. ఎవరిదేశము వారికి ఎంత ముఖ్యమో, ఆదేవిధంగా, దేశంలో ఉండేటటువంటి రాష్ట్రాల విషయంలోకూడ, ఎవరి రాష్ట్రం వారికి ముఖ్యమని మనమందరము దృష్టిలో పెట్టుకోవాలని తెలియజేస్తున్నాను. ఎరువుల విషయంలో, మిగిలిన అన్ని రాష్ట్రాల కంటె ఆంధ్ర రాష్ట్రం ఎక్కువ ఎరువులు ఉపయోగిస్తున్నదని అందరకు తెలుసు. అటువంటి ఈ ఎరువును ఎక్కడో మద్రాసులో తయారుచేసి అక్కడనుంచి తెప్పించుకొనుటలో రైలు ఖర్చులన్నీ మన రైతుల నెత్తిమీద రుద్దుటకంటె, ఒక ఎరువుల factory ని ఏ బెజవాడలోనో పెట్టి తయారుచేస్తే చాలా భాగుంటుందని అభి

ప్రాయాలు ఉన్నాయి. అయితే దీనివిషయంలో కేంద్ర ప్రభుత్వ మంత్రులు ఒక్కరూ కూడ ఇదివరకు ఏమీ మాట్లాడకుండా ఎందుకు ఉన్నారో తెలియదు. మద్రాసులో కావలసివస్తే ఇద్దరు, ముగ్గురు మంత్రులు వరుసగా మాట్లాడుతారు గాని మన విషయం మాట్లాడేటటువంటి నాథుడు అక్కడ లేకుండా ఉన్నాడు అని బోధపడుతున్నది. నాకు తెలిసినంతవరకు విజయవాడలో పెట్టడానికి అక్కడ రైల్వేలైన్లు లేవనే కారణం చెప్పినట్లు తెలుస్తున్నది. అక్కడ ఒక రైళ్ల bottle neck ఏర్పడుతుందట. దేశంలో ఉండేటటువంటి రాకపోకలన్నీ స్తంభించిపోతాయట. అందువల్ల ఈ ప్రమాదం ఏర్పడకుండా, ఉండేందుకు, ఈ ఎరువుల factory ని అక్కడ నుండి తీసి మద్రాసులో ఏ నెవేలి దగ్గరనో పెట్టితే బాగుంటుందనే ఉద్దేశంతో, కేంద్రములో బాధ్యతగల స్థానంలో ఉన్నటువంటి బ్రహ్మాండమైన మంత్రులకు ఉన్నట్లు తెలిసింది. పరిస్థితులు ఈవిధంగా ఉండగ, మనం ఎంత సేపటికి ఈ small scale industries ను పట్టుకొంటున్నాము. ప్రజలకు తలాకొక తకిలీ ఇస్తామని, లేకపోతే Glass factory ఒకటి ఎక్కడో పెట్టుకొంటామని ఈవిధంగా తృప్తిపడడమంటే, నేను మాత్రం సంతోషించలేకుండ ఉన్నాను. ఎందువల్లనంటే, మనందేశంలో ఒట్టల మిల్లులు చాలా తక్కువ. చెప్పుకోదగినటువంటి పరిశ్రమ ఏదీలేదు. ఎట్లో ఒకటి, రెండు సిమెంటు factories పెట్టేశారు గాని, లేకపోయినట్లయితే అంతమట్టుకు కూడ ఉండేదికాదు. అందువల్ల ఈనాడు మనదేశంలో పరిశ్రమలు అభివృద్ధి చేయడానికి మనము ఏమీ చేయాలి ? Local గా పెట్టుకోడానికి మనకు డబ్బులేదు. డబ్బు లేకుండా మనం అనేక అవస్థలు పడుతున్నాము. అలాంటప్పుడు, ఏవిధముగానైనా డబ్బును పోగుచేసి ఇక్కడ పరిశ్రమలను పెట్టుకొనేటటువంటి స్థితిలో లేము. ఈ సందర్భంలో ఇంకొకటికూడ చెప్పారు. వడ్లకు మరలుకూడ తీసివేసి దంపుడు బియ్యమును cottage industries తయారు చేయాలన్నారు. ఇతరచోట్లంతా బ్రహ్మాండమైన పరిశ్రమలు సూచిస్తూంటే, మనకు దంపుడు బియ్యము పరిశ్రమ లాంటివా ? మద్రాసులోను, ఇతర రాష్ట్రాలలోను, పెద్ద పెద్ద Coach building factory లాంటివి పెడుతున్నారు. అంటె ఇతరులకు ఉన్నదని గోల పెట్టడం కాదు. మనకు లేదని మాత్రం గోలపెట్టడం సహజమే. ఇది ప్రతివానికి ఉండవలసిన అవసరమున్నదని చెప్పుచున్నాను. కనుక మన ఆంధ్రులకోరిక ప్రకారం ఇక్కడ ఫలానా పెద్ద పెద్ద industries మనకు కావాలని మన శాసన సభలో తీర్మానం చేయవలసిన అవసరమున్నదని మంత్రివర్గం దృష్టికి తీసుకువస్తున్నాను. Fertilizers Factory విషయంలో మాత్రం ఏదో కుంభకోణం జరుగుతున్నదనే అనుమానం ఉన్నది. దాన్ని తేలికగా వదలిపెడితే లాభంలేదు. అందుకు

Sri Pillalamarri Venkateswarlu] [3rd October 1955

కూడి ఎంతో ఆందోళన చేయవలసిన అవసరమున్నది. ఇప్పుడు ఇది దీంట్లో mention చేయకపోయినా, చేయవలసి యుంటుంది. మనం మళ్ళీ దీనివిూద ఆందోళన చేయకపోతే, ఇది మద్రాసుకు పోయేటటువంటి ప్రమాదం లేకపోలేదు. దీన్నిగురించి నేను మద్రాసుకు పోయినప్పుడు, అక్కడ పెద్దలు చెప్పారు. దీన్ని విజయవాడ దగ్గర పెట్టడానికి అక్కడ Railway bottle neck ఉన్నదని, కనుక దీన్ని అక్కడ పెట్టి దేశములోని డబ్బంతా బెజవాడలో పెట్టడంకంటే, దీనిని తీసుకుపోయి మద్రాసులోనే పెట్టితే సరిపోతుంది అనే లక్ష్యంలో ఉన్నారని తెలిసింది. మేము బయట తిరుగుతూ ఉంటాము గనుక మాకీ విషయాలన్నీ తెలుస్తూ ఉంటాయి. మంత్రి వర్గానికి అటువంటి అవకాశంలేదు. అందువల్ల ఇవన్నీ మంత్రి వర్గం దృష్టికి తీసుకురావలసిన అవసరమెంతైనా ఉన్నది. కనుక అవసరమైతే మన శాసన సభ అరగంటో, ముక్కాలు గంటో దీనికొరకు కూర్చొని ఒక resolution కూడ pass చేసి ఆంధ్ర దేశంలో ఈ పరిశ్రమలు పెట్టాలని ఆంధ్రదేశం కోరుతున్నారని కేంద్ర ప్రభుత్వానికి పంపుదాము. ఈవిషయంలో మనం చాలా ఆందోళన చేయవలసిన అవసరమున్నదని మంత్రివర్గం దృష్టికి తీసుకొనివస్తూ విరమిస్తున్నాను.

Sri SHAIK MOULA SAHIB :—అధ్యక్షా, ఈ డిమాండును నేను బలపరుస్తున్నాను. కాని ఈ విషయంలో మంత్రివర్గంవారికి చిన్న సలహా ఇవ్వదల చాను. ఇప్పుడు మన ఆంధ్రదేశంలో పెట్టబోయే 18 పరిశ్రమలూ చిన్నపరిశ్రమలే. అవి పింగాణీగాజులు పరిశ్రమ మొదలైనటువంటివి. లోహములకు సంబంధించినటు వంటి పరిశ్రమలు కేవలం నామమాత్రముగా ఉన్నవని భావించవలసి యుంటుంది. ముఖ్యంగా ఇనుము, ఉక్కు aluminium ఇంకా పరదేశములనుంచి వచ్చేటటువంటి ప్రతిలోహానికి సంబంధించిన పరిశ్రమలను నెలకొల్పడంలో ప్రభుత్వం ఏమంత శ్రద్ధ వహించడంలేదని చెప్పకతప్పదు. జర్మనీనైనా చూచి మనం నేర్చుకోవాలి. గత యుద్ధం తరువాత నిలువడానికి నీడకూడ లేకుండా సర్వనాశనం అయినటువంటి జర్మనీ ఈనాడు తలఎత్తి ప్రపంచములోని అగ్రరాజ్యాలతో సవాలు చేస్తున్నది. అంటే పరి శ్రమల ద్వారా ఎంతో అభివృద్ధిపరచుకొని, తమ వస్తుసామగ్రిని ఇతర దేశములకు ఎగుమతిచేస్తూ తమ ఆర్థికాభివృద్ధిని చక్కపరచుకొని తమ దేశములోని నిరుద్యో గాన్ని నిర్మూలించుకొని పైకివచ్చినదని చెప్పవలసియున్నది. కాబట్టి అటువంటి విదేశ వస్తువులను ఇప్పటికైనా మనదేశానికి దిగుమతికాకుండా, మనదేశములో నిరుద్యో గాన్ని నిర్మూలనకీ బీదప్రజానీకానికి పనులు కల్పించడానికిన్నీ, దారిద్ర్యాన్ని తొలగించ డానికిని మనంకూడ పరిశ్రమలను అభివృద్ధి పరచుకోవలసి యున్నది. ఈ

విధంగా పరిశ్రమల ద్వారానే మన నిరుద్యోగసమస్య పరిష్కరించడానికి వీలవుతుంది గాని కేవలం మాటలతోను, ఉపన్యాసాలతోను, ఇది పోజాలదు. కాబట్టి మన దేశంలో దొరికే సరుకుతో మనకు కావలసిన ముఖ్యమైన పరిశ్రమలు నెలకొల్పవలసిన అవసరమున్నది. ఇప్పుడు మనకు ప్రతియింటిలోకూడ పాత్రసామాను అవసరము. కాబట్టి ఈ aluminium ఇతర దేశములకు ఎగుమతిచేయకుండా, మనదేశములో ఈ పాత్రసామాను ఎంతఅవసరమో, అంత మనమే తయారుచేసుకోడానికి Aluminium Factory ఒకటి మనం నిర్మించుకోవలసిన అవసరమున్నది. తరువాత ఈ రాగి పాత్రలుకూడ ముఖ్యంగా బిందెలు గంగాళాలు ప్రతి ఇంట వాడుతూ ఉంటాము. కనుక అటువంటి Factory కూడ ఒకటి నిర్మించాలి. ఈ రెండింటికి సంబంధించిన ఖనిజములు నెల్లూరుజిల్లా ఉదయగిరి తాలూకాలో వున్నవి. వాటిని ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చకపోవడ మనేదిచూస్తే, అది ఆ తాలూకావారి దురదృష్ట మని చెప్పాలి. జర్మనీదేశము యిటీవల అగ్రరాజ్యములతో పోటీ చేస్తున్నది అంటే, అది ఎట్లా పోటీచేయ గలగుతున్నదో అనే విషయము ప్రభుత్వము గుర్తించాలి. ఆ విషయము దృష్టిలోపెట్టుకొని మన భారతదేశములోగూడ ఖనిజములు వున్నది గనుక మన రాష్ట్రమునకు సంబంధించినంతవరకయినా చిన్నచిన్న industriesను ఏర్పాటు చేసి వాటిని అభివృద్ధిపరచటానికి ప్రభుత్వము ఎందుకు కృషిచేయకూడదు ? రాష్ట్రములో ఎక్కడైతే వున్నవో, అవన్నిగూడ పరిశోధన చేయించి, industries ద్వారా రాష్ట్రము అభివృద్ధి అయ్యేటట్లు చూడవలసిందిగా మంత్రివర్గాన్ని కోరుతూ విరమిస్తున్నాను.

**MR. SPEAKER: The House will now adjourn for lunch and reassemble at 2-30 p.m.**

(AFTER LUNCH)

Sri M. SATYANARAYANA RAJU :—అధ్యక్షా మహాశయా, Industries Demand మీద తేబడిన cut motion ను బలపరుస్తూ సప్లిమెంటరీ బడ్జటునుగురించి మాట్లాడవలసిన అవసరమువున్నది. కాబట్టి మాట్లాడుతున్నాను. జనరల్ బడ్జటు ఆమోదించబడినెల పదిహేనురోజులు అయింది. అందులో ప్రతి item కూడా పరిశీలించి, చర్చచేసి, ప్యాసుచేశాము. మరల నెల పది హేను రోజులు దాటకముందే సప్లిమెంటరీ డిమాండును ప్రభుత్వము ప్రవేశపెట్టుతున్న దంటే ఇది ఏమీ అర్థము కావటములేదు. ఇందులో కొన్ని items కు నిర్దిష్టముగా రెండులక్షల యాభై ఎనిమిదివేలని, ఏడులక్షలని యీ విధంగా తెచ్చారు. కొన్ని అయిటములకు token grant అని, నూరేసిరూపాయలు చొప్పున చూపించారు. బడ్జటు శాంక్షను చేశామని అంటే, అది 1-4-55 తేదీనుంచి 31-3-56 తేదివరకూ

వర్తిస్తుంది. ఇప్పటికప్పుడే ఆరుమాసములు జరిగినవి. ఇంకను ఆరుమాసములు జరగవలసివున్నది కాబట్టి యిది నిర్దిష్టముగాయీ అయిటముకు, యింతింత ఖర్చు అని బడ్జటు తయారుచేసి, దీన్ని ఆమోదించండి అని అంటే, యీ డబ్బు రాబోయే ఆరుమాసములవరకూ సరిపోతుందనా ? లేకపోతే మరల నెల నెలకు ఈ మాదిరిగా సప్లిమెంటరి డిమాండ్లు తెచ్చి ప్యాసుచేయించుకోవలసి వుంటుందనా ? ఆ సంగతి ఏమిటో, ఈ బడ్జటు విషయములో డబ్బు ఏ విధంగా ఖర్చు చేయబడు తున్నదిన్ని ప్రభుత్వము చెప్పవలసివున్నది. యీ బడ్జటు ప్యాసుచేసేటప్పుడు మరి కొన్నికొన్ని అయిటములలో token grant అని కోరుతున్నారు. ఈ గ్రాంట్లను ఒట్టిచూస్తే, ప్రభుత్వము వీలయినన్ని అయిటమ్సుకు వీలు అయినంతసొమ్ము శాంక్షను చేయించిపెట్టుకొని, ఖర్చు ఎక్కువ అయినా, తక్కువ అయినా సరిపెట్టుకోటానికి ప్రభుత్వము కొంతసొమ్ము చేతిలోపెట్టుకోటానికి provision ఏర్పాటుచేసుకోటానికి ఈ డిమాండ్లు తెచ్చినట్లు కనబడుతున్నది. అంతేకాని ప్రతి అయిటముకును ఎట్టి మేట్లు సరిగా వేసుకొని ఏదో ఒక నిర్దిష్టముగా planned programme పెట్టుకొని ఇదుగో ! గత ఆరుమాసాలకు యింత ఖర్చు అయింది. యికె రాబోయే ఆరుమాసాలకు యింత ఖర్చు అవుతుందని ఒక నిర్దిష్టమైన ప్రణాళిక ఏమీ కనబడదు. సప్లిమెంటరీ డిమాండు పెట్టినప్పుడు యింతమటుకు శాంక్షను అయినదానికి యించు మించుగా ఖర్చు చేసి, ఇదిగో ఇంతమటుకు ఖర్చు అయింది. ఇంకా ఈ అయిటములకు యింత కావలసి వుంటుంది. ఇంత సొమ్ము శాంక్షను చేయమని అడిగితే, అప్పుడు అది శాంక్షను చేయడము సబబుగా వుంటుందని నేను భావిస్తున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI :—Excess Demand.

SRI M. SATYANARAYANA RAJU:—అవును, Excess Demand. బడ్జటు శాంక్షనుకోట్లకొద్ది చేశాము. అది శాంక్షను అయి సరిగా నెల పదిహేనురోజులు కాలేదు. ఇంతలోపుగానే మరల శాంక్షను చేయమని సప్లిమెంటరి బడ్జటు తెచ్చారు. ఇంత స్వల్ప వ్యవధిలోనే యింతసొమ్ము కావలసివచ్చిందా ? Supposing Education ను గురించి రెండులక్షలు కావలసి వచ్చిందనుకోండి. అలాగే Co-operation కు 58 వేలు ఈ సొమ్ముఅంతా మొదట బడ్జటు శాంక్షను చేసినప్పుడు మరల ఒక నెల పదిహేను రోజులలో సప్లిమెంటరి డిమాండు తెస్తే, యింతలోపల ఈ సొమ్ము అంతా ఖర్చుచేసినట్లేనా అని అడుగుతున్నాను. ఇప్పుడు ఈ 58 వేలు శాంక్షనుచేస్తే, ఈ సొమ్మురాబోయె ఆరుమాసాలకు సరిపోతుందా లేకపోతే, మరల రాబోయె session కల్లా యీ సొమ్ముకూడా అయిపోతుందా ? ఈ సంగతి తేల్చిచెప్పాలని అంటున్నాను.

3rd October 1955] [Sri M. Sathyanarayana Raju

ఏమైనప్పటికినీ, Industries విషయములో సభ్యులు చాలా మంది మాట్లాడారు. అందులో Large scale industries, Medium industries, Small scale industries అని మూడు రకాల industries ను గురించి మాట్లాడారు. Industries ను గురించి మాట్లాడేటప్పుడు విజయవాడలో ఎరువుల ఫాక్టరి పెట్టుతామని మంత్రిగారు సెలవిచ్చారు. అక్కడ ప్రజలందరు ఎరువుల ఫాక్టరీ వస్తుందని ఆశించుకొని వున్నారు. కాని యీ వుదయము మిత్రుడు వెంకటేశ్వర్లు గారు చెప్పినదాన్నిబట్టిచూస్తే, బెజవాడలో పెట్టినట్లయితే bottle neck అయిపోతుంది, అది Madras లో పెట్టినట్టయితే బాగావుంటుందని కేంద్ర ప్రభుత్వమువారు అభిప్రాయపడుతున్నట్లుగా చెప్పారు. ఏ వుద్దేశ్యముతో వారు ఆవిధంగా అంటున్నారో తెలియలేదు. Artifical manure, Ammonium Sulphate, యిటువంటి ఎరువులు ఎక్కువగా ఉపయోగించే ప్రదేశాలు ఎక్కువగా నీటివసతులు పారుదలవున్నచోట్లు, అవి మన ఆంధ్రదేశములో వున్నదని అందరకు తెలిసిన విషయమే. ఇటువంటి ప్రదేశములు కోస్తా జిల్లాలో అంతటికి బెజవాడ సెంటరుగా వున్నది గనుక అక్కడ పెట్టితే ప్రజలకెంతో వుపయోగముగ నుండును, నీటివసతులు ఎక్కువగా వుండేది తమిళనాడుకంటె మన రాష్ట్రములోనే ఎక్కువగా వున్నవి. మన రాష్ట్రములోనే యింకను కోట్లకొలది డబ్బు వ్యయముచేసి నీటి వసతులకోసము ప్రాజెక్టులు నిర్మించుకోబోతున్నాము. వ్యవసాయము యింకా ఎక్కువ వృద్ధికాబోతున్నది. మాగాణిప్రాంతము ఎక్కువకాబోతున్నది. తమిళనాడు కంటే ఆంధ్రరాష్ట్రములోనే ఎక్కువ భూమి సాగుకాబోతున్నది. గనుక కేంద్రము వారు మద్రాసులో పెట్టాలని ఏ ఉద్దేశ్యముతో నిశ్చయించమన్నారో అర్థము కావడము లేదు. ఇటువంటి సందర్భములో బెజవాడలో ఎరువుల ఫాక్టరీ నిర్మించినట్లయితే bottle neck అయిపోతుందని ఆంధ్రను మినహాయించడము సబబు గాలేదు. కేంద్రమువారు ఈ విధంగా ఆలోచించడము చాలా ఆశ్చర్యకరముగా వుంది. బెజవాడ రైల్వేకూడాలి అని, రవాణా సౌకర్యాలకు చాలా అనువైనచోటు అని అందరికి తెలిసినదే. బెజవాడలో చోటులేకపోతే ఆంధ్రదేశములో యింకా యెక్కడనైనను పెట్టించ వచ్చును. ఆంధ్రరాష్ట్రము యింత పెద్ద వ్యవసాయ రాష్ట్రము ఎన్నో నీటి వసతులు వున్నవి. ప్రాజెక్టులు నిర్మించ బోతున్నారు. ఇటువంటి ప్రదేశానికి మధ్యన వుంటేనే గదా! ఎరువుల ఫాక్టరీలో తయారయ్యే సరుకు ఖర్చు కావటానికి వీలు వుంటుంది గదా! ఆంధ్ర రాష్ట్రములో ఎన్నో నదులుకూడా వున్నవి. సారవంతమైన ప్రదేశము. Heavy chemicals కు నీటి వసతులు అవసరము. నీటి వసతులు వున్నచోటనే ఈ ఎరువులు ఎక్కువగా వాడబడుతాయి. ఈ విషయాలు అన్ని కేంద్రమువారు పునరాలోచిస్తారని

ఆశిస్తున్నాను. బెజవాడలో కాకపోయినా బెజవాడకు సమీపప్రాంతములో నైన పెట్టవచ్చు. బెజవాడ ఆంధ్రదేశమునకు మధ్యగావున్నది కాబట్టి ఎరువులకురవాణా ఖర్చులుకూడా తగ్గిపోతాయి. మద్రాసు నుంచి ఎరువులు తెచ్చుకోవాలంటే, ఖర్చులు ఎక్కువ, ఎరువులు ఎక్కువ ఖరీదుపెట్టి కొనవలసివస్తే, ప్రజలు కొనటానికి అయినా రైతులు వారియొక్క ఆర్థికపరిస్థితి చూచుకోవలసి వుంటుంది. ఎరువుల ఫ్యాక్టరీ నిర్మించినప్పుడు, ఆ సరుకు అమ్ముడుపోటానికి గిట్టుబాటుధర కాకుండా పోతే, ప్రజలు కొనటానికి యిష్టపడరు. కాబట్టి యీ సందర్భాలన్నీ దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వమువారు కేంద్రప్రభుత్వముతో దెబ్బలాడిఅయినా, యీ ఎరువుల ఫ్యాక్టరీని మన ఆంధ్రరాష్ట్రములోనే నిర్మించేటట్లు ప్రయత్నించాలని మంత్రిగారిని కోరుతున్నాను.

తరువాత medium scale industries విషయములో మన రాష్ట్రము చాలా వెనుకబడి వున్నది. ఈ విషయము యిదివరకే మనవిచేశాము. దీన్నిగురించి మరల చెబుతున్నాను. మనస్టేటులో ప్రాజెక్టులకొరకు ప్రభుత్వము ఏవిధమైనశ్రద్ధ తీసుకొంటున్నారో, యీ State industries విషయములో కూడా అంతశ్రద్ధ ప్రభుత్వము తీసుకోవాలి. State లో economic equilibrium దృష్టిలో పెట్టుకొని industries ను develop చేయాలని అంటున్నాను. ప్రాజెక్టులు develop చేసేటప్పుడు, industries కూడా side by side గా వృద్ధిచేయాలి. ఇవిరెండు ఒకేస్థాయిలో develop అయితే, State తాలూకు economic equilibrium maintain చేసుకోటానికి అవకాశాలు ఏర్పడుతాయి. ప్రభుత్వమువారు యీ విషయాలు అన్నీకూడా దృష్టిలోపెట్టుకొని State యొక్క economic equilibrium కొరకు పాటుపడటానికి తగు policy ని adopt చేయటానికి ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

ఇదివరకు మేము చోడవరంలో ఒక షుగరు ఫ్యాక్టరీనికూడా ప్రపోజ్ చేశాము. అక్కడి ప్రజలు అంతాకూడా సహకరిస్తున్నారు. ఇప్పటికప్పుడే రమారమి 2 లక్షల రూపాయలు షేర్లువున్నవి. ఇంకా రెండునెలలో గౌరవనీయు లయినటువంటి ప్లానింగు మంత్రిగారు చెప్పినట్లు 3 లక్షలుపైగా షేర్లు రావడానికి అవకాశము ఉన్నది కాబట్టి తక్షణం అక్కడ ఒక ఫ్యాక్టరీని స్థాపించాలని కోరుతున్నాను. ఇదేవిధంగా చెఱకు ఎక్కువగా ఉత్పత్తి అవుతున్నచోట ముఖ్య మంత్రిగారు . . .

MR. SPEAKER :—చర్చ నియాంశము small scale industries గురించి.

SRI M. SATYANARAYANA RAJU :—బొబ్బిలి, శ్రీకాకుళం జిల్లాలలో సరిహద్దుగావున్న ప్రాంతాలలో చెఱకు ఉత్పత్తిగురించి ముఖ్యమంత్రిగారికి కొన్ని మెమోరాండములు అందచేశారు. కోమటిపల్లి ఫిర్కాలో చెఱకు నిలువయున్నది. ప్రజలు చాలా ఆందోళన చెందుతున్నారు. అక్కడకూడా ఒక షుగరు ఫ్యాక్టరీని కట్టవలసిన అవసరము వున్నది. దానికికూడా చోడవరంలోని ప్రజలు సహకరించినట్లుగానే ఇక్కడ వారుకూడా సహకరిస్తారు. అక్కడకూడా ఒక ఫ్యాక్టరీ స్థాపించాలని ప్రార్థిస్తున్నాను. నిరుద్యోగ సమస్య పోయేందుకు వీలుగా small scale industries ను ఎక్కువగా అభివృద్ధి చేయాలి. ఈ small scale industries ను అభివృద్ధి చేసేప్పుడు దానిని తరతరాలుగా చేయవలసి వుంటుంది. ఈ విలేజీ లెవల్ కో-ఆపరేటివు ఇండస్ట్రీలు అనిచెప్పి వాటిని అభివృద్ధి చేయవలసి ఉన్నది. దాంట్లో కొన్నికొన్ని నిబంధనలుకూడా వున్నాయి. చేనేత పరిశ్రమను తీసుకున్నప్పుడు 100 మగ్గాలు ఉంటేనేగాని ఎక్కడఅయినా ఒకచేనేత సొసైటీని పెట్టకూడదని ఒక నిబంధన వున్నది. ఇది 50, 60 మగ్గాలుఉన్న గ్రామప్రజలకు అందుబాటులో వుండదు. ఇటువంటప్పుడు ఇతరరకములైన చేతి పనులు (కుమ్మరి, కమ్మరి) వారు ఆంతాకలసి ఒక విలేజి ఇండస్ట్రీగా ఒక కో-ఆపరేటివు సొసైటీని స్థాపించుకున్నట్లయితే అక్కడఉన్న చేతిపనులుకూడా అభివృద్ధి అవుతాయి. ఈ అభివృద్ధిఅయిన వస్తువులు సేలుకొరకు తాలూకాల వారీగా ఒకొక్క తాలూకాకు ఒకొక్కటి చొప్పున సేల్సుసొసైటీలు పెడితే ఆవస్తువులు అమ్ముడుపోవడమే కూడా జరుగుతుంది. ఆ విధంగా ప్రతి విలేజిలోనూ వృత్తులు అభివృద్ధిఅయ్యే అవకాశము ఉన్నది. ఈ విధంగా కొంత నిరుద్యోగ సమస్యకూడా అభివృద్ధి అవుతుందని చెబుతున్నాను. 1920 వ సంవత్సరము ముందు యీ ఎలిమెంటరీ స్కూల్సు. . .

MR. SPEAKER :—మీరు co-operation గురించి మాట్లాడుతున్నారు. స్మాల్ స్కేల్ ఇండస్ట్రీని గురించి మాట్లాడాలి. దాని ఒక్కదానికే చర్చపరిమితం అయివున్నది.

SRI M. SATYANARAYANA RAJU :—Spiningకు weavingకు ఎట్లాగైతే small scale పెడుతున్నామో అట్లాగే agriculture కు కూడా ఒక basic education గా పెట్టినట్లయితే ఈ 8th standard ప్యాసు అవగానే ఈ వ్యవసాయ సంగతులు తెలిసివుంటాయి. అతను వెంటనే తిండివృత్తిలో ప్రవేశించడానికి వీలుంటుంది. అందువల్ల ఉద్యోగములకుకూడా వత్తిడి తగ్గుతుంది. ఆ విధంగా చేయాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, మంత్రిగారు ఈసప్లిమెంటరీ బడ్జెటును ప్రవేశపెడుతూ 18 స్కీములు అని చెప్పినారు. అవి ఏమిటో దాంట్లో ఎక్కడాకూడా తెలియపర్చలేదు. తెలియపరచివుంటే బాగుండేది. కాని ఈ నాడు దేశంలోవున్న నిరుద్యోగ సమస్యను పరిష్కరించాలంటె ప్రత్యేకించి గ్రామీణ ప్రజానీకానికి పనులు చూపించవలసిన అవసరము ఉన్నదనికూడా చెప్పటం జరుగుతోంది. ఈనాడు కుటీరపరిశ్రమలు అనేకమువున్నా, ఈనాడు మన దృష్టి నేతపరిశ్రమమీదకో, ఖద్దరు పరిశ్రమమీదకో పోతుంది. వాటికొఱకే మనం కొన్నిలక్షలు రూపాయిలు ఖర్చుచేయడం జరుగుతోంది. కాని దీనివల్ల సమస్య ఎంతవరకు పరిష్కారము అవుతుంది అనేది చూడడములేదు. చిన్నచిన్న ధాన్యపు మిల్లులుకూడా తీసివేసి దంపుడుపద్ధతి పెడుతాము, దానివల్ల కొందరిబీద ప్రజల నిరుద్యోగసమస్య తీరుతుందని మొన్న మంత్రిగారు చెప్పారు. ఈనాడు ప్రజానీకం అంతటికీ పనులు చూపించాలంటె చేతిపరిశ్రమలు అవసరము అని చెప్పి అందరూకూడా అంగీకరిస్తారు. ఇదికూడా ఏవిధంగా చేయాలో చూడాలి. చైనాదేశమునకు మొన్ననే మనదేశంనుంచి 14 గురు రాయబారం వెళ్లినారు. అక్కడ ఎక్కడచూచినప్పటికి చేతిపరిశ్రమలు ఎక్కువగా వుంటాయి. అక్కడ చేతిపరిశ్రమలన్నికూడా వుంటాయి. అక్కడ ప్రజానీకం అంటె అనేకవస్తువులు తమచేతితోనె తయారుచేసుకొంటారు. అక్కడ చేతిపరిశ్రమలన్నికూడా decentralise చేసి ఆరూపంలో పనిచేసి వాటి నన్నింటిని assemble రూపంలో తీసుకువచ్చి ఎక్కువమంది ప్రజానీకానికి పనులు చూపించడానికి అవకాశం వున్నది. మనంకూడా ఆవిధంగా తీసుకునిరావాలి. అట్లా చేసినప్పుడే ఎక్కువ ప్రజానీకానికి పనులుచూపించగలమనే ఆశకలుగుతుంది. ఈ ఒక్క చేనేతపరిశ్రమ మీదే మనం ఆధారపడివుంటే ఎక్కువమందికి పనులుచూపించలేము. ఈనాడు పరిశ్రమలు ఆనాటికానాటికి కుంటుపడేపరిస్థితిలో ఆ పరిశ్రమలను ప్రోత్సహించాల్సిన అవసరమువున్నది. ఈనాడు వాటికిసబ్సిడీలు, fund లు అధికరూపంలో అనేకలక్షలరూపాయిలు ఇవ్వడము జరుగుతోంది. ఆవిధంగా మనం ఆ సమస్యను పరిష్కరించలేము. అందువల్ల ఈ పరిశ్రమలన్నింటినీ decentralise చేసిఎక్కువ మందికి పనులు కల్పించేట్లు చేయవలసిన అవసరమువున్నది. ఈనాడు మన కృష్ణా జిల్లాలో చిన్నపరిశ్రమలు అనేవి కొన్నివున్నాయి. కొండపల్లిలో క్రోమైట్ ఫ్యాక్టరీఅనేది వుండేది. ఇదివరకు దానిని చిన్నకంపెనీవారు తీసుకొని కొంత కాలం పనిచేసి తరువాత మూసివేయుడము జరిగినది. అది పనిచేస్తూ వున్నప్పుడు సుమారు 500, 600 మంది అందులో పనిచేస్తూవుండేవారు. అది మూసివేయుటమువల్ల వారందరికు పనిపోయినవి. జగ్గయ్యపేట దగ్గర పెద్ద ఐరన్ఓర్ వున్న

వున్నదని అనుకొంటాను. దానికొఱకు ఒక పెద్ద పరిశ్రమ స్థాపించవచ్చును. అక్కడ 50 లక్షలటన్నులు దొరికితేనే పరిశ్రమను నెలకొల్పుతామన్నారు. అట్లాకాకుండా 20 లక్షలుతోటి ఒక చిన్నపరిశ్రమను స్థాపించితే బాగుంటుంది. జగ్గయ్యపేటలో లేకపోయినా ప్రక్క నైజాములోకూడా ఇది ఎక్కువగా దొరుకుతుంది కాబట్టి అక్కడైనా ఒక ఫ్యాక్టరీ పెడితే బాగుంటుంది. ఇంకా కర్నూలుజిల్లాలోనూ గుంటూరుజిల్లాలోనూకూడా ఈ ఐరన్ ఓర్ దొరుకుతుంది. కర్నూలుజిల్లా వెల్దుర్తిదగ్గరనుంచి చాలా ఇనుము export అవుతుందనికూడా మనకు తెలుసును. 6, 7 నెలల్లో 5 లక్షలటన్నులు ఎగుమతి అయింది. అందువల్ల దానికొఱకు ఒక పరిశ్రమ పెట్టాలని, అట్లా పెట్టినట్లయితే ఎక్కువమందికి వుద్యోగం చూపించే అవకాశం వుంటుందని నేను చెబుతున్నాను.

ఈ విధంగా పరిశ్రమలు పెంపొందింపచేయాలి. లేకపోతే ఆంధ్రరాష్ట్రం వ్యవసాయక దేశంగానే ఉండిపోతుంది. మన ప్రజానీకానికి ఇతర మార్గాలు లేనపుడు దేశం వ్యవసాయకదేశంగానే వుండిపోతుంది. 180 రోజులుమాత్రమే పనివుండి మిగతారోజులు పనిలేకుండా యిక్కడిప్రజలు పస్తులువుండవలసి వస్తుంది. అందుచేత పారిశ్రామికంగా ఆంధ్రదేశాన్ని అభివృద్ధిచేయాలని మనవిచేస్తున్నాను. ఇంక ఎరువుల ఫాక్టరీవిషయం. విజయవాడలో పెడితే bottle neck అవుతుందని చెబుతున్నారు. ఆంధ్రదేశం స్థితిచూస్తే పరిస్థితులు చాలా దారుణంగావున్నాయని చెప్పడానికి విచారపడుతున్నాను. గతసంవత్సరం సుమారు లక్షటన్నులు అమోనియంసల్ఫేటు వాడితే, యీ సంవత్సరం 13 వేల టన్నులుమాత్రమేవచ్చింది. 80,000 టన్నులుపైగా రాలేదు. అనేకసారులు టెలిగ్రాములుయిచ్చి మాకు పంపించాలి అన్నా పంపలేదని తెలుస్తోంది. గతసంవత్సరం కృష్ణాజిల్లాలో 12000 టన్నులువాడితే యీ సంవత్సరం 5000 టన్నులుమాత్రమే యిచ్చారు. రు.35 లు ధరవున్నప్పటికీ 40, 45 రూపాయలవరకు అమ్ముతున్నారంటే de-control చేశామనేరోజులలోకూడా ఏవిధంగా బ్లాక్ మార్కెటు చేస్తున్నారో తెలుస్తుంది. 20 రోజులక్రితం సంగతినే నేను చెబుతున్నాను. మొత్తందేశంలో తయారయే ఎరువులలో ఆంధ్రదేశం 5 వ వంతు వుపయోగిస్తున్నది. ఎరువుల విషయంలో చాలా కొరతగా వున్నదని ప్రభుత్వానికి తెలుసు. ఆంధ్రదేశానికి కావలసిన ఎరువులనిమిత్తమై ఒక ఫాక్టరీకోసము గట్టిగా శాసనసభ అందరితరఫునా కృషిచేయవలసియున్నది. చిన్నపరిశ్రమలన్నింటినీ చేతిపరిశ్రమలరూపంలోనే కాకుండా చిన్నపరిశ్రమలన్నింటినీ decentralise చేసినప్పుడే ప్రజానీకానికి ఎక్కువపనులు దొరుకుతాయని ఆశిస్తున్నాను. ఆంధ్ర వాణిజ్యమంత్రిగారు ఇపాను

వెళ్లి సంపాదించిన అనుభవాలను యిక్కడ ప్రవేశపెట్టి ఎక్కువమంది ప్రజానీకానికి పనిచూపించాలని కోరుతూ ముగిస్తున్నాను.

SRI M. NAGI REDDI :—అధ్యక్షా ! అనేకమంది మిత్రులుచెప్పినట్లు తీసుకొనే 18 స్కీములు యేమిటో తెలయలేదు.

THE HON. SRI B. GOPALA REDDI :—అధ్యక్షా, సభ్యులందరూ 18 స్కీములు మాకు తెలియటంలేదు అంటున్నారు. ఒకసారి చదివితే ఆక్షేపణ ఉండదనుకుంటాను.

The following are the 18 schemes :—

1. Training scheme for manufacture of scientific glass apparatus at Gudur.

2. Scheme for shifting the Pottery Training Centre to the site of the Ceramic Service centre at Rajahmundry.

3. Training co-production centre for stoneware and earthenwar products at Vizianagaram.

4. Training-cum-production centre for stoneware and earthenware products at Anakapalli.

5. Training-eum-production unit for the manufacture of Crayons and Plaster Products at Rajahmundry.

6. Establishment of six production cum-training centres in Blacksmithy in Srikakulam, Eluru. Nellore, Guntur, Guntakal and Cuddapah.

7. Establishment of a Production-cum-riaining Centre for moulders at Vijayawada.

8. Establishment of six production-cum-training centres in Carpentary in Srikakulam, Nellore, Eluru, Guntur, Guntakal and Cuddapah.

9. Starting of a production-cum-training centre in ceramics at Dronachalam.

10. Tile production-cum-training centre at Pendurthi.

3rd October 1955] [Sri B. Gopala Reddi

11. Production cum-training centre for tanning and manufacture of Footwear at Eluru.

12. Model Leather Goods Manufacthring Unit at Vijayawada.

13. Establishment of a Saw Mill cum-Timber seasoning plant at Rajahmundry.

14. Establishment of production-cum-Training centre in Carpentry at Visakhapatnam.

15. Establishment of two general apparatus Engineering Workshops, one in Rayalaseema and one other in circars.

16. Establishment of a factory for the manufacture of Stoneware pipes at Rajahmundry.

17. Establishment of a production centre for the manufacture of Bolts, Nuts, and Rivets at Visakhapatnam.

18. Starting of a model tanning in Anantapur District.

SRI S. RANGANATHA MUDALIAR : May I know why Chittoor District has been completely eliminated?

THE HON. SRI B. GOPALA REDDI : Because it has got its own University.

SRI M. NAGI REDDI :—18 స్కీముల పేర్లు ఇచ్చారు. లోగడ అనేకసార్లు మంత్రివర్గదృష్టికి తీసుకు వచ్చాను. భారతదేశంలోనే కాకుండా యితర దేశాలలోకూడా ప్రఖ్యాతి వహించిన polished stones గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా రెంటచింతల గ్రామములో దొరుకుతున్నాయి. ఇవి కొన్ని ఎకరాలభూములలో ఉన్నాయి. విద్యుచ్ఛక్తి సదుపాయము లేకపోయినా చిన్నపరిశ్రమగా శేబులుమీద వేసుకొనేవిగా తయారు చేస్తున్నారు. వీటిని అనేకచోట్లకు పంపుచున్నారు. ఆంధ్రదేశంలో ఎక్కడా ఇలాంటిరాళ్లు దొరకడం లేదు. ఎక్కడా యిటువంటి పరిశ్రమలేదు. ఇతరదేశాలకు శాంపుల్సు పంపి ఎక్కువ స్కేలులో వ్యాపారాన్ని చేయాలంటే ఆర్డర్లు వచ్చినప్పటికీ ఆర్థికలోటువల్ల నవీన పద్ధతిలో తయారు చేయడానికి వీలుకాక పోవడంవల్ల యితర కారణాలవల్ల సాధ్యపడడంలేదు. దీనికి ప్రభుత్వం సహాయము చేయవలసి యున్నది. వెనుకబడిన పల్నాడు తాలూకావంటి ప్రాంతాలు అభివృద్ధిలోనికి రావాలంటే ప్రభుత్వమువారు

Sri M. Nagi Reddi] [3rd October 1955

18 స్కీములతోబాటు దీనినికూడా చేర్చవలసిన అవసరం, యీ చిన్న పరిశ్రమను అభివృద్ధి చేయవలసిన అవసరం ఉన్నదని మంత్రివర్గానికి మీద్వారా విజ్ఞప్తి చేస్తున్నాను. చిన్నపరిశ్రమల అభివృద్ధితోబాటు దేశంలో పెద్ద, మీడియంసైజు పరిశ్రమలు వృద్ధిచేయాలని ప్రభుత్వ పక్షమునుంచి ప్రతిపక్షంనుంచి మంత్రివర్గ దృష్టిలోనికి వస్తూనే యున్నది. ఆంధ్రదేశంలో సిమెంటుకొరత అయినందున నాగార్జున సాగరం నిర్మాణానికి కావలసిన సిమెంటుకై ఒక సిమెంటుఫ్యాక్టరీ అవసరం. నాగార్జునసాగర నిర్మాణానికి కేటాయించిన 122 కోట్లలో 2 కోట్ల రూపాయలుతీసి ఫ్యాక్టరీని కట్టవచ్చును. ఈ విధంగాచేస్తే లాభాలుకూడా ఎక్కువగా ఉంటాయని లెక్కలతో ఇదివరకే చూపించాం. ఆంధ్రరాష్ట్రంలో యిపుడు రెండు సిమెంటు ఫ్యాక్టరీ లున్నాయి. వీటికి రాయి పల్నాడు క్వారీలనుంచి వెళ్లాలి. ఇంత దూరంనుంచి రైల్వేచార్జీలుపెట్టి రాళ్ళను తీసుకొని వెళ్లుతున్నపటికి సంవత్సరానికి 10, 20 లక్షల రూపాయల లాభాలను సంపాయిస్తున్నారు. ఈ ఫ్యాక్టరీలు 1½ కోట్ల రూపాయల పెట్టుబడితో పనిచేస్తున్నాయి. నాగార్జున సాగరం దగ్గరలోనే సిమెంటురాయి దొరుకుతున్నది. సంవత్సరానికి 2 లక్షల టన్నులు consumption ఉంటే టన్నుకు 5 రూపాయలు రైలుఖర్చులు చూసుకున్నా, ఒక్క రైలుఖర్చుల క్రిందపోయే 10 లక్షల రూపాయలే ప్రభుత్వానికి మిగిలే అవకాశం ఉంటుంది. ఈ ఫ్యాక్టరీమీద పెట్టే పెట్టుబడి రెండు, మూడుకోట్ల రరూపాయలు. ఆదాయం రావడానికి ఫ్యాక్టరీ చివరకు ప్రభుత్వానికి ఉచితంగా మిగలడానికి అవకాశం ఉంటుంది. మంత్రివర్గంకూడా చెబుతున్నది. తాము వ్రాశామనికాని కేంద్రప్రభుత్వం వారు నాగార్జున సాగరమునకై కేటాయించిన ధనంనుంచి సిమెంటు ఫ్యాక్టరీకి వినియోగించటానికి అంగీకరించలేదని అన్నారు. సుందరయ్యగారు ప్లానింగు విషయమై మంత్రిగారిని ప్రశ్నించినపుడు ఈ విషయంకూడా తెలియజేస్తారనుకున్నాము. కాని ఏమి తెలియచెయ్యలేదు. దానిని గురించి ఏమి మాట్లాడినారు ? వ్యక్తిగత పెట్టుబడి దారులకు వీలు అక్కరలేదా అంటే అది వేరువిషయం. పరిశ్రమలు అభివృద్ధి కావలసిందే కాని కార్మికులకు తగినకూలి వచ్చేహక్కు కాపాడాలని కమ్యూనిస్టుపార్టీ వారలకు చెబుతున్నాము. ప్రాజెక్టు నిర్మాణానికి సిమెంటు అత్యవసరమైన పరిస్థితులలో, సిమెంటు కొరతగావున్న పరిస్థితులలో, ప్రభుత్వం తరఫున Ramakrishna & sons వారికి ఫ్యాక్టరీ కట్టుకోడానికి అవకాశం ఇచ్చినప్పటికి, మనం మరొక ఫ్యాక్టరీ కట్టుకోటానికికూడా అవకాశం వున్నది. దానిని గురించి ఏమిచేశారనేది ముఖ్యవిషయం. డబ్బులేదని మంత్రివర్గంవారు చెబుతూనే ఉన్నారు.

Cement tactory ల గురించి ఏమిచేసినారని అడిగితే మంత్రివర్గము డబ్బు లేదని చెప్పుతున్నారు. దీనిక్రింద వినియోగమయ్యేది ఒకసం॥లో ఖర్చుపెట్టితే

3rd October 1955] [Sri M. Nagi Reddi

ఏమికాదు. మనకు 10, 15 సం॥లలో factory మిగిలిపోయే అవకాశముందని నా నమ్మకముకూడా. దానిని తీసుకొనడానికి కేంద్రప్రభుత్వముమీద ఒత్తిడితీసుకు రావలసిన అవసరము. ఏవిధముగానైనా ప్రభుత్వమే రెండవ cement factory స్థాపించితే cement black-market లో పోయే అవకాశాలు వుండవు. దాని మీద control చేయడానికికూడ అవకాశముంటుంది. అలాంటి పరిస్థితిని కలుగ చేయాలని మంత్రివర్గము దృష్టికి తీసుకువస్తున్నాను. అదేవిధము పల్నాడు తాలూకా తుమ్మరగోడు ప్రాంతంలో ఇనుపరాయి దొరికే అవకాశముంది. ఈ విషయము నేను Planning Commission సమావేశములో Collector గారికి చెప్పడము జరిగింది. వాటిని అన్నిటిని మళ్లీ ప్రభుత్వము పరిశీలించవలెను. Polish రాళ్లుకూడా అక్కడ దొరుకుతవి. Krishna జిల్లా కొండపల్లిలో ఏ విధముగా బొమ్మలు చేస్తున్నారో అట్లానే దుర్గిలో రాతితో బొమ్మలుచేసే అవకాశాలు ఉన్నవి. అక్కడ శిల్పకారు లున్నారు. నాగార్జున సాగంము కట్టే సందర్భంలో శిల్పకారులు కావాలని Engineer లు చూస్తున్నారు. తుంగభద్రా ప్రాజెక్టువద్ద కైలాసము వైకుంఠము లాంటివికట్టారు. ఇక్కడకూడ అలాంటి buildings కట్టే పరిస్థితు లున్నవి. వాటికి కొన్ని designs కావలసి ఉంటుంది. ధర్మచక్రంలాంటివి కావాలి అంటు న్నారు. కళాభిలాషి కళాకారుడు కళాభిమాని అయిన మన గోపాలరెడ్డి గారు శిల్ప కళను అవృద్ధి చేయడానికి దోహదమిస్తున్నారని పల్నాటి తాలూకాలో polish రాళ్ళపరిశ్రమను బొమ్మల పరిశ్రమను అభివృద్ధిచేయుటకు కృషిచేయవలెనని కోరు తున్నారు. Cement factory నిర్మాణానికి ప్రభుత్వము తగినకృషి చేయవలెనని తిరిగి మరోసారి మంత్రివర్గానికి విజ్ఞప్తి చేస్తున్నాను.

Sri P. SATHYANARAYANA :—అధ్యక్షా ! పరిశ్రమల demand సమయంతో మరొకమారు చేనేత పారిశ్రామికలు సమస్యలు కొన్ని ప్రభుత్వ దృష్టికి తీసుకొని వస్తున్నాను. (1) సిల్కు పరిశ్రమ. (2) ప్రత్తి నూలుతో తయారయే చేనేత పరిశ్రమ. సిల్కుకు సంబంధించినంతవరకు ఆంధ్రరాష్ట్రంలో 1940 వర కున్నట్టి Rated Capacity అన్ని మగ్గాలు Procesing Mills వాటి పరిమితి కోటి రూపాయలవరకుంది. వాటిమీద ఇంచుమించుగ 2 లక్షలమంది depen- dents తో సహా ఆధారపడియున్నారు. ఇదంతా ముడి సిల్కు మనదేశంలో తగినంతగా లేనందువల్ల Tariff Board విధానములో మనకు అపకారముచేసే అంశములు ఉండడమువల్ల 10, 12 సం॥ లు బాగా దెబ్బతిన్నది. ఇప్పుడు Central Silk Board ఏర్పడింది. మదరాసు State లో ఈ పరిశ్రమ విస్తృ తంగా యున్నా అన్ని States తో సమానంగా ప్రాతినిధ్యము ఇచ్చేరు. ఆంధ్ర

Sri P. Satyanarayana] [3rd October 1955

రాష్ట్రము ఏర్పడిన తరువాత మనం ప్రాతినిధ్యము కావాలని కోరలేదు, ఇపుడు పరిగణించవలసినంత ఉత్పత్తి మన ఆంధ్రలో ఉంది గనుక Central Silk Board లో ప్రాతినిధ్యము సంపాదించవలెనని ప్రభుత్వాని కోరుతున్నాను. Tariff Board వారి విధానములో మనకు అపకారముగా ఉన్న అంశములను సవరించుకొనవలసి వుంటుంది ఇప్పటికీ పెద్దాపురం, హిందూపురం, పశ్చిమ గోదావరిలో పాలకోలు సామర్లకోటవద్ద వేట్లపాలెం ఇంకా నాలుగయిదుచోట్ల ఉన్న Silk Mills మూల బడినవి. 10 సం॥ల నుంచి అవి అలా ఉండడంవల్ల తుప్పు పట్టిపోయినవికూడా. అందుచేత కుటీరపరిశ్రమల పట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకొని రెండవ Plan కాలములో వాటిని పునరుద్ధరించుకొనవలెను. ఉన్న Rated Capacity ఉపయోగించుకొనకపోతే దాని ఆశయమే నెరవేర్చినవారము కాము.

(2) ప్రత్తి నూలుతో తయారులయ్యేటట్టి చేనేత పరిశ్రమ విషయంలో ఇప్పుడు ఒక కొత్త అధ్యాయము తీసుకొని రావలసివుంటుంది. ఇంతవరకు ఇది కేవలము కుటీర పరిశ్రమగానే ఉండిపోయింది. అందువల్లనే కొన్ని ప్రమాణములు లేకుండ పెద్ద పెద్ద Order లకు Supply చేయగల్గిన స్తోమతేలేకుండి, ప్రభుత్వ అవుసరము వచ్చేస్తాయి లేకుండా, విదేశాలకు ఎగుమతి చేసే తాహతు లేకుండా పోయింది. ఇప్పుడు అయిదు ఆరు సంవత్సరములనుంచి విదేశాలకు వ్యాపారనిపుణులను పంపి కృషి చేయడమువల్ల కొంచెము కొంచెము మార్కెట్టు ఏర్పడింది. ఇది దక్షిణ దేశానికి పరిమితమైఉంది. మైసూరు, మలబారు, ఆంధ్రరాష్ట్రానికి ఇప్పుడు పెద్ద పెద్ద order లు వస్తేరావచ్చు. అనేక కారణాలవల్ల, ఇతర దేశాలలో మార్కెట్టు ప్రబలము అవడమువల్ల దేశంలో factory విస్తృతాన్ని నిరోధించడంవల్ల మొత్తము Expending economy ప్రవేశపెట్టడమువల్ల మార్కెట్లు ఎక్కువయినది. కొత్త పునాదుల మీద పునర్నిర్మాణము చేసుకుంటే గాని consumers కు ప్రజలకు కూడా ఎక్కువ ఇబ్బంది కలుగవచ్చును. అందుచేత చేనేత పరిశ్రమ నిర్మాణంలోనే కొన్ని మార్పులు తీసుకొనిరావలెననే దృష్టితో పనిచేయవలసి ఉంటుంది. వీటిని Power loom లుగా మార్చే ప్రశ్న లేదు. చేతి మగ్గమునే ఖార్ఖానా system లోనికి తీసుకొనిరావలసి వుంటుంది. దీనివల్ల ఉత్పత్తిలో ప్రమాణము తీసుకురావచ్చును. పనిముట్లు విదేశాలకు ఎగుమతి చేయగల యోగ్యత ప్రభుత్వ అవసరాలు తీర్చే యోగ్యత కలుగవచ్చును.

ఇది చాలా విస్తృతమైన పరిశ్రమకనుక ఒక్కమారుగా కార్ఖానా system లోకి తీసుకూరావడం సాధ్యంకాదు. కోటానకోట్లురూపాయిలు కావాలి. వ్యవసాయంతరువాత ఇంత ఎక్కువమందిజనానికి వృత్తి కల్పించేటటువంటి పరిశ్రమ

3rd October 1955] [Sri P. Satyanarayana

మరొకటిలేదు కనుక ఆ system ఆంధ్రదేశం 11 జిల్లాలలోనూ సర్వే సర్వత్రా తీసుకురావాలంటే కొంచం time పడుతుంది. వచ్చే 5 సంవత్సరాలలోనూ కనీసం నాలుగోవంతో ఐదోవంతో ఆంధ్రదేశంలో యుండేటటువంటి మగ్గాలను standardization ఉన్నటువంటి బట్టను ఉత్పత్తిచేయగలిగినటువంటి కార్ఖానా system లోకి వీలైనంతవఱకూ co-operative system ద్వారా మిగతాది private capital ద్వారా తీసుకురావడానికి ప్రత్యేక కృషి చేయవలసియుంటుంది. దీనివల్ల నిజంగా కొంతవఱకు ఒకనూతన అధ్యాయం ప్రవేశింపజేసినట్లే ఉంటుంది. ఇది చాలా అవసరం. Silk భాగానికి సంబంధించే ప్రభుత్వం కొంతవఱకూ పట్టించుకోవాలి. Central Silk Board లో మన Director of Industries కు కూడా స్థానం వుండేటట్లుగా కృషిచేయవలసియుంటుంది. Rated capacity అంతపని జరిగేటట్లుగా, ఇవన్నీ అమలులోకి వచ్చేటట్లుగా కృషిచేయవలసియుంటుంది. ప్రత్తి, నూలుబట్టల విషయంలో కార్ఖానా system లోకి తీసుకురావడానికి ప్రత్యేక కృషి చేయవలసియుంటుంది. ఈ విషయాలు ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను.

SRI S. NARAYANAPPA :—అధ్యక్షా, ఇప్పుడు ఈ శాసనసభ ఎదుట ఉన్నటువంటి ఈచిన్నచేతి పరిశ్రమలు, లేక కుటీరపరిశ్రమలను గురించి మంత్రివర్గం తెచ్చినటువంటి suplemantary demand ను నేను బలపరుస్తూ, కొన్ని ముఖ్యమైనటువంటి సూచనలు ఈ చిన్నపరిశ్రమలనుగురించి ప్రభుత్వానికి చేయదలచుకున్నాను. దేశంలో పరిశ్రమలు అభివృద్ధిచెందితేకాని, ఆర్థికంగా ప్రజానీకంపొందవలసినటువంటిలాభంకాని, శ్రేయస్సుకాని పొందడానికి వీలులేదు. అందువల్లనే Planning Commission వారు, పరిశ్రమలకు మూడుభాగాలుగా విభజించారు. భారీపరిశ్రమలు, మధ్యరకం పరిశ్రమ చిన్నపరిశ్రమలూ ఈనాడు మన ఎదుట వున్నటువంటిసమస్య చిన్నపరిశ్రమలనుగురించి ఈ చిన్నపరిశ్రమలతో కుమ్మరి, వడ్రంగి, కట్టెపరిశ్రమ, ఇనుము పరిశ్రమ, కంసాలి, ఇటువంటి చిన్నపెట్టుబడిపై వస్తువులను ఉత్పత్తిచేసి ప్రజానీకానికి అందించి, వస్తు అభివృద్ధిచేయడమే కాకుండా, ఆర్థికంగా దేశాన్ని అభివృద్ధిచేసి, నిరుద్యోగసమస్య నిర్మూలం చేసేటటువంటి ప్రయత్నం జరుగుతోంది. ఇప్పుడు కొంతమంది ప్రతిపక్షసభ్యులు, చేనేతపరిశ్రమనుగురించి చెప్పారు. ఈనాడు ప్రభుత్వం చేనేతపరిశ్రమకు, మిల్లుపోటీనుంచి రక్షించడానికి చాలా ప్రయత్నాలుచేస్తున్నారు. Cess fund అనేటటువంటి ఒక నిధిని ప్రత్యేకించి కేంద్రప్రభుత్వంవారు రాష్ట్రప్రభుత్వాలకు ఇచ్చి ఆ పరిశ్రమ ఉద్ధరణకోసం ఎన్నోప్రయత్నాలు చేస్తున్నారు. ఆ ప్రయత్నాలను మేము అభినందిస్తున్నాం. ఈ

Sri S. Narayanappa] [3rd October 1955

నాకు చేనేమగ్గాలపై పనిచేసేటటువంటి లక్షలాది ప్రజలు తమకు గ్యారంటీ ఐనటువంటి పని లభ్యమవుతుంది. మాకు భోజనానికి లోటులేదు, సంసారాలు జరుగుతాయనేటటువంటి విశ్వాసం లేకుండా ఒకవిధమైన నిరుత్సాహంతో ఈ పరిశ్రమపై ఆధారపడి వున్నారు. ఎందుకంటే నూలుధరలు చాలా హెచ్చుగా ఉన్నాయి. మిల్లులలో తయారైనటువంటి నూలుమగ్గాలకు సప్లయిచేస్తున్నారు. ఈనూలుధరలు తగ్గించాలని కేంద్రప్రభుత్వానికి రాష్ట్రప్రభుత్వాలకు ఇన్నిసంవత్సరాలుగా మొఱపెట్టుకున్నప్పటికీ ఏమీ లాభంలేకుండా పోతోంది. బొంబాయిలో Ambar Charka ఒకటి తయారుచేసి, కొద్ది ఖరీదుకు దాన్ని ఏర్పాటుచేస్తున్నారు. ఈ Ambar Charka లను తీసుకుని సొసైటీద్వారా గాని, గ్రామాలలో ఉన్నటువంటి ఏదైనా సంఘంద్వారా గాని, వాటికి పెట్టుబడి పెట్టి ప్రత్తిని సప్లయిచేస్తే చౌకగా లభ్యమయ్యేనూలు తయారవుతుంది. ఇటువంటి ప్రయత్నం రాష్ట్రప్రభుత్వం వెంటనేచేస్తే లక్షలాదిమంది ఆధారపడినటువంటి ఈ చిన్నపరిశ్రమను అభివృద్ధిచెందడానికి వీలుపడుతుంది. కొన్నిరకములగుడ్డను సొసైటీలద్వారాతయారుచేయించి ప్రభుత్వమే నేరుగాకొని వానిని అమ్మించేప్రయత్నంచేస్తే ఈమిల్లుపోటీనుంచి చేనేతపరిశ్రమ రక్షింపబడుతుంది. అట్లా చెయ్యకుండా కేవలం rebate మాత్రం ఇచ్చి కొన్ని depot లు పెట్టించి ప్రచారంచేస్తే, ఈ పరిశ్రమ అనుకున్నంత అభివృద్ధిచెందదు. ఈ చేనేత పారిశ్రామికులకు సహకారిగా Ambar Charka ను పెట్టించి ఒక ప్రత్యేకమైన నిధిని ఏర్పాటుచేసి, సరాసరి Co-operative Central Bank ల నుంచి ఈ సంస్థలకు డబ్బు ఇచ్చేటటువంటి విధానం ఏర్పాటుచెయ్యాలి. ఈ Society లలో బకాయిపడినటువంటి చేనేత పారిశ్రామికులు ఎంతోమంది ఉన్నారు. ఈ cess నిధినుంచి వారికి అప్పులిచ్చి, తిరిగి వారికి పని కల్పించి వేతనాలరూపంగా వచ్చిన సొమ్ములోనుంచి ఆ బకాయిలను తీర్చుకొనేటటువంటి వీలు ప్రభుత్వం కలగజేస్తే చాలా ఉత్తమంగా ఉంటుంది. లేకపోతే ఈనాడు రాష్ట్రంలోయున్న సుమారు 650 society లలో ఏ పదో, ఇరవై సొసైటీలలో సక్రమంగా తమ reserves పైన, తమ finance పైన ఆధారపడి పనిచేస్తున్నాయి. తప్పక తతిమ్మావన్నీ హీనస్థితిలో ఉన్నాయి. ఇప్పుడు ప్రభుత్వం ఆర్థికసహాయం ఇవ్వకపోతే ఏదైనా scheme వేసి దాన్ని అమలుపఱచకపోతే, ఈ society లు చాలా నిస్సహాయస్థితిలో ఉండిపోతాయి. తరువాత పూసల పరిశ్రమ గాజుల పరిశ్రమలు ఉన్నవి. అనంతపురంజిల్లాలో పెనుగొండ తాలూకాలో గుట్టూరు అనే పల్లెగాజుల పరిశ్రమకు ప్రసిద్ధి. ఉరవకొండ Sub తాలూకాలో పందికుంట ఇటువంటి కొన్ని గ్రామాలలో గాజుల పరిశ్రమ విరివిగా జరుగుతూ ఉండేది. ప్రోత్సాహం లేక నిలిచిపోయింది. ఈ విషయమై ప్రభుత్వం శ్రద్ధతీసుకొని కొంత పెట్టుబడిపెట్టి ఆ పరిశ్రమను పునరుద్ధరిస్తే కొంతవఱకూ నిరుద్యోగ

సమస్య తీరుతుంది. గాజుల పరిశ్రమ అభివృద్ధి చెందుతుంది. పరిశ్రమలను ప్రభుత్వం ప్రోత్సహించినట్లు ఉంటుంది. ఇక silk పరిశ్రమవిషయం చూస్తే, విదేశాలనుంచి కోట్లకొలది వెలగలిగినటువంటి silk ను మనం import చేసుకుంటున్నాం. చేనేత మగ్గాలపైకూడా రకరకాల ఆకర్షణీయమైన తీగలు, పక్షులు, భాగవత పురుగులు రామాయణాది పురాణ ప్రసిద్ధములైన, చరిత్రాత్మకమైన బొమ్మలు వాటిమీదవేసి silk బట్టలు తయారుచేస్తున్నారు. All India Exhibition కు కూడా పంపించారు. ఇంగ్లండు ఎలిజబెత్ రాణీ కొరొనేషన్ కు బెంగుళూరునుంచికూడా నాణ్యమైన silk గుడ్డలు పంపించారు. చాలా పేరుపొందినాయి. Import duty నితగ్గిస్తే ఆ పరిశ్రమ ఎంతో అభివృద్ధిచెంది, వారు తయారుచేసినటువంటి గుడ్డ market లో సులభమైన ధరలకు విక్రయించడానికి అవకాశం ఉంటుంది. మన ప్రభుత్వం వెంటనే కేంద్ర ప్రభుత్వానికి వ్రాసి ఈ import duty ని తగ్గించేటట్లుచేస్తే ఈ పట్టు పరిశ్రమ అభివృద్ధి అవుతుంది. చేనేత పారిశ్రామికునికి నిర్ణీతమైన పద్ధతిపై colleeter ల ద్వారా అనండి, లేక తహశీల్దార్ల ద్వారా అధికార రీత్యా supply చెయ్యడానికి ఏర్పాట్లుచేస్తే ఈ పట్టుపరిశ్రమ మన రాష్ట్రంలో అభివృద్ధి చెందడానికి చాలా అవకాశా లున్నాయి. ధర్మవరం silk చీరెలకు ప్రసిద్ధి. ఆ చుట్టుప్రక్కల ప్రాంతాలలో నాణ్యమైన చీరలు తయారుచేస్తారు. Guntakal లో నూలుమిల్లు ఒకటి Co-operative పద్ధతిపై స్థాపనచేసి ప్రభుత్వంవారు దానికి ఎంతో సహాయం చేశారు. ఈ మిల్లునూలుకు, private యజమానుల మిల్లులలో తయారయ్యే నూలుకూ ధరలలో ఏ విధమైన వ్యత్యాసం లేదు. Co-operative Mill లో తయారయ్యే నూలు తక్కువధరలకు లభ్యమయ్యేదానికి ఏదైనా పథకం ఆలోచించి ఆ నూలు తగ్గింపురేట్లకు ఇస్తే Co-operative పద్ధతిపై ప్రజానీకానికి విశ్వాసం కలిగి, ఈ చేనేత గుడ్డలమ తక్కువ ధరకు అమ్ముటకు వీలవుతుంది.

ఈ పద్ధతిని ప్రభుతంవారు యోచనచేసి ఏఏ పద్ధతితో అయితే ఈ co-operative పద్ధతులపైన మనము తయారుచేసేటటువంటి నూలుగాని, వస్తువులుగాని చౌక ధరలకు లభ్యం అయ్యే పద్ధతిలో తీసుకొనివస్తే వారి చేతితో అమ్ముడుపోతుంది. మనకు పరిశ్రమ అభివృద్ధి చెందుతుంది. ఆర్థికంగా బాగుపడుతాము. నిరుద్యోగం తొలగుతుంది. ఇటువంటి పరిశ్రమల అన్నింటిని ప్రభుత్వంవారు ఈ అదనంగా కేంద్ర ప్రభుత్వంనుంచి 18 scheme లు మంజూరు పొందినటువంటి scheme ల పైకి ఇటువంటి చేనేత పరిశ్రమకు, పట్టు పరిశ్రమకు, తరువాత ఈ గాజు పరిశ్రమకు పింగాణి పరిశ్రమకు, paints కూడ తయారుచేసేదానికి అవకాశాలున్నాయి. గుంతకల్లులో దాదాపు, 3,4 సంవత్సరముల క్రింద కేంద్రప్రభుత్వంవారు ఒక paints

Sri S. Narayanappa] [3rh October 1955

factory పెట్టవలెనని తలంపు చేశారు. అయితే అక్కడ చుట్టుముట్టు గ్రామాల నుంచి మంచి నాణ్యమైనటువంటి పెద్ద పెద్ద గుట్టలున్నాయి. గుట్టలలో నుంచి రంగుమన్ను ముద్ద ముద్దలుగా తీసుకొని వచ్చేదానికి ఎంతో అవకాశాలు ఉన్నాయి. అక్కడనుంచి మన్నుకూడా ఇతర ప్రాంతాలకు సప్లయి చేశారు. దాదాపు నాలుగు సంవత్సరముల క్రిందట ఇటువంటి వస్తువులకు. ఆరంగు మన్నులను ఉపయోగించుకొని paints factory ని ఒకటి పెట్టించేదానికి ప్రయత్నం చేస్తే చాల ఉపయోగంగా ఉంటుంది. ఈ అవకాశం మీరు నాకు ఇచ్చినందుకు నేను వందనములు అర్పిస్తున్నాను. రాష్ట్రప్రభుత్వం వెంటనే ఇటువంటి పరిశ్రమలకు దోహదము ఇచ్చే ఒక విధమైన ప్రోత్సాహాన్ని, small scale industries కి కలుగజేసి జీవనోపాధి ఇచ్చేటటువంటి ప్రయత్నం చేస్తారని ఆశిస్తూ ఇపుడు ఇచ్చిన supplemental demandను నేను బలపరుస్తూ ఉన్నాను.

SRI B. VENKATASIVAYYA :—అధ్యక్షా, Supplementary demands విషయంలో పరిశ్రమలకు సంబంధించినంతవరకు తోటి సభ్యులు ప్రభుత్వం అనుసరిస్తున్న పాలిసీని గురించి ఏమేమో విమర్శలు చేశారు. దాని విషయంలో నిర్మొగమాటముగాను, సగర్వంగాను మాట్లాడుకోవలెనని అనుకొన్నట్లయితే ఇపుడు ప్రభుత్వపాలిసీ సక్రమంగానే ఉంది అని చెప్పుకోవాలి. మన ప్రభుత్వం ఇప్పుడు 5 కోట్ల రూపాయలు బడ్జటు లోటుతోను, 5 కోట్ల రూపాయలు ప్రజలవద్ద అప్పు తీసుకొని, మరి ఇది కాకుండా కేంద్ర ప్రభుత్వానికి ఎన్నో అప్పులు బకాయిపడి ఉన్నారు. ఈ అప్పులకు సంవత్సరానికి కొన్ని లక్షల రూపాయలుకూడా చెల్లించుకొనవలసిన పరిస్థితులలో మన ప్రభుత్వం ఉండిపోయింది. కాని మనము కనుచూపు మేరలో ఈ అప్పులను తీర్చుకొనే స్థితిలోగాని, మరి ఈ వడ్డీలనైనా కనీసం తగ్గించుకొని ఆదాయం తెప్పించుకొనే స్థితిలోగాని మన ప్రభుత్వం ఉన్నట్లు కానరావడం లేదు. కొత్త పన్నులు వేయబోయే సందర్భంలోగాని ఆదాయాన్ని పెంపొందించుకునే సందర్భంలో గాని అనేక చిక్కులు ప్రభుత్వానికి, వస్తున్నాయనే సంగతి అందరికీ తెలిసిన విషయమే. ప్రభుత్వంవారికి, ప్రతి పక్షంవారికిగూడ తెలిసిన విషయమే. అట్లాంటి పరిస్థితులలో ప్రభుత్వం ఉన్న సమయంలో మరికొత్తగా అప్పులు తీసుకొని వచ్చి ప్రభుత్వమే కొన్ని పరిశ్రమలను స్థాపించాలి. ప్రవేటు వ్యక్తులకు ఏ మాత్రం అవకాశం ఇవ్వకూడదు అని చెప్పి కొందరు సభ్యులు సూచించడం, సుగుణమైనదో మరి లేకుంటే కేవలం విమర్శల కొరకు చేస్తున్నదో నాకు అర్థం కాకుండా ఉన్నది. మన ప్రభుత్వం మాచర్ల దగ్గర Cement Factory స్థాపించాలని చెప్పి కొందరు సభ్యులు సూచించారు. ఇది రెండు కోట్లతో కూడుకొన్న విషయం. అలాంటి పెద్ద పెద్ద పరిశ్రమలనుగాని, చిన్న పరిశ్రమలనుగాని, ప్రభుత్వానికి

మన దేశాన్ని అభివృద్ధి చేయాలని, పరిశ్రమలను స్థాపించాలి అని చెప్పే ఉద్దేశంతోటి మరికొంత మంది పెట్టుబడిదార్లు ముందుకు వస్తున్న సందర్భంలో వారిని ప్రోత్సహిస్తున్నది. కాని ఏలాటి పరిస్థితులలో ప్రభుత్వమే ముందుకు వచ్చి పరిశ్రమలను స్థాపించుకోవాలి అని ఆలోచించుకొన్నట్లయితే, ప్రవేటు వ్యాపారస్థులు ఎవరు కూడ ముందుకు రాకుండా దేశానికి అత్యవసరమైన పరిశ్రమలను స్థాపించడానికి ప్రభుత్వం ముందుకు వచ్చేపాలసీగా ఉన్నవేకాని ప్రతి చిన్న పరిశ్రమకు కూడ co-operative పద్ధతి మీద ప్రవేటు పెట్టుబడిదార్లకు license ఇచ్చేసి వేయాలనే పద్ధతిలో ఆలోచన చేయాలనే సూచన చెయడం అంత సమర్థనీయం కాదేమో అని చెప్పి అనుకొంటున్నాను. ప్రవేటు పెట్టుబడి దార్లను ప్రోత్సహించడం అంత క్షేమకరమైనదికాదు. ప్రభుత్వం తీసుకోవాలి అనే సూచనలో పరికొన్ని నిర్దిష్టమైనటువంటి కంట్రోల్సును మన ప్రభుత్వం చెసుకోవడం మంచిదని చెప్పి సూచనలు చేస్తున్నాము. ప్రవేటు పెట్టుబడిని ప్రోతహించడం మంచిదే కాని కార్మికులయొక్కయు, వినియోగదార్లయొక్క క్షేమము దృష్ట్యా, ప్రవేటు వ్యాపారస్తులు స్థాపించే పరిశ్రమలలో కొన్ని కొన్ని controls ను ప్రభుత్వం అట్టి పెట్టుకొని, వినియోగదార్లకు, కార్మికులకు క్షేమము కలిగే లాగున వారిపైన అజమాయిషీ సంపాదించుకొంటే మాత్రము అది సరిపోతుంది. ప్రభుత్వంవారికై వారుగా దేశంలో పెట్టుబడిదార్లు ముందుకు రాకుండా ఉన్నటువంటి పరిశ్రమలు కొన్ని ఉన్నాయి. అలాంటి సందర్భాలలో necotine extraction పొగాకు పరిశ్రమకు సంబంధించినంతవరకు, ఊరిక waste గా పాడైపోతున్నటువంటి పొగాకు చాల ఉండిపోతున్నది. అలాంటి పొగాకునుండి అతి విలువైనటువంటి ఇతర దేశాలలో కూడ మార్కెటు కలిగినటువంటి necotine అనే పదార్థాన్ని తయారు చేయవచ్చునని నిపుణులు చెప్పుతూ ఉన్నారు. ఈ పరిశ్రమకు మాత్రం ఎవరుకూడ ముందుకు రావడంలేదు. ఈ పరిశ్రమ కొద్ది పెట్టుబడితో కొన్ని లక్షలతో స్థాపించడానికి వీలుఅయినప్పటికికూడ మన India లోనే ఈలాంటి పరిశ్రమ ఎక్కడనూ లేదు. పొగాకు మన ఆంధ్రలోనే ఎక్కువగ పండే ప్రదేశం కాబట్టి ఈలాంటి పరిశ్రమలను, ప్రవేటు వ్యక్తులు ఎవరు ముందుకు రానటువంటి పరిశ్రమను, ప్రభుత్వమే తీసుకొని వాటిని ప్రారంభించి వృధాగాపోతూ ఉన్నటువంటి దేశంయొక్క సంపదను ప్రజా వినియోగానికి ఉపకరించే లాగున చేయవలసినదిగ ప్రభుత్వానికి నేను మనవి చేస్తూ ఈ అవకాశం ఇచ్చినందుకు మీకు ధన్యవాదాలు అర్పిస్తూ తెలుపుకొంటున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI :—అధ్యక్షా! Supplementary demands లో సమాధుపరచినటువంటి అంకెలే కాకుండా అవే

Sri B. Gopala Reddi] [3rd October 1955

విషయాలను గురించి, మున్ముందు ఆంధ్ర దేశంలో జరుగవలసిన అనేక విషయాలను గురించి మెంబర్లు చెప్పారు. ఇది కేవలం ఆరు మాసముల కోసం అనేకాదు. బడ్జెటు అయిన తర్వాత ఏ item లు supplemental demand లో వస్తవి అనేటటువంటి విషయం మనరాజాగారు చెప్పినారు. అది ఈ ఆరుమాసముల కని ఉద్దేశింపబడినదికాదు. బడ్జెటు అయిన తరువాత కొత్తగా ఏదైనా Government sanction చేసినపుడు అది సాధ్యమైనంత శీఘ్రంగా శాసనసభా ఆమోదాన్ని పొందవలెను. ఒకవేళ దానికి కావలసిన ఖర్చు ఇతర allotments లో నుంచి మేము తీసుకొన్నప్పటికికూడ అసలు మూల సిద్ధాంతం అసెంబ్లీ ముందు పెట్టవలెను అనేదే. అందుకనే ఈ supplementary demands ను ఒక్కొక్కసారి వంద రూపాయల కోసం కూడ తీసుకొనివస్తూ ఉంటారు. మొత్తం తెలిసివుండి అదివేరే allotment నుంచి, transfer చేయడానికి వీలులేదు అన్నపుడు మొత్తం ఇంత కావలెనని కోరడం కూడకద్దు. లేకపోతే, మొత్తం సరిగా తెలియనపుడు, ఇతర వాటిల్లో ఏదో మిగులు ఉంటుంది కనుక దీనికి అధికంగా ధనం అక్కరలేదు అనేటటువంటి విషయం తెలుసుకొన్నపుడు ఒక నూరు రూపాయిలు మాత్రమే కోరుతూ ఉంటారు. అందువల్ల ఇది ఆరు మాసాలకోసం ఉద్దేశింపబడినదికాదు అనేటటువంటి విషయం చెబుతూ ఉన్నాను. ఇక Fertilizers Factory విషయంలో మన వావిలాల గోపాలకృష్ణయ్యగారు చాలాదూరం చెప్పినారు. ఈ విషయంలో మేము చేయవలసింది అంతా. ఉంటే దెబ్బలాటలు అని చెప్పనుగాని ఎంతవరకు మేము చెప్పడానికి వీలు అవుతుందో, అంతవరకూ చెప్పినాము. Prime Minister గారికి వ్రాయడం, K. C. Reddi గారితో మాట్లాడడం, లేకుంటే ఇతర మంత్రులతో కూడ మాట్లాడడం ఇదంత జరిగింది. వారు ఇంతవరకు ఇది సిద్ధమని చెప్పలేకుండా ఉన్నారు. ఇంకా అది నిర్ణయంకాలేదు. ఈ సందర్భంలో అనేక విషయాలు గమనించవలసియున్నది. నీరు కావాలి, బొగ్గు కావాలి, తరువాత transport facilities కావాలి. ఈ విషయాలన్నీ వారు ఆలోచిస్తున్నారు. ఇంతవరకు వాళ్లు ఏ నిర్ణయానికి రాలేను.

Fertilizers factory ఒకవేళ వస్తుందో రాదో నేను చెప్పలేను కాని మేము చేసినటువంటి ప్రయత్నంలోమాత్రం ఏలాంటిలోపము లేదని నేను స్వయముగా ప్రధానమంత్రికి ఈ విషయంలో వ్రాయడమే కాకుండా, మొన్న ఢిల్లీకి పోయినప్పుడుకూడ నేను వారితో ఈ విషయం హెచ్చరించాను. K. C. రెడ్డి గారి ఇంటికికూడ వెళ్లి వారితోకూడ ఇది ప్రస్తావన చేశాను. ఇంకా Agricultural Department వారితోకూడ ఈవిషయం హెచ్చరించాను. కనుక ఈ

విషయంలో అంతకన్నా మేము చేయగలిగిందేమి లేదు. ఏదో కేంద్రప్రభుత్వంతో బాగా దెబ్బలాడండి అని ఎవరో చెప్పారు. అంటే, మంత్రులతో కుస్తీపట్టడం కాదను కొంటాను. గట్టిగా చెప్పవలసిందని వారి అభిప్రాయమై ఉంటుంది. ఆ విషయంలో ఏలాటి సందేహం లేకుండా చేశాము.

రెండవది Cement factory విషయం నాగిరెడ్డిగారు హెచ్చిరించారు. మాచెర్లలో ఒకవేళ ఇది రామక్రిష్ణరావుగారికి ఇచ్చినాకూడ వేరే ఒక factory ప్రభుత్వం తరఫున ఎందుకు పెట్టకూడదు అన్నారు. ఈ విషయంలో Planning Commision వారితోను, Industries department వారితోను కొన్ని సంభాషణలు జరిగాయి. వారంతా ప్రభుత్వంతరఫున మీరు పెట్టవద్దనే సలహాయిచ్చారు. ప్రభుత్వం పెట్టితే ఎక్కువఖర్చు కావచ్చునని చెప్పారు. U. P. తో ఆవిధంగా ఒకటి ఆ ప్రభుత్వంవారు పెట్టినందువల్ల, వాళ్లు సిమెంటు ఈనాడు ఎక్కువధరకు కొనవలసివస్తున్నది. అందువల్ల దానికి అయ్యేఖర్చు నాలుగుకోట్లరూపాయలు తీసుకురావడంలోకూడ కొంత ఇబ్బంది అవుతుంది. ద్రవ్యవిషయమే కాకుండా, గవర్నమెంటు నేరుగా తీసుకున్నప్పుడు కొంత ఎక్కువఖర్చు అవుతుందని planning Commission వారు సలహా చెప్పారు. దానికి 3, 4 కోట్లు ఖర్చు పెట్టినప్పటికినీ మనకు దానివల్ల లాభము వస్తుందని. కాని ఇది చాలా దీర్ఘంగా ఆలోచించవలసిన విషయము. ఈ విషయంలో ఇతరరాష్ట్రాల కష్టసుఖాలన్నీ మనము సమీక్షచేసుకోవలసియున్నది. ఉదాహరణకు U. P. తీసుకోండి. అక్కడ గవర్నమెంటువారు పెట్టారుకాని వారు అనుకొన్నదానికంటె ఎక్కువ ఖర్చు అయింది. అదేవిధంగా మధ్యప్రదేశ్‌లో Nepa paper Mills అనేది పెట్టారు. అక్కడకూడ వాళ్లు అనుకొన్నదానికంటె ఎక్కువఖర్చు అయింది. గవర్నమెంటు తీసుకొంటె, మామూలుగా ఇతర private industrialists కు అయ్యేదానికంటె గవర్నమెంటుకు ఎక్కువఖర్చు అవుతుంది. ధనాభావంవల్ల గవర్నమెంటు పెట్టడానికి వీలులేదని వారు సలహా ఇచ్చారు. ఏమైనా ఇక్కడ ఈనాడు ఈ 18 పరిశ్రమలకు సహాయంచేసి అనేకమందికి వీటిలో తర్ఫీతు ఇచ్చి ఈ చిన్నచిన్న వృత్తులన్నీకూడ పెంపొందింపచేయాలనే ఉద్దేశ్యమున్నది. అదేగాదు. మనదేశంలో ఈ చేనేతపరిశ్రమకు ఇవ్వవలసినటువంటి సహాయంకూడా మనం ఇస్తేనేగాని ఈ పరిశ్రమ తన కాళ్లమీద నిలబడడానికి వీలులేదని మనకు తెలుసు. కొన్ని లక్షలమంది ప్రజానీకం దానిమీద ఆధారపడి ఉన్నారు. ఈ విషయంలో సత్యనారాయణగారు, మన ఉరవకొండ మెంబరుగారు వీళ్లంతా శ్రద్ధతీసుకొని ఎప్పటికప్పుడు ఈ పరిశ్రమలోని కష్టసుఖాలను చెప్పుతున్నందుకు చాలా సంతోషము. ఏమైనా ముమ్ముందు ఈ పరిశ్రమలు మనదేశంలో అభివృద్ధి కావడానికి మనం ప్రయత్నం చేయవలసియున్నది.

కాని వెంకటేశ్వర్లుగారు కేవలం దంప్రదాయిక్యము industry గాక తక్కినవన్నీ ఇతరరాష్ట్రాలకు పోతున్నాయని అన్నారు. కొంతవరకు ఇది వాస్తవముకావచ్చు, కాకపోవచ్చు. కాని దీనికి అనేకకారణాలుకూడా వున్నాయి. ఇక్కడ ఆంధ్ర దేశంలో పెడితే, labour troubles వస్తాయని భయంకూడా కొంతమందికి వున్నది. దానికి సరియైనటువంటి వాతావరణం కల్పించవలసి యున్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU:—సరిగా జీతాలు ఇచ్చి న్యాయంగా వుంటె ఏ troubles వుండవు.

THE HON. SRI B. GOPALA REDDI :—అట్లు చెప్పడానికి వీలు లేదు. సరిగా జీతాలు ఇచ్చినప్పటికినీ, ఒక్కొక్కసారి విద్యార్థులుమాదిరిగా, వాళ్లు లేనిపోని ఆందోళనలకు లోబడిపోవచ్చును. మొన్ననే కొంతమందిచెప్పారు, బెజవాడకు రావలసినటువంటి factory ఒకటి ఈ నాడు చెంగల్పటుకు పోయిందని. కాని ఇక్కడ అలజడిగా ఉంటుందేమోనని, ఇక్కడంతా సందేహాస్పదమైన వాతావరణము ఉన్నదనే ఉద్దేశాలతో కొంతమంది భయపడుతూ ఉండవచ్చును. లేకపోతే, అదిపెడితే మనవాళ్ళకు అవకాశం ఉండదని మనమే, మన మంత్రివర్గమే శంకించారా అని అనుమానం ఉండవచ్చునేమో కాని మంత్రివర్గము అన్నీ ఇక్కడ పెట్టాలనే కోరుతారు. కర్నూలులో ఒకటి బెజవాడలో ఒకటి, విశాఖపట్టణంలో ఒకటి ఈవిధంగా ప్రతిచోట ఏదో ఒకటి పెట్టాలనే కోరుతారు. మనదేశంలో ఎన్ని ఎక్కువ పెడితే అంతమంచిదే. బీద ప్రజానీకానికి జీవన భృతి కలుగుతుంది. ఏదో కూలినాలి వస్తుంది. కనుక అటువంటి దేమీకాదు. కాని పెట్టుబడిదారులు వీటికి కొన్ని లక్షలు, కొన్ని కోట్లు ఖర్చుపెట్టి పెట్టాలనుకున్నప్పుడు వాళ్ళకు సరియైన వసతులు ఎక్కడ ఉన్నాయో, ఎక్కడ ఆందోళన లేకుండా ఉంటుందో అటువంటి చోట్ల పెట్టాలని వాళ్లు ఆలోచించుకొంటూ ఉంటారు. ఈ Fertilizers Factory విషయంలో మాత్రము ఇది నెవేలికి పోతుందో సింగరేణికి పోతుందో నేను చెప్పలేను కాని, ప్రభుత్వంవారు ఈవిషయంలో ఏలాటి పరాకు లేకుండా ప్రయత్నము చేస్తున్నారని నేను చెప్పవలసియున్నది. ఇంకా అనేక పరిశ్రమలకు సహాయం చేయవలసియున్నది. అవన్నీకూడ మనం క్రమేణచేసుకొని మన వ్యవసాయాభివృద్ధితో పాటు పరిశ్రమలుకూడా అభివృద్ధి చేసుకోవాలి. ఈ విషయంలో ప్రభుత్వము సానుభూతి పూర్వకముగా చూడగలదని హామీ ఇస్తూ ఈ cut motions ను దయచేసి withdraw చేసుకోవలసిందని కోరుతున్నాను.

**The cut motion of Sri K. V. S. Padmanabharaju was, by leave of the House, withdrawn.**

The cut motion of Sri Vavilala Gopalakrishnayya was, by leave of the House, withdrawn.

MR. SPEAKER : The question is :—

"That Government be granted a sum not exceeding Rs. 100 under Demand XXI—Industries."

The motion was carried and the grant made,

## DEMAND XXII—WELFARE OF SCHEDULED TRIBES CASTES AND OTHER BACKWARD CLASSES.

THE HON. SRI B. GOPALA REDDI : Sir, on the recommendation of the Governor, I move:

"That Government be granted a sum not exceeding Rs. 100 under Demand XXII—Welfare of Scheduled Tribes, Castes and other Back ward Classes."

MR. SPEAKER : Motion moved :

"That Government be granted a sum not exceeding Rs. 100 under Demand XXII—Welfare of Scheduled Tribes, Castes and other Backward Classes."

SRI K. V. S. PADMANABHA RAJU : Sir, I beg to move:

"To reduce the allotment of Rs. 100 for welfare of Scheduled Tribes, Castes and other Backward Classes by Rs. 10."

"To discuss the negligence on the part of the Government to lay roads for providing transporation facilities connecting the Agency Areas with the main Roads."

SRI G. SURYANARAYANA :—అధ్యక్షా! వెనుకబడిన జాతుల పురోభివృద్ధి విషయమై ప్రభుత్వము అనేక పథకాలు తయారుచేశారు. ఈ పథకాలు ఈ జాతులకు సరిగా అమలు జరగడంలేదుకదా, వారికి కనీసం ఈ ఆంధ్ర ప్రభుత్వములో ఏవిధమైనటువంటి సౌకర్యాలు కలిగించలేదని చాలా విచారిస్తున్నాను. ఈనాడు కొండ ప్రాంతాలలో ఉండే కోయలు కొండ జాతులు మొదలైన వారికి రవాణా సౌకర్యాలు లేక అనేక బాధలకు గురి అవుతున్నారు. ఈ సందర్భంలో ఒక విషయం మాత్రం మనవిచేస్తాను. నేను మొన్న అనంతపురం ఆ ప్రాంతాలకు వెళ్ళిచూస్తే, ఆ జాతులవారు పండించే పంటను ఈనాడు ఒక పట్టణ market కు

Sri G. Suryanarayana] [3rd October 1955

తీసుకురావడానికి ఏవిధమైనటువంటి రవాణా సౌకర్యాలు లేక, వారు చాలా బాధ పడుతున్నారు. అందుచేత వారికి అటువంటి రవాణా సౌకర్యాలు కలుగజేయవలసిందని ప్రభుత్వాన్ని సెలవు కోరుతున్నాను. విశాఖపట్నం జిల్లాలో Agency ప్రాంతం తాలూకు కొండ జాతులు పండించే పంట ఈనాడు market కు రావాలంటె వీలులేకుండా ఉన్నది. కాని గోపాలపల్లి దగ్గర ఒక వంతెన కట్టినట్లయితే, ఆ జాతులకే కాకుండా యావన్మంది ప్రజలకుకూడ మంచి, సౌకర్యాలు కలుగుతాయి. కాబట్టి విశాఖపట్నం జిల్లాలో గోపాలపల్లి దగ్గర ఒక వంతెన కట్టాలని కోరుతున్నాను.

4 p.m.

ప్రతి గ్రామములోను చేపలు పట్టుకొని జీవించేవారు వున్నారు.

MR. SPEAKER :—ఏజన్సీ ప్రాంతాలలో జరగవలసిన పనులనుగురించి చెప్పండి. సముద్రములో కాదు.

SRI G. SURYANARAYANA :—కొండ జాతులవారు కొండ ప్రాంతాలలో అక్కడక్కడ భూములు దున్నుకొని జీవించుచున్నారు. Forest ఉద్యోగస్థులు యీ కొండ ప్రజలనుండి భూములను లాగుకొని అన్యాయాలు చేస్తున్నారు. ఇటువంటి అన్యాయాలు జరగకుండా ప్రభుత్వమువారు చూస్తారని ఆశిస్తు విరమిస్తున్నాను.

SRI MAHAMMAD TAHSEEL :—అధ్యక్షా, ఏజన్సీ ప్రాంతాలలో ప్రస్తుతము వేస్తున్నటువంటి రోడ్లు ఆ ప్రాంతాలవారికి ఏ మాత్రము సరిపోవు. ఇంకను ఎక్కువ రోట్లకు వేయవలసిన అవసరమువున్నది. ఉదహారణకు మారేడుపల్లి సంతకు చాలా దూర ప్రాంతాలనుంచి వచ్చి సరకులు కొనుక్కొని వెళ్లితేనే గాని అక్కడ కొండ ప్రాంతాలలోని వసించే ప్రజలకు వేరుమార్గములేదు. వారము రోజుల కొక పర్యాయము ఆ కొండ ప్రజలు యీ సంతకువచ్చి వారి భుక్తికి కావలసిన ఆహారధాన్యాదులు కొనుక్కొని వెళ్ళవలసిన పరిస్థితులు వున్నవి. మరల సంతకు రాకపోతే, వారికి భుక్తి గడవదు. ఇటువంటి పరిస్థితులలో మారేడుపల్లి సంతకు పోయే దారిలో చిన్నవాగు ఒకటి వున్నది. వర్షాకాలములో ఆ వాగునిండా నీరు వస్తుంది. ప్రజలు దాటలేని స్థితికూడా వుంటుంది. అటువంటి సంధ్భములో కొండ ప్రజలు యీ సంతకువచ్చి, ఆవాగులో నీరువున్నప్పుడు, అది దాటలేక ఆ రాత్రి అక్కడనే పడుకొని, నీరుతీసిపోయిన తరువాత, వెళ్లవలసిన పరిస్థితులు వుంటున్నవి. ఈ వాగుమీద ఆ ప్రదేశములో వంతెన లేనందున కొండ ప్రజలు

చాలా యిబ్బంది పడుచున్నారు. ఈవిధంగా వంతెనలు కట్టవలసిన వాగులు ఎన్నో వున్నవి. కొండ ప్రజలకు వేరేమార్గము లేక సంతకు పోవటానికి యీ వాగునే దాటిరావలసి వుంటుంది. వాగులకు వంతెనలు కట్టివేస్తే కొండ ప్రజలకు సౌకర్యమేర్పడుతుంది. ఇంతవరకు వంతెనలు ప్రభుత్వము కట్టించక పోవడమనేది చాలా విచారకరమైన విషయము. మారేడుపల్లి సంతకు చాలా దూర ప్రాంతములనుండి వ్యాపారము చేసుకొనటానికి వస్తూవుంటారు. వారు తెచ్చేవి కము, బత్తాయి, చింతపండు, పొగటాకులు వగైరాలు తెచ్చి అమ్ముకొని వెళ్లుతూ వుంటారు. కొండ ప్రజలు చాలా అమాయక ప్రజలు అయినందున ఆ సంతవద్ద వ్యాపారాలు చేసేవారు, యీ అమాయక కొండ ప్రజలవద్దనుంచి పొగటాకులు తక్కువ ఖరీదుకు తీసుకుంటూ వుంటారు. వారు తెచ్చే ప్రతి సరుకున్నూ వ్యాపారస్థులు చాలా తక్కువ ధరలకు తీసుకుంటున్నారు. ఈ సంతవిడిచి మరొకచోటకు వెళ్లి ఎక్కువ ధరకు అమ్ముకుందామని అంటే, వాళ్లకు ప్రయాణ సౌకర్యాలులేవు. అందువల్ల అంతదూరము నడిచి పోలేక ఆ వ్యాపారస్థులు అడిగిన ధరలకే యిచ్చిపోవలసిన పరిస్థితులు వుంటున్నవి. దీనివల్ల ఎంతో దూరమునుంచి మోసుకొనివచ్చి, వ్యాపారస్థులు అవి కొద్ది ధరలకైనా యిచ్చిపోవలసి వస్తున్నది. రోడ్డు సౌకర్యాలు వుంటే, యితరచోట్లకు వెళ్లి ఎక్కువ సొమ్ముకు అమ్ముకోటానికి వీలుగా వుండేది. కాబట్టి రోడ్లు వీలుఅయినన్నిచోట్లకు నిర్మించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇప్పటికి మారేడుపల్లి నుంచి రంప చోడవరము వరకే రోడ్డు వున్నది. అది బస్సు రూటు. ఈ రూటును రాజమండ్రివరకూ యివ్వమని అడిగితే యివ్వడములేదు. కొండ ప్రజలు రంప చోడవరమూ వరకు పోవటానికి వీలువుంటున్నది. అక్కడనుంచి కూలిపెట్టుకొని పోలేకుండా వున్నారు. అందుచేత వ్యాపారస్థులు అడిగిన దరకే యిచ్చిపోవలసిన పరిస్థితులు వుంటున్నవి. ఉదహారణకు నూరు పొగటాకులు ఎంతకు కొంటున్నారు అని అక్కడ వ్యాపారస్థులను అడిగితే రు. 5-8-0 కు కొంటున్నామని పైకి చెప్తూతున్నారే కాని యీ కొండ ప్రజలకు యిచ్చేది రు. 2-8-0 లేక రు. 3-0-0 లు మాత్రమే. ఈ ఆకులు యితర చోట్లకు తీసుకొని వెళ్ళాలంటే, వాళ్ళకు communications లేవు. ప్రభుత్వము యీ ప్రాంతములలో రోడ్డు, రవాణా సౌకర్యాలు కలుగజేయడము ఎంత అవసరమో ప్రభుత్వము గుర్తించాలి.

తరువాత ఫారెస్టు డిపార్టుమెంటులో కొత్తగా రేంజర్లను ప్రభుత్వమువారు వేస్తున్నారు. రేంజర్లుగా కొత్తవారిని వేయడమువల్ల, అడవులలోని పరిస్థితులు కొత్తగా తెలియవు. పనులు సానుకూలముగా జరగవు. ఇదివరకు వున్న forest guards లో అనుభవము గడించినవారికి వుద్యోగాలు ఇయ్యగలవారు ఎంతోమంది వున్నారు...

Sri Mohammad Tahseel] [3rd October 1955

రేంజర్లు ఎటువంటివారు వస్తున్నారు అంటే, వారిని అడవిలోకి తీసుకొని వెళ్లి ఒక టేకు చెట్టును చూపించి యిదియేమిచెట్టు అని అడిగితే, అది యేదోయింకొక చెట్టుపేరుచెప్పటమో లేక టేకుకాదనో సమాధానాలు చెప్పేవారు వస్తున్నారు. ఇటువంటి విధానములో కొంతమార్పు జరగవలసివున్నది. Forest guards లోనే seniors గా వుండేవారిని, రేంజరుపదవికి అర్హతగలవారిని రేంజర్లుగావేస్తే, వారికి ప్రమోషను యిచ్చినట్లవుతుంది. అడవులలోని రేంజర్లు చేయవలసినపనులుగూడా సక్రమంగా నెరవేరుతవి. ఈవిషయములో ప్రభుత్వవిధానము మార్చాలి అని అంటున్నాను. ఈ ఫారెస్టుడిపార్టుమెంటువారికి రెండు జీప్లులుగూడా సప్లయిచేస్తామని ప్రభుత్వమువారు అంటున్నారు. ఇది బాగానే వున్నదికాని యీ డిపార్టుమెంటులో లంచగొండితనముమాత్రము అమితముగా పెరిగిపోయింది. లంచగొండితనమునకు అరికట్టించటానికి ప్రభుత్వానికి ఎన్నోసార్లు మనవిచేయడంకూడా జరిగింది. లంచగొండితనము ను పట్టుకోటానికి పై అధికార్లను రమ్మని అంటే, వారు అక్కడికి రాలేకపోతున్నారు. ఈ అవకాశముతీసుకుని ఫారెస్టు అధికార్లు, వారియిష్టమువచ్చినట్లు కొంతప్రజలను దోచుకొని తింటున్నారు.

Upper Godavari Division అని చెప్పి గూడూరుతాలూకా, భద్రాచలంతాలూకా యివిరెండున్ను చేర్చి ఒక డివిజనుపెట్టారు. ఈ డివిషనులో ఒక ఫారెస్టు ఆఫీసరుకూడా వుంటారు. ఇదివరకు ఈఫారెస్టు ఆఫీసు కూనవరములో ఉంటూ వచ్చింది. ఇప్పుడు దానిని ఏకారణముచేతనో అక్కడినుంచిమార్చి రాజమండ్రిలో పెట్టారు. ఈఆఫీసు రాజమండ్రిలో అద్దెయింట్లో వుంచారు. బోలెడంత అద్దె యిచ్చుకోవలసి వస్తున్నది. రాజమండ్రిలో ఆఫీసులు చాలామటుకు అద్దెయిళ్లలోనే వుంటున్నవి.

THE HON. SRI B. GOPALA REDDI :—అయితే కూనవరములో గాని భద్రాచలములోగాని పెట్టవచ్చునా?

SRI MAHOMMAD TAHSEEL :—కూనవరములోగాని, భద్రాచలములోగాని వారికి సరిపోయే pucca buildings వున్నవి. అందుచేత యీ ఆఫీసులు కొన్ని అక్కడికిమార్చినట్లయితే, అధికారులు ఆప్రాంతములో ఫారెస్టుకు చేరువలో వుంటేలంచగొండితనముకూడా చాలాభాగము అరికట్టటానికి అవకాశాలు వుంటాయి. కాబట్టి యీ ఆఫీసుగూడా అక్కడికిమార్చితే సంతోషమే. లంచగొండితనముగూడా చాలాభాగము తగ్గుతుంది. కూనవరము, వెంకటాపురమునకు మధ్యన ఎన్నోవాగులువున్నవి. వీటికి వంతెనలులేవు. ఈ వాగులన్నిటిమీద వంతెనలు వెంటవేసినట్లైతే, రవాణాసౌకర్యాలు బాగుంటాయి.

THE HON. SRI B. GOPALA REDDI :—మొత్తము అన్నిఎన్ని వాగులుంటాయి ?

SRI MAHOMMAD TAHSEEL:—మొత్తము సుమారు పది పదిహేను వాగులువుంటాయి. ఈ వాగులు మీద వంతెనలు కట్టకపోతే కూనవరంనుంచి భద్రాచలము పోయేవాళ్లు గోదావరిలో మోటారులాంచీలో పోతేతప్ప వేరు మార్గము లేదు. ఈ రెండుచోట్లకు మధ్య సుమారు 30 మైళ్ల దూరమువున్నది. ఈ 30 మైళ్లప్రయాణము లాంచీలో పోవటానికి మూడురోజులు పట్టుతుంది. ఏదైనా కోర్టువ్యవహారముమీద పోవలసినవాళ్లు, ఒకటిరెండురోజులు ముందుగా పోతేనేగాని అక్కడికి టైములోగా చేరుకోలేరు. లాంచీలో వుదయము 6 గంటలకు ఎక్కితే 30 మైళ్లున్న సాయంత్రము 6 గంటలకుగాని చేరలేరు. ముప్పయిమైళ్లదూరము లాంచీలో పోవటానికి మూడురోజులు ప్రయాణముచేయ వలసివుంటుంది. రోడ్డు సౌకర్యమువుంటే, బస్సులు నడిపిస్తే, ఎంతత్వరలో పోగలరో ప్రభుత్వము గుర్తించాలి. ఏజన్సీ ప్రాంతాలను ప్రభుత్వమువారు రోడ్డుసౌకర్యాలు లేకుండా అధ్వాన్నస్థితిలోవుంచారు. ఈ ప్రాంతాలు అంటే చాలా చిన్నచూపు చూస్తున్నట్లుగ కన్పిస్తున్నది. మంత్రులుగూడా యీ ప్రాంతాలలో పర్యటన చేయడములేదు. రోడ్లువేయిస్తే, అప్పుడప్పుడువచ్చి, ఏజన్సీప్రజలకష్టసుఖములు విచారించటానికి వీలవుతుంది. లంచగొండితనమునకు అలవాటుపడిన ఉద్యోగస్థులు అక్కడి నిజపరిస్థితులు తెలుసుకోగలుగుతారని, పై ఆఫీసర్లకు, మంత్రులకు చెప్పరు. మంత్రులు పర్యటన చేయటానికివస్తే, అక్కడవున్న వుద్యోగస్థులకు చాలా strict warning యిచ్చి రావాలని అంటున్నాను. అక్కడి వుద్యోగస్థులు ఏజన్సీప్రజలను, కొండప్రజలను, అమాయకులనుచేసి దోచుకుంటున్నారు. ఈ విషయాలయొక్క వాస్తవికతను కనుక్కోటానికి మంత్రిగారిని ఆ ప్రాంతాలలో ఒకపర్యాయము పర్యటించవలసిందిగా కోరుతున్నాను. ఈ సందర్భములో ఒక చిన్న ఉదాహరణ చెప్ప దలచాను. మంత్రిగారు పర్యటనకు వచ్చినప్పుడు దీనియొక్క నిజానిజములు తెలుసుకోగలుగుతారు. క్రిందటిసారి రివెన్యూ మంత్రిగారు వస్తున్నారని అక్కడ ప్రజలకు తెలియజేశారు. వారు వస్తున్నారని వినగానే మేమందరముగూడా ఆ ప్రజలకష్టసుఖాలు తెలియజేయటానికి అవకాశము వుంటుందని వారి రాకకు చాలా సంతోషిస్తూ ఎదురుచూచాము. వారు వస్తున్నారని అంటే యిక అక్కడ ఉద్యోగస్థులుచేసిన పనిచెబుతాను వినండి. మంత్రిగారు వస్తున్నారు. కోళ్లను పంపమని గ్రామగ్రామాలకు కబురుచేశారు. గ్రామగ్రామాలనుంచి ఎన్నోకోళ్లువచ్చి పడ్డాయి. నాకు తెలిసినంతమటుకు రేపాక, భగవాన్‌పురం, వేపార్పూరు నుంచి గ్రామానికి 3 కోళ్లు నాలుగు కోళ్ల, చొప్పున తెప్పించారు. ఈ విధంగా ఎన్నో గ్రామాలనుంచి

తెప్పించారు. ఇన్ని గ్రామాలనుంచి ఎన్నో కోళ్లను తెప్పించినప్పుడు, మంత్రిగారు ఎన్నికోళ్లను తింటారోగాని, యిన్ని గ్రామాలనుంచి వచ్చినకోళ్లను యీ ఫారెస్టు ఉద్యోగస్థులు యేమి చేశారో తెలియదు. ప్రభుత్వమువారే గుర్తించాలి. పై అధికార్లు ఆ ప్రాంతాలకు ఎప్పుడు వస్తారని తెలిసినా, కోళ్లకోసము ఈ ఉద్యోగస్థులు కబురుపెట్టి తెప్పిస్తారు. తిని నన్నితిని, మిగిలినవి ఏమి చేస్తారో మనమే గుర్తించాలి. అధికార్లు, ఎవరు వచ్చినా, ఎప్పుడు, ఎన్నిసార్లు వచ్చినా, ఉద్యోగస్థులు గ్రామాలు మీద కోళ్లఎనూలుకు బయలుదేరుతారు. అక్కడి ప్రజలు ఈ ఉద్యోగస్థుల వత్తిడికి ఆగలేకుండా వున్నారు. కాబట్టి మంత్రిగారు యిటువంటి అన్యాయము జరగకుండా చేయాలి. అక్కడ వుద్యోగస్థులకు ఏ మాత్రము అవకాశము చిక్కినప్పటికినీ, అక్కడి ప్రజలను బాధించి దోచుకోటానికి అలవాటుపడిన ఆఫీసర్లుగా వుండడము చేత, వాళ్లు చేసే వత్తిడి యింత అంత అని చెప్పటాని వీలులేకుండా వున్నది. కాబట్టి ప్రభుత్వము ఈ విషయములో అక్కడవున్న ప్రజలను ఉద్యోగస్థులు అన్యాయముగా వత్తిడిచేయకుండా stick instructions యివ్వాలని కోరుతూ విరమిస్తున్నాను.

Sri G. RAMU NAIDU :—అధ్యక్షా! కొండప్రజలగురించి యిదివరకు బడ్జటు చర్చల సందర్భములో నేను మనవిచేసివున్నాను. ప్రభుత్వమువారు యీకొండ ప్రజలయొక్క కష్టసుఖాలు ప్రభుత్వమువారు విచారించినట్లు కనబడదు. కాశీపట్టణం నుంచి బొంటువలస, సావడిపాళెం, నూలురాయి, గుమ్మకోట, భీమవరంకు రోడ్డు వేయవలసి ఉన్నది. అక్కడ కొండప్రజలు పండించిన ఆహార దినుసులు main road కు తీసుకొని రావటానికి దారిలేకుండా ఉన్నది. కావడిలో వేసుకొని మోసుకొని రావటానికి వాళ్లు చాలా కష్టపడుతున్నారు. అక్కడనుంచి కొత్తూరు, కొత్తూరు నుంచి పంతమానువలస, గుమ్మ, దానకోట, పెద్దబిడ్డ, వాటిమీదుగా రోడ్డువేస్తే బాగుంటుంది. ఇప్పుడు అక్కడ పండిన ధాన్యాలు తీసుకొనివచ్చి main road కు వచ్చి మార్కెటులో అమ్ముకోటానికి దారిలేనందున, యిప్పుడు వారు చాలా కష్టపడుతున్నారు. కాబట్టి యిక్కడ రోడ్డువేయాలని అంటున్నాను. తరువాత Trunk road నుంచి—బొడ్డపాడు, కంటిపురము, మేళవర్తి, పులుసుమామిడి, రాయపాడు, జట్టంతేనుకు, ఈ గ్రామాలకు రోడ్డువేస్తే వాళ్లకు చాలా సౌకర్యముగా వుంటుంది. ప్రజల రాకపోకలకు దారి యే మాత్రము బాగాలేదు. తరువాత యింకొక రోడ్డు కరకవలసనుంచి కొండివ, రెంగుప్ప, సాడ, టొలకూరుకు ఒక రోడ్డు వేయాలి. ఆ తరువాత మిలియాగుడనుంచి తింతిరిగుడ బగమరవలస, బొర్ర, కొండాపురం, కరిచేరు ఈ గ్రామాలకు కొళ్ళేటట్లు మరొక రోడ్డు వేయడం అవసరమై ఉన్నది. ఇంకొక రోడ్డు బొందుగుడ, నినియావలస, బొండము, గన్నేరు, తడక, సోంతెరి, పెద్దవలస, అంతాడ—ఈ గ్రామాలకు వేయాల్సి వున్నది. ఇక్కడ

నివసించే కొండప్రజలు వారు పండించుకున్న ధాన్యాలు main road కు తెచ్చుకోటానికి దారిలేదు. అక్కడ యింకొక రోడ్డు అవసరమున్నది. అది ఎక్కడ అంటే బోదుగడ్డనుంచి మాడుగడ, తోకను గుడకొర్లవలస, బస్కి, దేవరపల్లి, గాండ, గద్దర, బయ్యి, పురసేలు—ఈ గ్రామాలనుంచి main road కు దారిలేదు. తరువాత దుమ్మిరివలసనుంచి అరముపరడి, గుంటసీమకు రోడ్డు వేయవలసి వున్నది. అక్కడ ప్రాంతములలో పండించే ధాన్యాలు అరకువాలి. సంతకు, సుందరమెట్ట సంతకు రోడ్డుకుపోవటానికి మైనరోడ్డుకు వస్తేగాని రాలేరు. Main Road కు పోవటానికి దారిలేదు. కాబట్టి యిక్కడ రోడ్డు వేయాల్సి ఉన్నది. ప్రజలు ధాన్యాలు కావడిలో వేసుకొని ఏ మాత్రము దూరము నడచి రావటానికైనా దారిలేదు. ప్రజలు చాలా కష్టపడుతున్నారు. కాబట్టి ప్రభుత్వమువారు కొంచెము కటాక్షించి ఈ కొండప్రజలకు ఆహార ధాన్యాదులు మార్కెటుకు తెచ్చుకొని అమ్ముకోటానికి తగిన రోడ్డు సదుపాయములు చేయాలని కోరుతున్నాను.

తరువాత forests విషయములో అరకువద్ద మాటగడ, సుంకరమెట్ట, గన్నెలి, లోంతెరి, బొండము, కోలాపుగము, యిరివాయి, పెద్దలబుడు, చిన్నలబుడు, బస్కి, దేవరపల్లి, ఈ ప్రదేశాలలో అడవి అంతా కొత్తగా reserve చేయబడ్డది. కొండప్రజలు మెరకలంట, దిబ్బలంట, చెలకలంట ఈ ప్రదేశాలలో చేరుకొని ఉన్నారు. అక్కడ ఒక ఏరుకూడా ఉన్నది. ఆ చుట్టుప్రక్కల అన్నిచోట్లను reserve చేశారు. Reserve లో పశువులను మేయనివ్వడము లేదు. Grazing tax కట్టమని పారెస్టువారు అంటున్నారు. పూర్వము grazing rates ఒక్కొక్క గొడ్డుకు 0-1-0, 0-2-0, 0-3-0 ఉంటే, యిప్పుడు ఎద్దుకు 0-6-0 లు, గొర్రెకు 0-3-0, ఎనుబోతులకు 0-12-0, 1-0-0 కూడా తీసుకుంటున్నారు. కొండ ప్రజలు ఈ హెచ్చురేట్లు చెల్లించలేక చాలా గోల పెటుతున్నారు.

తరువాత నీటివసతుల విషయముకూడా నేను మనవిచేస్తున్నాను. కొన్నిచోట్లలో నీటివసతులు బొత్తుగాలేవు. ఈ విషయమైపోయిన బడ్జటు చర్చల సందర్భములో కూడా మనవిచేశాను.

నీటి సదుపాయములు కలుగచేయాలని నేను మనవిచేసుకున్నాను. కొన్నిచోట్ల కొండప్రజలకు అట్టి ఆధారము లేదు. దీనికి రెండవ పంచప్రణాళికలో చేర్చవలయును. అక్కడ ఏమైనా విద్యాసౌకర్యములుకూడా లేదు. కొండప్రజల విషయంలో ప్రభుత్వమువారు ఎటువంటి శ్రద్ధ తీసుకొనుటలేదు. వారిని చాలా అధ్వాన్నముగా చూస్తున్నది. ఆంధ్రరాష్ట్రము వచ్చినతరువాత ఈ కొండజాతి ప్రజల పరిస్థితి! [illegible]

పడుతుందని ఆశపడినాము. అటువంటి ఆశలన్నీ మన ప్రభుత్వము నిరాశ చేసింది. అక్కడ పండించే దినుసులన్నీ కూడా పట్టణములకు అమ్ముకొనుటకు ధర్మవరం, విజయనగరము పోవలసివున్నది. అట్లా పోవుటకు మధ్యన ఒక చిన్న కాలువ అడ్డముగావున్నది. అందువల్ల దానిమీద ఒకవంతెన కట్టవలయునని కోరుతున్నాను. వీటన్నింటిని గురించి ప్రభుత్వమువారు తగినశ్రద్ధ తీసుకోవాలని కోరుతున్నాను.

THE HON SRI B. GOPALA REDDI:—అధ్యక్షా! ఏజన్సీ ప్రాంతాలకు సంబంధించిన ఇద్దరుసభ్యులు అక్కడవున్న ఇబ్బందులన్నీ చెప్పినందుకు చాలా సంతోషం. అక్కడ వారికి ముఖ్యముగా కావలసిన రోడ్ల విషయం చెబుతున్నారు. ఈ డిమాండులో అడిగినటువంటి రు. 100 లు కూడా Forest department వారు అక్కడ ఏజన్సీవాళ్లకు కావలసినటువంటి 8 రోడ్లు వేయడానికిగాను అడిగినారు. తరువాత ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోకూడా ఏజెన్సీ ప్రాంతానికి సంబంధించి కొన్నిలక్షల రూపాయిలు ఖర్చుపెట్టి అక్కడ కొన్ని వైద్య సౌకర్యాలు, రహదార్ల సౌకర్యాలు స్కూళ్లు వగైరాలు ఏర్పాటు చేయడానికి ప్రభుత్వము పూనుకుంటున్నారు. ఇంతకుముందు ఒకవేళ ఉపేక్షగా వున్నప్పటికినీ మునుముందు అటువంటి ఉపేక్ష ఉంచడానికి వీలులేదు. అసలు Constitution లో ఏజన్సీలు బాగా సౌకర్యాలు కలుగచేయాలని చెప్పి వారు కోరుతున్నారు. దానికి వేరే కమీషనరును డిల్లీలో పెట్టినారు. వారుకూడా కొంత ధనసౌకర్యము ప్రభుత్వాలకు చేస్తున్నారు. ఇటువంటి పరిస్థితుల్లో తప్పకుండా మునుముందు ఇంకా ఎక్కువ పని చురుకుగా జరుగుతుంది. ఈ రోడ్లు అన్నీ అచిరకాలములోనే అచ్చట అంతా స్థాపించబడుతుందని నేను ఆశిస్తున్నాను. ఏజన్సీ ప్రాంతానికి అప్పుడప్పుడు మంత్రులు రావడము మంచిదే. అది కొంచెముదూరంగా వుండడమువల్ల పోవడానికి వీలులేకుండా ఉన్నది. నేను ఒకసారి మద్రాసులో వుండగా వెంకటాపురంవరకు పోయాము. శృంగవరపుకోటకూడా రెండుమూడు పర్యాయాలు వచ్చినాను. మరల ఎప్పుడయినా వెంకటాపురంవరకు పోవాలని కోరికగా వున్నది. ఎప్పుడు అయినా పోతానని అనుకుంటున్నాను. ఈ లోపల చంద్రమౌళిగారు ఇతర మంత్రులుకూడా ఈ సంవత్సరం కొంతమంది ఏజన్సి ప్రాంతాలకు పర్యటనచేస్తారని అక్కడవున్నటువంటి కష్టసుఖాలు అంతా కూడా విచారించి అన్నీ తీర్చడానికి ప్రయత్నముచేస్తారనికూడా వారికి హామీఇస్తూ ఈ రు. 100 లు డిమాండును ప్యాసుచేస్తారని ఆశిస్తున్నాను.

MR. SPEAKER: The question is:

To reduce the allotment of Rs. 100 for Welfare of the Scheduled Tribes, Castes and other Backward Classes by Rs. 10.

The motion was lost.

MR. SPEAKER : The question is :

" That Government be granted a sum not exceeding Rs. 100 under Demand XXII—Welfare of Scheduled Tribes, Castes and other Backward Classes.'

The motion was carried and the grant made.

DEMAND XXIV—CIVIL WORKS—WORKS.

THE HON. SRI B. GOPALA REDDI : Sir, on the recommendation of the Governor, I move :

" That Government be granted a sum not exceeding Rs. 7,75,200 under Demand XXIV—Civil Works—Works."

MR. SPEAKER : The motion before the House is :

" That Govervment be granted a sum not exceeding Rs. 7,75,200 under Demand XXIV—Civil Works—Works."

SRI VAVILALA GOPALAKRISHNAIAH : Sir, I beg to move :

" To reduce the allotment of Rs. 7,75,200 for Civil Works-Works by Rs. 100."

(To impress upon the Government to keep a Bronze bust of Sri Potti Sreeramulu at the house which is going to be purchased by Government.)

SRI M. NAGI REDDI : I beg to move :

"To reduce the allotment of Rs. 7,75,200 for Civil Works-Works by Rs. 100."

మాచర్ల నుండి నాగార్జున సాగర్ వరకు వేసిన రోడ్డు సరిగా వేయకుండా దుబారా ఖర్చు జరిగిన విషయము చర్చించుటకు.

To reduec the allotment of Rs. 7,75,200 for Civil Works—Works by Rs. 100.

(మాచర్ల నుండి నాగార్జున సాగర్ వరకు వేస్తున్న తారు రోడ్డుకు ఎస్టిమేట్‌లో పుదహరించిన చోటనుండిగాక కంట్రాక్టర్లకు లాభదాయకమైన దగ్గరప్రదేశమునుండి తక్కువ రకం మెటల్‌ను సప్లయి చేస్తున్నందుకు.)

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా! మన ఆంధ్రరాష్ట్రము సాధించడానికి ప్రధాన కారకులు, ఎంతో త్యాగముచేసి ఆత్మబలిదానము చేసుకొన్నవారైనటువంటి శ్రీ పొట్టి శ్రీరాములుగారు ఏ గృహంలో చనిపోయినారో దానిని ప్రభుత్వము శాశ్వత స్మారక చిహ్నముగా గుర్తించినందులకు చాలా సంతోషము.

THE HON. SRI B. GOPALA REDDI :—అభినందనలు లేవా ?

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—మీరు కావాలంటే అవి కూడా ఇస్తాము. వాటితోపాటు అక్కడవారి విగ్రహాన్నికూడా ఏర్పాటుచేస్తే చాలా బాగుంటుంది. అక్కడకు పోయినవారికి వారిమూర్తికూడా కనిపిస్తూవుంటుంది. అందువల్ల అదిచాలాఅవసరము.మన ఆంధ్రరాష్ట్రము సాధించినప్పటిచరిత్రజ్ఞాపకమువుంచుకోవాల్సిన అవసరము వున్నది. మనకు ఆంధ్రరాష్ట్రము శ్రీ పొట్టి శ్రీరాములగారి త్యాగముతోటిన్ని ఆంధ్రప్రజానీకము చేసినటువంటి మహత్తరత్యాగముల ఫలితంగాను వచ్చిందనేది మనము ఈసమయంలో గుర్తించుకోకపోతే ఒక మహత్తరమైన చరిత్రను మరచిపోయినవారము అవుతామనిచెప్పి నేను మనవిచేస్తున్నాను. ఈనాడు సర్వసాధారణంగా ఒక అలవాటు అయిపోతున్నది. ఎవరు అయితే ఒక స్వతంత్ర పోరాటంలోగాని, ప్రజాపోరాటంలోగాని పనిచేసి వాళ్లయొక్క త్యాగముతోటి వాళ్ళయొక్క పట్టుదలతోటి, ఉత్సాహాలూపించి ప్రజావుద్యమాన్ని కదిలించి, దానికోసము ఆహూతిఅయిపోతే ఆరోజు ఈ ఉద్యమానికి వ్యతిరేకంగా వున్నవారంతా అధిసాధించినది దానివల్లనే అని తెలిసినతరువాత, ఈనాడు అందరు సర్వసాధారణంగా, నిబ్బరంగావున్న సమయంలో అట్లా చేసినవారంతాకూడ తప్పని, విద్యార్థులంతా అల్లరిచేసినవాళ్లని చెప్పి, లేక ఇతరులంతా అల్లరిచేసేవాళ్లని, వాళ్లు చేసింది అంతా మేము సహించమని ఇప్పుడు చెప్పడము అనేది చాలా విచారకరంగా వుంటుంన్నది. దానికి ఎవరు అయితే త్యాగముచేశారో ఆ కార్యక్రమం ఎలాజరిగిందో అది అంతా యీ. రోజున మనం తప్పు అనుకొనవచ్చును. కాని ఆరోజున ప్రధానంగా చేసినటువంటి త్యాగమువల్ల ఆంధ్రరాష్ట్రము వచ్చిందని మనము మరచిపోకూడదు. పొట్టి శ్రీరాములుగారు అక్కడ ఆత్మబలిదానం చేయడము, వారితోపాటు ఆంధ్రదేశంలోవున్న యువకజనము, యావత్తూ ప్రజానీకం అంతాకూడా ఎక్కడరైళ్లు అక్కడ ఆపివేసి ఇటువంటి వుద్యమము తీసుకురాకపోతే కేంద్రప్రభుత్వము దృష్టికి ఆంధ్రరాష్ట్ర ఉద్యమము వచ్చేదేకాదు. ఆయన త్యాగముచేసి వుండవచ్చునుగాని దానితరువాత ఫలితముమాత్రం మనం పొందివుంటే

వాళ్లము కాము. అందువల్ల అయనచేసినటువంటి త్యాగము మనం అందరమూ గుర్తుంచుకోవాలి. ఒకవైపునుంచిచూస్తే "కుఱ్ఱవాళ్లు మీరు, తొందరచేయ వద్దు కొస్త జాగ్రత్తగావుండాలి" అని అంటున్నాము. కాని స్వతంత్ర వుద్యమము వచ్చినప్పుడు మీరంతా త్యాగాలుచేయండి, బయలుదేరి పదండి, బడులువదలిపెట్టండి, రమ్మనమని అక్కడచెప్పాము. వారు ఆహూతి అయినతరువాత మీరు ఆగమని చెప్పాము. ఆంధ్రరాష్ట్రము కావాలని ఎన్నాళ్లు తపస్సుచేసినప్పటికీ రాకపోతే అప్పుడు మీరంతా లేవండి ముందుకు పదండి, ఏమవుతుందోచూద్దాము, ఆంధ్ర రాష్ట్రము రాకపోతే మేము బ్రతుకము, మనంకూడా చావో బ్రతుకో ఇప్పుడు తేల్చుకోవాలి, do or die అని జనాన్ని బాగా ముందుకుత్రోసినాము. అప్పుడు వాళ్లంతా త్యాగాలు చేశారు. రాష్ట్రమువచ్చింది. మనం అంతా ఇక్కడ కూర్చున్నాము. ఇక్కడనుంచి మీరు ఏమీచేయవద్దు అంటున్నారు. ఇది ఎవరు అయితే త్యాగముచేశారో, ఎవరు అయితే కార్యాచరణలోకి ముందుకువచ్చారో, వారందరిని మరచిపోవడము అనేభావం అవుతుంది. అందువల్ల మరచిపోకుండా వుండేదానికోసం త్యాగంచేసినటువంటి ఆ మహానుభావుడు చనిపోయినటువంటి స్థలాన్ని కొనడానికి మనం నిర్ణయించాము. ఆ స్థలములో విగ్రహము ఒకటిపెట్టాలి. దానితోపాటు ఇకరాబోయే ఉద్యమములో యువకులనుమాత్రము ఎవరినీకూడా ఈ విధముగాచేసి వుద్యములను గురించి నిరసించవద్దని చెబుతున్నాను. అది చాలా ప్రమాదము అయినటువంటిది. అయితే ఈ వేళ ఇక వుద్యమాలు వస్తాయా రావాఅంటే, అవసరమైతే వస్తాయి. లేకపోతే రావు. ఎందుకు రావాలి ? సామాన్యంగా జరుగబోయే పరిస్థితిలో ఎవరూకూడా కదలరు. అది అవసరము వచ్చినప్పుడు ఆరోజు మనమే పోయి ఇక్కడ కూర్చున్నటువంటి మనము ఈ సీట్లువదలిపోయి లేవండిరా ? మీరంతా ఏమైనారు, మీ యువక రక్తము అంతా ఏమయిపోయింది, అని మళ్ళీ వుజ్జాతలూపుతారు.

THE HON. SRI B. GOPALA REDDI :—రైళ్లు ఆపాలి అని చెప్పమంటారా విద్యార్థులకు ? నిద్రపోతున్నారా, మేలుకోనండి, రైళ్లు ఆపండి, టెలిగ్రాఫు తీగెలు త్రెంపండి, అని చెప్పమంటారా ?

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అటువంటి కార్యక్రమం ఎప్పుడూ ఇవ్వము. గోపాలరెడ్డిగారికి ఒక విషయం జ్ఞాపకముంటుంది. గోపాలరెడ్డిగారు 1942 లో జైలుకు వెళ్లినప్పుడు 1942 వ సంవత్సరంలో చేసిన తీర్మానం చదివి వారు జైలుకు వెళ్లారు. తక్కిన వాళ్ళందరూ ఆ తీర్మానాన్ని అమలు చేశారు. వారు మాత్రం అవునా, కాదా అని చెప్పకుండా జైలులో కూర్చున్నారు. [illegible]

యువకులు అప్పుడు ముందుకు వెళ్ళారు. ఆహుతి అయినారు. తప్పని ఇతరులు అన్నారు. కాని తప్పా రైటా అనే విషయం అది అనుభవించినప్పుడు తెలిసింది.

MR. SPEAKER :—ఇక్కడ యువకుల గురించి ఏమీలేదు. శ్రీరాములు గారు గురించి చెప్పండి.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—త్యాగం చేసిన వాళ్ళను గురించే చెబుతున్నాను. అందువల్ల వీరస్మరణం చేస్తున్నాము. స్మారక చిహ్నంగా దీనిని నిలుపుతున్నాం. కాబట్టి ఈ ఉద్యమానికి బలిదానం ఇచ్చిన వారందరికి జోహార్లు సమర్పించడం మన ప్రధాన ఉద్దేశ్యం కాబట్టి ఈ అవకాశం తీసుకుని పెద్దలకు పిన్నలకు అందరకు మరొకసారి జోహార్లు సమర్పిస్తూన్నాం. రెండవది నాగార్జున సాగర్ కు సంబంధించిన సమస్య వచ్చింది దీన్నిగురించి ఇప్పుడు మాట్లాడితే చాలా తొందరపడుతున్నాము అంటారేమో. జరుగుతున్న సంగతులు తెలుసుకోవాలికదా? ఇదివేసినప్పుడు కార్మికులు అక్కడకువెళ్లారు. మొట్ట మొదట చాలాకష్టాలు పడినారు. అక్కడ ఇంజనీర్లు కష్టపడినదిగనుక మాత్రే వాళ్లకు ఎన్ని అభినందనాలు చెప్పినా చాలవు. రోడ్డు వేస్తుంటే నేను వెళ్ళాను. ఇంజనీర్లు అందరూ అన్నారు, ఏమిటి మా సంగతి అని. మీరు ఇప్పుడు కాదు సంతోషించవల సింది, ఇప్పుడు అవస్థపడి రోడ్డువేస్తే తరువాత పెద్దలు అంతా పరుగెత్తుకుని పోతుంటే ఆ ప్రక్కన కూర్చుని మనంకదా ఈ రోడ్డు వేసాము అని ఆనందం పొందుతుంటే అది అసలైన ఆనందం; మీరు మన చరిత్రలో ప్రధానమైన భాగంగా ఉంటారు అని చెప్పాను. కనుక అటువంటి ఉత్సాహం కావలసినంత ఇస్తాము. ప్రభుత్వం చేస్తున్న ఖర్చు దుబారా కాకుండా ఉండాలి. అక్కడే ఉండే కార్మికుల కష్టానికి తగిన డబ్బు రాకుండా contractors, sub-contractors మ్రింగ కుండా జాగ్రత్త వహించాలి. Engineers వేసే estimateలో contractors చిన్న వంకలతో డబ్బు ఎగకొట్టకుండా చూడాలి. వాళ్లు దుబారా చేయకూడదు; ఇవ్వ వలసిన డబ్బు ఇవ్వకుండా ఉండకూడదు. ఈ పద్ధతులలోనే కార్మికులను నడిపించాలి. Social Welfare Officers ను ఇప్పటినుంచి వేయడం అవసరమని చెప్పుతున్నాను. ఉదాహరణకు తుంగభద్ర ప్రాజెక్టు విషయంలో ఇదే పరిణామమే జరిగింది. మొట్ట మొదట కార్మికులు, contractors అందరూ వెళ్ళారు. పని జరుగుతోంది. ఆ సమయంలో రాయలసీమలో కరువు తాండవమాడుతోంది. దిక్కు లేని జనం ఏమి తోచక తుంగభద్ర ప్రాజెక్టుకు వెళ్ళారు. అప్పుడు ఒక కంట్రాక్టరు ఊరు బయటవచ్చి 100, 150 మందిని తెచ్చి వీరిని ఇంకొకరికి అప్పచెప్పేవారు. వారు వాళ్ల దగ్గర పని చేయించుకునే వారు. రెండు వారాలకు డబ్బు ఇచ్చేవారు కాదు.

మూడవవారము డబ్బు ఇచ్చేసమయం వచ్చినప్పుడు మొదటి contractor కనపడకుండా వెళ్లిపోయేవాడు. ఈ కంట్రాక్టరును అడిగితే ఆడబ్బు మీ కంట్రాక్టరుకు ఇచ్చివేసాము మిమ్ము పిలుచుకొని వచ్చింది ఆయన, కనుక ఆయనకు ఇచ్చివేశాము, ఆయన సంతకం చూడండి అనేవారు. అటువంటి పరిస్థితిలో వీరిని అడిగితే లాభంలేదని వీరందరు నెత్తినగుడ్డ వేసుకొనిపోయిన ఘటనలున్నాయి. మలేరియా జ్వరంతో వారందరూ తిరిగివచ్చిన ఘటనలున్నాయి. బాధను జ్ఞాపకం ఉంచుకోడానికి కాదు నేను చెప్పేది. అటువంటి దురదృష్ట సంఘటనలు రాకుండా ప్లానింగ్ పద్ధతిలో ప్రజలందరినీ ఉర్రూతలూగించే పద్ధతిలో నడుపుతున్నాము. అపుడు నడిపింది పోలీసుస్టేటు. ఇపుడు నడిపించేంది welfare state. ప్రజానీకం అంతా కలిసి తమ పనిగా భావించి-ఇది నేను అనుభవిస్తాను, లేకపోతే నాసంతతి అనుభవిస్తుంది అనే ఆత్మ విశ్వాసంలో పనిచేయాలంటే, కార్మికులకు జీతాలలో వచ్చే నష్టం లేకుండా చేయాలి మధ్యన ఎగర కొట్టే వాళ్లు లేకుండా ఉండాలి. తక్షణం Labour Welfare Officer నో మరెవరినైనా వేయాలి. అక్కడ వచ్చేవాళ్ళెవరు ఇంజనీర్లెవారు contractors, sub-contractors ఎవరు అని వీరందరిని గమనించి, దళారీలను నిరోధించాలని మనవిచేస్తున్నాను. డబ్బు ఎంతవచ్చిందో వివరంగా తెలియలేదు అన్నారు. General policy మీద చర్చచేయడానికికూడా out of scope కాదని చెబుతున్నాను. పంచవర్ష ప్రణాళికలో ఈ ప్రాజెక్టుక్రింద మనకు allot చేసినడబ్బు 40 కోట్లరూపాయిలు. ప్రథమ పంచవర్ష ప్రణాలిక ఆఖరు రోజులలోనికి వచ్చింది. ఈ allotment పోతే రాబోయేడబ్బు చాలాతక్కువ వున్నది గనుక వెనుక వున్నది lapse కాకుండా చూసుకోవాలి. కనుక ఈ ముందు సంవత్సరాలలో పూర్తిపనిచేసేట్లా ప్రయత్నించాలి. కంట్రాక్టర్లు ఒకచోటే పనిచేయాలంటే మరొకచోట చేస్తున్నారు. ఈ విషయాలన్నింటిమీద ఇతరులుకూడా మాట్లాడడం న్యాయం. నాగార్జున సాగరం శంకుస్థాపనకు నెహ్రూగారు ఎప్పుడు వచ్చెదరో సరిగా చెప్పగలిగితే సంతోషిస్తాము. ఈ లోగా మూడుపనులు జరుగవలసి యున్నది. Labour Welfare Officer ను appoint చేయాలి. కంట్రాక్టర్లు తినేడబ్బు తగ్గించాలి. పనులు కర్నూలు ఇండ్లమాదిరి జరుగకుండా జాగ్రత్తపడాలి. కర్నూలు ఇండ్లపని ఏవిధంగా జరిగింది అంటే cracks ఇవ్వడంవల్ల వర్షంలోపల కురుస్తోంది. మనం చేసేది ఏమిలేదు. ఇండ్లుకనుక సర్దుకోగల రేమోకాని Dam అయితే సర్దుకొనగలరా ? Upper pennar project మాదిరి అవుతుంది. పెద్ద ఇంజనీర్లు ఉన్నారని చెబుతున్నారు. ఇవన్నీ జాగ్రత్తగా ఉండేట్లాచూడాలి. అక్కడ నాగార్జునశిల్ప శిధిలాలున్నాయి. వాటినితీసి భద్రపరచడానికి కేంద్ర ప్రభుత్వాన్ని వత్తిడిచేసి అడగాలి. 50 అడుగుల dam కడితే శిల్పశిథిలాలన్నీ నీటిలో

మునగుతాయి. వాటిని అయిదు సంవత్సరాల లోపుగా excavate చేయాలని Central Government ఆదేశం ఉన్నది. అయినా వాళ్లు quickగా నడపడంలేదు. మన ప్రభుత్వం ఒత్తిడిచేసి గట్టిగాచెప్పాలి. త్వరలో తీయాలి; మునిగిపోయిన తరువాత అసంభవం అవుతుంది. గవర్నమెంటువారు ఈ విషయంలో వ్రాయాలని కోరుతున్నాను. తరువాత Archaelogical Department కూడా వ్రాస్తోంది. ఈ విధంగా రెండువైపులా ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చినవారము అవుతాము. శిల్ప శిథిలాలను మరొక ప్రాంతానికి తీసుకుపోయే పద్ధతి కాకుండా . . .

THE HON. SRI B. GOPALA REDDI :—ఈ నెల 29 వ తేదీ బోర్డు మీటింగు జరుగుతుంది. ఈ విషయం దర్యాప్తుచేస్తాము. మొన్న చూచినపుడు పని చురుకుగా జరుగుతోంది అనే మేము అభిప్రాయపడినాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—నేను ఊహాగానం మీద చెప్పడంలేదు. శాలిగుండం అని శ్రీకాకుళం జిల్లాలో ఉన్నది. దానిని repair చేయడానికి ఇక్కడ ఉండే staff ను పంపి మూడునెలలు ఇక్కడ పని ఆపుచేసారు.

MR. SPEAKER :—గోపాలకృష్ణయ్యగారు ఇపుడు శాలిగుండంలో లేరు; శిథిలాల్లో లేరు; నాగార్జునసాగరం రోడ్డులో ఉన్నాం. రోడ్డుమీద నడవండి; సాగరంలో పడకండి.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఆరోడ్డు అక్కడ కేతీసుకుపోతుందని మనవిచేస్తున్నాను. మూడు నెలలు పనిజరుగకుండా ఆగిపోయింది. దీనిని మీదృష్టికి తీసుకువస్తున్నాను. ఈ శిల్పశిథిలాలను ఎక్కడ పెట్టాలని ఆలోచిస్తున్నారు.

రెండవవిషయం ఈ శిల్పకళలను ఎక్కడపెట్టడానికి ఆలోచిస్తున్నారు. రెండు మైళ్లు వెడల్పుగల, 50,000 ఎకరాలు వైశాల్యంగల నందికొండ దుర్గం అనే ప్రాంతంమీద పెట్టగలిగితే సరిపోతుంది. దాని level 600 feet above sea level. నందికొండ ఎత్తు 590 అడుగులు కొబట్టి అక్కడ పెట్టనచ్చును. అప్పట్లోనే 10, 15 అడుగుల ఎత్తు ఉంటుంది. లేకపోతే మనము కొత్తగా ఊరుకట్టు పూనుకుంటున్నాము అక్కడనైనా పెట్టవచ్చును. విజయపురిని కొండ ఎక్కిద్దామని నా కోరిక. చరిత్ర కారులు బోధడకుండా నాగార్జునుడు ఈ ప్రదేశములో ఉండేవాడని జ్ఞాపకమూ ఉంటుంది. బోర్డులో సక్రమముగా ఆలోచిస్తామన్నారు. చాలా సంతోషము. అక్కడనే పెట్టవలెనని నా సూచన.

SRI G. BAPAIAH :—పొట్టి శ్రీరాములుగారు ఇండియా ప్రభుత్వానికి, ఆంధ్ర కాంగ్రెసు కమిటీకి మనశాస్త్రానికి, మన రాష్ట్రానికి విరుద్ధముగా ఉపవాసం చేసినాడు కనుక ఆయనకు ప్రతిమలుచెయ్యడం మంచిది కాదనినా అభిప్రాయము. ఇప్పటికే మన Secretarait buldings కు Potti Sriramulu buildings అని అన్నారు. ఒక private person పేరు ఏ విధముగా pubiic buliding మీద వేయించారు ? అది ఆక్షేపణీయమని ఊహిస్తున్నాను. ప్రభుత్వం కంటె పొట్టి శ్రీరాములుగారు గొప్పవారా ? Established ప్రభుత్వంకంటె, ప్రజారాజ్యంకంటె పొట్టి శ్రీరాములు గారు ఎక్కువని చెప్పడం న్యాయంకాదు. ఆత్మహత్య చేసుకొన్న వ్యక్తిని మనము పూజించడము ఆచరణీయం కాదని నా అభిప్రాయం.

SRI M. NAGI REDDI :—అధ్యక్షా, నేను ఈ డిమాండుమీద రెండు cut motions ఇచ్చాను. వాటినిగురించి మాత్రమే చెప్పవలెనని మొదట్లో అనుకున్నాను. కాని వావిలాల గోపాలకృష్ణయ్యగారి cut motion మీద బాపయ్యగారు చెప్పినది చాలా విచారకరమైన విషయము. ఆంధ్రదేశములో గాని భారతదేశములోగాని ఎక్కడా విననట్టి మాట అన్నారని చెప్పడానికి విచారిస్తున్నాను. అయితే గాంధిగారుకూడా సత్యాగ్రహ ఉద్యమ సమయంలో ప్రభుత్వం లొంగి రాలేదని, బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వమే కానియ్యండి, నిరసనవ్రతాలు, ఉపవాసాలు చేశారు. దురదృష్టవశాత్తు గాంధీగారు హిందూమహాసభకు చెందిన ఒక ఒక మతోన్మాదుని తుపాకితో చచ్చిపోతే చచ్చిపోయి ఉండవచ్చు గాని ఆ నిరసన వ్రత రోజులలో గాంధిగారు చనిపోతే అది ఆత్మహత్య అనేవారు కాబోలు మన బాపయ్యగారు. పురాణాలకు విరుద్ధముగా ఆత్మహత్య చేసుకొని చచ్చిపోయినారనే వారేమో మన బాపయ్యగారు. అసలు స్వతంత్ర ఉద్యమముఅంటే ఏమిటో, ఏమి చెయ్యవలయునో, జైలుఅంటే ఏమిటో, నిరసనవ్రతమంటే ఏమిటో తెలుసుకునే తెలివిఉంటే బాపయ్యగారు ఇలా అనరు. ఇలాంటిపనులు త్యాగాలు బాపయ్యగారు చెయ్యకుండానే అదృష్టవశాత్తు యిక్కడ కాంగ్రెసుకూటమిలో M. L. A. గా వచ్చి కూర్చున్నారు. ఇది చాలా విచారకరమైన విషయము. ప్రభుత్వ సభ్యులు అసలు రాజకీయాలతో సంబంధం లేనివారుకూడా పొట్టి శ్రీరాములు గారు ఆత్మహత్య చేసుకొన్నారు అనరు. ఈ విషయమై ఎక్కువగా చెప్పడం అనవసరము.

పోతే నాగార్జునసాగరంవిషయంలో ఆరువారాలలో రోడ్డువేసినామని చెప్పడం బాగా వేస్తుంది. గవర్నరుగారు వచ్చినప్పుడు నున్నగా కనబడేటట్లు చేసినారు.

అందుకు సంతోషము, మైలుకు 30,000 ఖర్చు అయినది. ఇది చాలా జాస్తి అని కంట్రాక్టర్లు, ప్రజలుకూడా అనుకుంటున్నారు. మట్టిరోడ్డు వేసిన తరువాత వెంటనే రాతిరోలింగు చేయడమువల్ల క్రుంగిపోతుందని అందరికి తెలుసును. Contractors ను పిలిపించారు. పల్లవు ప్రాంతములవారు పనులు చెయ్యడంలో బాగా అనుభవము ఉన్నటువంటివారు వచ్చారు. Highest quotation పెట్టారు. అలాగే ప్రభుత్వం ఒప్పుకున్నది.

THE HON. SRI B. GOPALA REDDI :—ఏ తాలూకాలనుండి contractors వచ్చారో మంత్రిగారికి చెప్పడం మంచిది కాదా ?

SRI M. NAGI REDDI :—చెప్పడం మంచిది కాదేమో. District Board roads, Highways roads మాదిరిగా టెండర్లు పెట్టారు. రెండు నెలలలో పూర్తిచేశారు. ఇప్పుడు రోడ్డు అంతా కమ్మెలుపడి క్రుంగిపోయింది. ఇప్పుడు ప్రధాన మంత్రిగారు అచ్చటికి రాదలిస్తే మంచి springs ఉన్న కారులో వస్తే మంచిది అవుతో కాదో తెలుస్తుంది. మొత్తం మైలుకు 30,00C ఖర్చు చేశారు. పంచాయితీలలోను, Higy waps లోను వేస్తే 800/- 1000/- రూపాయిలతో కానచ్చును. అయితే వెడల్పుగా వేశారనవచ్చును. ఎంతైనా మైలుకు 30,000/-ఖర్చు దుబరాఖర్చు అని అందరకు తెలుసును. ఇప్పుడు వెంటనే తారురోడ్డు చేయాలని అంటున్నారు. వెయ్యవలసినదే గాని వర్షాలకు తడిసి consolidate కాకముందే తారు రోడ్డు వేస్తే, బాటాలు గుంజుకోవడం తప్ప ఇంక ఏమీలేదు. కర్నూలు తారురోడ్ల పరిస్థితులు రావచ్చును. అంటే వెయ్యవద్దని చెప్పడము కాదు. రోడ్డు బాగా Con dite అయిన దర్శలావేయడం మంచిది. తారు రోడ్లకు Qudctions అడిగేరు. 13/4- మైలునుండి granite reetal తోలాలని Contract ఇవ్వడం జరిగింది. ఇప్పుడు 13/4 మైలునుంచి కాక 3, 4 మైళ్ళ నుండిన్ని మండాది రోడ్డు ప్రదేశంనుంచి తోలి Stocks పెట్టడం జరుగుతోంది. ఈ విషయము కొందరివద్దనుండి ప్రభుత్వానికి Petitions కొన్ని వచ్చునవి. ఈవిధముగా contractors డబ్బును దుర్వినియోగం చెయ్యడం తప్ప ఏమీలేదు. ఇప్పటికప్పుడే Revised estimates రావడంకూడా జరిగింది. తుంగభద్రా Dam మాదిరిగా ప్రభుత్వం వేసిన 120 కోట్ల అంచనా చాలకపోవచ్చును. పోనీ కొంపలకు డబ్బు ఏమైనా సరిగా ఇస్తూన్నారా అంటే అదీలేదు. మాకు ఇంకా బిల్సురాలేదంటూరు. తుంగభద్రనుంచి ఇంకా అనేక జిల్లాలు నుండి కూలీలు రావడం జరిగింది. కర్నూలు, అనంతపురం, విశాఖపట్నం మంచి కూడా వస్తూన్నారు. 15,000 రూపాయలవరకూ కూలీలకు యివ్వాల్సిన బాకాయిలు ఈనాడు ఉన్నాయి. 3,4 తూనికలు చొప్పున జొన్నలు తెప్పించి

ఇవ్వడం తరువాత Bills తీసుకు వెళ్ళడం జరుగుతుంది. కంట్రాక్టర్లు బిల్సురాలే దంటారు. Bills అన్నింటినీ pass చేయించి కూలీలకు డబ్బు ఇచ్చేటట్లు చేయించవలెను. ప్రభుత్వం తయారుచేసిన estimates లో schedule rates ప్రకారం జిల్లాబోర్డులు, పంచాయితీలు మగ కూలీలు అయితే 1-2-0 ఆడ కూలీలు అయితే 0-14-0 ఇస్తున్నారు. ఈనాడు అచ్చటి P. W. D. వారు పురుషునకు 1-0-0 స్త్రీకి 0-12-0 ఇస్తున్నారు. ఈమాదిరిగా నాగార్జున కొండ శిధిలాల త్రవ్వకం పనిలో కూడా జరుగుతోంది. తమ Department నిర్ణయించిన scheduled rates ను కూడా ఇవ్వనప్పుడు ఇక కంట్రాక్టర్లు సరిగా ఇవ్వలేదని చెప్పడం ఎలాగ? అదేవిధముగా stone cutters కు 2-0-0 ఇవ్వాలని ఉంటే 1-12-0, 1-8-0 మాత్రం ఇస్తున్నారు. P. W. D. వారు కాజేస్తున్నారో ఏమో తెలియదు. దీనిని గురించి ప్రభుత్వం వెంటనే చర్య తీసికొనవలయును. మనకు ప్రత్యేక రాష్ట్రం వచ్చింది కాబట్టి తొందర తొందరగా బిల్డింగులు కావాలి, రోడ్లు కావాలని చేస్తే బిల్డింగులన్నీ కురుస్తున్నాయి. రోడ్లు కుమ్మెలు పడిపోయాయి. నందికొండ project వస్తోంది. మూడు వారాలలో రోడ్డు వెయ్యాలంటే అది జరిగే పనేనా? ఏ కార్యక్రమం తీసుకున్నప్పటికీ ఒక programme, సరియైన time తీసుకుని చేయకుండా ఎప్పటికప్పుడు హడావిడిగా చెయ్యడం దానితో డబ్బంతా కూడా వృధాకావడం, ఇది Public Works Department అనే బదులు Public Works Department అనే పరిస్థితి ఏర్పడింది. అదేవిధంగా ఇప్పుడు rail road proposal కూడా ఉన్నది. మెటలు road వేసినప్పటినుంచి రైలు రోడ్డు వెయ్యాలి అని హడావిడిగా tender లు call for చేస్తే contractor లు ఎక్కువ tender లు పెట్టడం జరుగుతుంది. ఒక పనికీ ఇంకొక పనికీ ఎప్పుడైతే gap వస్తోందో వచ్చిన కూలీలు 10 రోజులు పనిచేసిన తరువాత మళ్ళీ పనిలేక పోయేటప్పటికి వాళ్ళు ఊళ్ళకి వెళ్ళిపోవడమో, వాళ్ళకి డబ్బు రాకపోవడమో జరుగుతోంది. అక్కడకు విజయనగరం నుంచి వచ్చిన కూలీలుకూడా ఉన్నారు. తుంగభద్ర project లో పనిచేసి వచ్చినటువంటి కూలీలున్నారు. ఆ road ఆరువారాలలో ఐపోయింది. ఇంక పనిలేదనేటప్పటికి మళ్ళీ వాళ్ళు ఎటు వెళ్లడానికీ డబ్బులేదు. వాళ్ళకిచ్చిన కూలీసరిగాలేదు. వాళ్లు మళ్ళీ ఊళ్ళ వెంబడి అడుక్కుతినే పరిస్థితులు ఏర్పడుతున్నాయి. అందువల్ల ఒక కార్యక్రమం వెంబడి ఇంకొక కార్యక్రమం తీసుకుని ఇంతమంది మనుష్యులు కావాలని, వాళ్ళని తీసుకురావడం వాళ్ళకి కావలసిన ఇంటి వసతులు, నీటివసతి కల్పించి ఇంటి వసతులంటే డాబాలు కట్టి ఇవ్వమని కాదనుకోండి, గుడిసెలైనా వేసి

Sri M. Nagi Reddi] [3rd October 1955

సౌకర్యం చెయ్యాలికాని వాళ్ళను చెట్టుక్రింద ఉంచే పరిస్థితిలో సౌకర్యాలు ఏమీ లేకుండా, పని ఎల్లా చేస్తారు? ఇప్పుడక్కడ పనిచేస్తున్న కొద్దిమందిని కూడా, మీ ఇష్టం ఎక్కడైనా ఉండండి ఏమైనా చేసుకోండని చెప్పేసరికి వాళ్లు 5,6 మైళ్ళ దూరంనుంచి పనికివచ్చే వాళ్ళుకూడా ఉండడంవల్ల, పని కుంటుపడడం తప్పనిసరిగా జరుగుతోంది. అక్కడే ఉండేటటువంటి వాళ్ళు చెట్ల క్రింద దళ్లు కట్టుకుని ఉండేటటువంటి పరిస్థితి ఏర్పడుతోంది. అందువల్ల ప్రభుత్వం వాళ్ళకు ఉండటానికి గుడిసెలైనా వేయించి, వాళ్ళకు వైద్య సహాయంకూడా కల్పించవలసిన అవసరం ఉంది. వాళ్లు ఆ అడవులలో ఉండి ఏ నీళ్ళు పడితే ఆనీళ్లు త్రాగి జబ్బు పడిపోతున్నారు. వెంటనే ఒక Doctor ను appoint చేసి వాళ్ళకు వైద్య సహాయం కల్పించాలి. Contractor లు ఈ కూలీలకు సరియైన కూలీ ఇవ్వడంలేదు. దీని కోసం ప్రత్యేకంగా Welfare Officer ను వేసి, గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు, వాళ్ళకు సక్రమమైన కూలీ ఇస్తున్నారాలేదా అనే విషయాన్ని చూడవలసిన అవసరం ఉంది. డబ్బు వృథా కాకుండా వచ్చినటువంటి కార్మికులకు దినం పని ఉండేటట్లు చూడవలసిన అవసరంకూడా ఉన్నది. మేము ప్రభుత్వానికి మొదటినుంచీ ఒక విషయం మనవిచేస్తూ వచ్చాం. ఏమిటంటే చిన్న చిన్న పనులు ఉన్నాయంటే అవన్నీకూడా contractor లకు ఇచ్చి అధిక లాభాలు వారికి పోయే పద్ధతికంటే, షెడ్యూలు రేట్లమీద అక్కడుండేటటువంటి Labour Contract Society లకు ఐనా, పంచాయితీ బోర్డులకైనా ఇట్లాంటి సంస్థలకు ఇవ్వడంద్వారా, అక్కడ labour కు కనీస కూలీ గిట్టుబాటు కావడానికి అవకాశం ఉంటుందని పదే పదే చెబుతున్నాం. Technical గా skilled works కి సంబంధించినటువంటి పని తప్పితే, మామూలు కాలవల పనులూ ఇవ్వనికూడ Labour Contract Society లకు ఇచ్చినట్లయితే వాటిలో technical mistakes ఏమీ ఉండవు. ఈ society లకు ఇస్తే కూలీలకు వచ్చే కూలీ డబ్బులు మ్రింగి వేసేటటువంటి అవకాశంలేకుండా, వాళ్ళకు వచ్చే కూలి వాళ్ళే అనుభవించే పరిస్థితులు ఏర్పడతాయి. Dam కట్టడంలాంటి technical skilled works ఎట్లా ఇచ్చినప్పటికీ, ఈ కాలవలు త్రవ్వడం ఇట్లాంటి పనులకు వేరే department ఉండబోతుంది అంటున్నారు. అది మన ప్రభుత్వానికి సంబంధించిన విషయం కాబట్టి వీటి విషయంలో, ఆ గ్రామాల సరిహద్దులలో ఉండేటటువంటి labour contract society లకుఇవ్వడానికి పూనుకోవలసిన అవసరం ఉన్నది. ఈరోడ్డు వెయ్యడంలో డబ్బు దుబారాగా ఖర్చయిపోయింది. ఇప్పుడు మళ్ళీ tar చెయ్యడానికి కావలసిన మెటలు ఒక చోట తోలించవలసింది, ఇంకో చోట తోలించారు. మేము Planning Committee మీటింగుకు పోయినప్పుడు తెలిసినటువంటి

విషయం ఏమిటంటే-మొట్టమొదట 13/4 మైలు అనుకున్న దానిని, ఇక్కడెక్కడో మూడవ మైలులోనో, నాలుగవ మైలులోనో తెస్తే, మళ్ళీ కొంతగొడవ జరిగేటప్పటికి ఇప్పుడు 10 వ మైలులో తీస్తున్నారని చెప్పి నిన్న తెలిసినటువంటి information. ఆవిధంగా జరగకుండా సరియైనటువంటి material అక్కడకు వచ్చేటట్లుగా. కూలీలందరకూ సక్రమంగా కూలీ చేకేటట్లుగా ప్రభుత్వం తగు శ్రద్ధ తీసుకోవలసినటువంటి అవసరం ఉంది. కూలీలకు అన్యాయం జరగకుండా సరియైనటువంటి చర్యలు ఇప్పటినుంచీ తీసుకుని, project తొందరలో పూర్తికావడానికి తగినటువంటి కట్టుదిట్టాలు ప్రభుత్వం తీసుకుంటుందని మీద్వారా మంత్రివర్గానికి విజ్ఞప్తిచేస్తున్నాను.

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, ఈ సప్లిమెంటరీ గ్రాంట్సు మీద నేను మాట్లాడదలచుకోలేదు. కాని శ్రీ గింజుపల్లి బాపయ్యగారు మాట్లాడిన తరువాత, మాట్లాడకుండా ఉండడం ఉచితంకాదని చెప్పి మాట్లాడుతున్నాను. మా communist party ని ఎన్నో పర్యాయాలు చాలామంది తిట్టారు. మేమేమీ లక్ష్యంచేయలేదు. అది వాళ్లకు అలవాటైపోయింది. కాని ఒక ఆశయంకొరకు, ఆంధ్రప్రజలయొక్క ఆశయం కొరకు కేంద్రప్రభుత్వం, కాంగ్రెసు ప్రభుత్వం, గింజుపల్లి బాపయ్యగారివంటి కొంతమంది కాంగ్రెసు వ్యక్తులు వ్యతిరేకిస్తున్నప్పటికీ కూడా ఆత్మత్యాగంచేసి, ఆంధ్రరాష్ట్రం సాధించినటువంటి పొట్టి శ్రీరాములుగారిని గురించి చెప్పరానటువంటి అవాచ్యపు మాటలు ఈ శాసనసభలో మాట్లాడడానికి వారికి సాహసం ఎట్లావచ్చిందో కాని మరెవరికీ అలాంటి సాహసం రాదని గట్టిగా చెప్పవలసియుంటుంది. అటువంటివారిని కాంగ్రెసుపార్టీ ఈరోజు ఇముడ్చుకోగలుగుతోందన్నట్లయితే ఒకప్రక్క మహాత్మాగాంధీగారి photo అక్కడ ఎదురుగా పెట్టుకున్నాం. పొట్టి శ్రీరాములుగారి photo మనంవచ్చే ద్వారంలోనే పెట్టుకున్నాం. కాని వాటిని తీసివేయమని గింజుపల్లి బాపయ్యగారు ఇదివరకే తీసుకొనివచ్చే ఉండేవారు. కాని వీరికి కావట్టిందంతా అరాజకం రాకుండా కాపాడాలి, ప్రభుత్వం ఏమి చెబితే అది చెయ్యాలి అనేదే. ఇల్లాంటి కబుర్లే బ్రిటిషు సామ్రాజ్యవాదంయొక్క జోహుకుంలు ఇదివరకు చాలాసార్లు చెప్పారు. కాని ఆంధ్ర ప్రజానీకం ఆ జోహుకుంలమాట వినలేదు. కాబట్టే మన ఆంధ్రరాష్ట్రం ఏర్పడితే దానికొరకు స్వాతంత్ర్యంవచ్చిన తరువాతకూడా ఆగవలసి వచ్చింది. ఆ జోహుకుంలమాట విని మనం పనిచెసినట్లయితే Orissa లో జోహుకుంలు బ్రిటిషు సామ్రాజ్యవాదుల కాళ్లు పట్టుకొని వేరకంగా రాష్ట్రాన్ని సంపాదించి మనరాష్ట్రంలోనుంచికూడా పర్లాకిమిడిలాంటివి లాక్కొగలిగారో, మనంకూడా ఆ మాదిరిగానే తెచ్చుకోగలిగి వుండేవాళ్ళం. కాని ఆంధ్రజాతి, ఆంధ్రప్రజలు, భారతప్రజలు బ్రిటిషు ప్రభుత్వానికే

Sri P. Sundarayya] [3rd October 1955

దానోహంతై, జోహుక్తై సంపాదించుకోలేదు. బ్రిటిషు ప్రభుత్వాన్ని సాగనంపి, ఆంధ్రరాష్ట్రాన్ని సాధించాలని పోట్లాడాం. ఆ పోట్లాడిన తరువాత వెనువెంటనే ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటుచేయవలసిన బాధ్యత కాంగ్రెసు నాయకత్వం మీద ఉన్నప్పటికీకూడా, ఏ కారణంచేతనో వాళ్లు జాగుచేస్తోన్నప్పుడు మరొక పర్యాయం ఇదివరకు కాంగ్రెసు ఉద్యమంలోనే పాల్గొన్నటువంటి గాంధిశిష్యులైనటువంటివారుకూడా ఈ ఆంధ్రరాష్ట్రానికి సంబంధించి అనేకపర్యాయాలు విజ్ఞప్తి చేసి, అప్పటికీ వినకపోతే, ఉపవాసంచెయ్యనారంభించారు. ఒకరోజుకాదు, రెండు రోజులుకాదు, 58 రోజులు ఉపవాసం చేశారు. ఆయన ఉపవాసం చేస్తూవుంటే ఆంధ్రదేశం నలుమూలలా మీటింగులు పెడుతూ శాసనసభల్లోనూ, పార్లమెంటులోనూ రోజురోజు నెహ్రూప్రభుత్వంతోను ఒక కాంగ్రెస్ భక్తుడు, ఒక దేశభక్తుడు ఆంధ్రరాష్ట్రం కావాలని, 40 ఏళ్ళక్రితం కాంగ్రెసుచేసిన తీర్మానాన్ని అమలు జరపమనిచెప్పి ఆమరణదీక్ష వహించారు. కనుక మీరు ఒకప్రకటన చెయ్యండి; ఫలానా తేదీలోపల లేకపోతే ఫలానా సంవత్సరంలోపల ఆంధ్రరాష్ట్రం ఇస్తామని ఒక ప్రకటన చెయ్యండి. ఆ ధీరుణ్ణి, మా ఆంధ్రదేశభక్తున్ని రక్షించమని చెప్పి పదేపదే ఆంధ్రప్రజానీకం యావన్మందీ ఏకకంఠంతో కోరుకున్నప్పటికీ కదలనటువంటి ప్రభుత్వం, ఆ సందర్భంలో ఆయన ప్రాణాలువదిలితే అతడు అరాజకాన్ని ప్రోత్సహించాడు, దేశానికి ఒక తప్పుడుమార్గాన్ని చూపించాడు, ఆత్మహత్య చేసుకున్నాడు, అందుచేత అతని స్మారకచిహ్నంగా అతడు చనిపోయినటువంటి ఇంటిని కొనడం తప్పనిచెప్పే సాహసం ఈరోజు ఒక శాసనసభ్యునికి ఈశాసనసభలో రావడం తగిఉన్నదేనా అని అన్నట్లయితే ఆయనేదో మహాగొప్ప వాడిని అనుకుంటూ ఉండవచ్చుగాని అది ఆంధ్రజాతికంతా, అవమానం భారతజాతికంతా అవమానం. కాంగ్రెసు పార్టీకికూడా అవమానం, అనే సంగతి వారు గుర్తించుకుంటే చాలా బాగుంటుంది.

[Sri S. Brahmayya stood up to speak at this stage].

కూర్చోండి. I am not yielding. నా ఉపన్యాసం అయిన తరువాత కావాలంటే మీరు మాట్లాడుకోండి.

SRI S. BRAHMYYA :—ఇది పార్టీకి సంబంధించిన విషయంకాదు. వ్యక్తికి సంబంధించిన అభిప్రాయాలు.

SRI P. SUNDARAYYA :—ఐతే కావచ్చు, అది మీరుచెప్పండి. లేకపోతే మీ పార్టీ నాయకుడు దానికి జవాబుచెప్పుకుంటారు. కాని శాసనసభలో ఈ రకంగా ఒక ఆంధ్రవీరుణ్ణి గురించి, అవకతవకగా అవాచ్యాలు

ఈ శాసనసభలో మాట్లాడినప్పుడు, ఒక మహావీరుణ్ణి, ఒక త్యాగమూర్తిని, ఒక ఆదర్శప్రాయుణ్ణి, ఆంధ్ర ప్రజలకూ ఆంధ్రయువకులకూ ఆదర్శప్రాయుణ్ణి గురించి ఈ రకరంగా అవాకులూ, చవాకులూ మాట్లాడడం మాత్రం మర్యాదకాదు. ఇకముందు అల్లాంటి ప్రసంగాలు ఈ శాసనసభలో చెయ్యకుండా ఉంటారని చెప్పి గట్టిగా చెబుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri G. BAPAIAH :—On a pont of personal explanation, Sir. పొట్టి శ్రీరాములు, మహావీరులలో వీరులు కావచ్చును. బుద్ధిమంతుడు కావచ్చును. త్యాగికావచ్చును. నేను ఆ విషయం కాదనడంలేదు. కాని పొట్టి శ్రీరాములు ఆంధ్రరాష్ట్ర అవతరణకు కారణం అంటేమాత్రం నేను ఏకీభవించజాలక ఉన్నాను.

MR. SPEAKER :—మరొక ఉపన్యాసం చెయడానికి వీలులేదు, Eplain చేయండి.

Sri G. BAPAIAH :—పొట్టి శ్రీరాములు మహాత్యాగి. ఆయన ఉపవసించిన విషయం నేను కాదనడంలేదు. పొట్టి శ్రీరాములు ఆత్మహత్యచేస్తుకొన్నారు కనుక అందువల్ల . . . . .

(At this stage, there were loud protests from opposition benches.—"He must withdraw his words. The words must be expunged."

SRI P. SUNDARAYYA : It is no personal explanation at all.

MR. SPEAKER :—Order, order.

THE HON. Sri B. GOPALA REDDI :—వారుచెప్పిన దానిమీద ఒక పెద్ద ఉపన్యాసము ప్రతిపక్షనాయకులు చేసినపుడు వారు ఒక personal explanation చేసుకోవలసినటువంటి అవసరంఉంది. వారు చెప్తున్నపుడు ఇంత ఆవేశం ఎందుకు పడవలెను ? వారు చెప్పే అభిప్రాయం వినండి. ఆ అభిప్రాయంతో మనం ఏకీభవించకపోవచ్చును. కాని వారు చెప్పడానికి స్వాతంత్రంఉన్నది అన్న విషయం మనము గుర్తించితే మంచిది. అది కాదని మీ అభిప్రాయం కావచ్చును. కాని వారి అభిప్రాయం మనం వినడానికి ఆక్షేపణ ఏమిఉంది ? మీరు

Sri B. Gopala Reddi] [3rd October 1955

చెప్పిన విషయాలు అందరు విన్నారు. వారు చెప్పినటువంటి విషయాలు మీరు వినండి. దానితో మీరు ఏకీభవించకపోవచ్చును. అది వేరేవిషయం. కాని వారి అభిప్రాయంవారు చెప్పడానికి వారికి ఆ స్వతంత్రం ఉన్నదని, దానిని ఎవరుకూడ నిరోధించడానికి వీలులేదు. వారికి ఆ స్వతంత్రం ఉన్నదనే నా అభిప్రాయము.

Mr. SPEAKER : Order, Order. Let there be no talk across the Table. I want to point out to Mr. Sundarayya that under the Constitution every Member has got a right to express himself in any manner he likes. There is no question of any defamation here, and even if defamation arises that freedom has been given and we have got those what are called the Privileges of the House. So, it is no use getting wild. Each man may have his own opinions, his own ideas and his own feelings about things. One cannot prevent him from expressing his beliefs or ideas or views about a certain thing or a certain person or a certain movement. So, let us drop this matter.

Sri A. KALESWARA RAO :—అధ్యక్షా, ఈ విషయంలో కాంగ్రెసుపార్టీ అభిప్రాయం విస్పష్టంగాఉంది. పూజ్యులు పొట్టి శ్రీరాములు గారు. వారివల్లనే ఆంధ్రరాష్ట్రంవచ్చింది. వారు అఖండమైన త్యాగముచేశారు. సత్యాగ్రహముఅంటే ఉపవాసదీక్షకూడ అందులో చేరిఉంది. చరిత్రలో గొప్ప సత్యాగ్రహముచేసి ప్రపంచములో ముగ్గురు ప్రసిద్ధికి ఎక్కారు, 1. Masconi, the Mayor of Cork 2. జితేంద్రనాద్ దాస్ 3. పొట్టి శ్రీరాములు. కాబట్టి మహాత్మా గాంధికూడ దానియందు నమ్మినవాడు. పాపం బాపయ్యగారు ఒక్కరు ఎట్లాగో ఏదో పాతకాలపు అభిప్రాయం చెప్పారు. కాబట్టి దానితో మాపార్టీవారెవరు ఏకీభవించరని గట్టిగా చెపుతున్నాను. (Langhter)

THE HON. SRI B. GOPALA REDDI :—కాని అది వారు చెప్పే దానికిమాత్రం స్వతంత్రంఉంది అని మాత్రం మేము అనుకొంటున్నాము.

SRI A. KALESWARA RAO :—అయితే సుందరయ్యగారు కొందరి యినవారు అవతల ప్రతిపక్షనాయకులు పెద్ద అల్లరి చేయడానికి అవకాశం ఏమిలేదు. ఏదోపాపం అమాయకంగా ఆయన ఏవో పురాణాలు చదువుకొని చెప్పినటువంటి వాడు. నేనుకూడ పురాణాలు చదివినవాడినే. నేను ఉపనిషత్తులుకూడా వ్రాశాను.

కాని అదితప్పు. బాపయ్యగారి అభిప్రాయంమాత్రం పూర్తిగ తప్పుఅని నేను ఖండిస్తూ ఉన్నాను. తక్కిన విషయాలలో ప్రభుత్వాన్ని నేను బలపరుస్తూ ఈ cut motion ను ఎదిరిస్తున్నాను.

Sri G. BAPAIAH :—On a point of personal explanation, Sir.

MR. SPEAKER :—Cool down అయిన తరువాత చెప్పవచ్చు లెండి.

SRI D. GOPALA RAO : Mr. Speaker, Sir, my idea in speaking about this cut motion is not to critisize the Government in their works. Miles and miles of roads have been laid in 1944 under the Famine Code and collossal amounts have been spent over them and nobody is attending to them now. If we were to go from one department to another, they disown these roads and we really do not know to whom these roads belong. My request to this Government is that where collossal amounts have been spent, they may enquire into them and see that at least maintenance of roads is carried out so that what they have spent before may not become a wasteful expenditure. These famine roads have been designed with the idea of connecting a number of villages, to increase and improve transport facilities. But unfortunately we see that even the double bullock cart axles breaking on these roads. When we go to the Revenue Department, they say they have nothing to do with these roads and when we go to the District Boards, they disown them. And when we approach the Highways Department, they say they have nothing to do with them.

Mr. SPEAKER : The Demand is not regarding roads in general.

SRI D. GOPALA RAO : I am sorry, Mr. Speaker. That is all I wanted to speak.

SRI P. SATYANARAYANA :—అధ్యక్షా, మిత్రులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి cut motion, అమరజీవులు శ్రీ పొట్టి శ్రీరాములుగారి కంచువిగ్రహంకూడ ప్రభుత్వం పెట్టాలఅనే దానిని నేను బలపరుస్తున్నాను. శ్రీరాములుగారు ఆత్మ అర్పణచేసిన రోజులలో విద్యార్థులుచేసిన త్యాగాలను గురించి

ఆయన చెప్పతూ ఉంటే, మన ప్రధానమంత్రిగారు ఇపుడు మళ్లీ అల్లరులు అందరిని చేయమంటావా అని ప్రశ్నించినందువల్ల, బహుశ, ప్రధానమంత్రిగారి ఉచ్చాటనే కొంతవరకు బాపయ్యగారికి ఉత్సాహం పరోక్షంగా, ఇచ్చిందేమో అని నేను అభిప్రాయపడుతూ ఉన్నాను. అయితే మళ్ళీ పెద్దలు కాళేశ్వరరావుగారు కలుగ చేసుకొని ఆ బాపయ్యగారిని disown చేసి ఇక మళ్లీ ఆయన మాట్లాడకుండ, పార్టీ ఆయనకు ఏమిసమాధానం లేకుండా, ఆయన మాటలుచేయడం అనేది జరిగింది గనుక సంతోషమే, అయితే ఇప్పుడు బాపయ్యగారికి సమాధానము చెప్పవలసిన అవసరంలేదు. ఇది జరిగినఘట్టంలో ఆఖరు ఘట్టాన్నిబట్టి మళ్లీ సమాధానం ఏమిచెప్పవలసిన అవసరంలేదు. ప్రధానమంత్రిగారు ఒక చిన్నవాక్యములోని అట్టడుగున ఒక చిన్నభావము ఉండిఉండవచ్చును, మొత్తమువీద విద్యార్థులు ఈలాంటి జాతీయ సమస్యలమీద అనవసరమైన గందరగోళములు చికాకులుతెచ్చి పెట్టుకున్నారనే టటువంటి బాధవుంటే ఉండవచ్చును.

MR. SPEAKER : All this is not relevant to matters contained in the demand.

Sri P. SATYANARAYANA :—విద్యార్థులు చేసేటటువంటి త్యాగాలు గురించి, ఒకప్పుడు టాగూరుగారు చెప్పినట్లుగా, ప్రకృతిలో వుండేటటువంటి మహాభూతములకు సహజముగా ఏవిధమైనటువంటి విధానాలు వుంటాయో, అనగా ప్రకృతిలో ఈ మహాభూతములు ఒకప్పుడు పెద్దతుపాను తీసుకురావచ్చు లేక, భూకంపాలు తీసుకురావచ్చు, ఇవి వాటికి ఏవిధంగా సహజమో, అదే విధంగా చరిత్రలో ఉండేటటువంటి మహాశక్తులకు, విప్లవాలకు, వాటి గమనానికి ఒక సూత్రం ప్రకారం ఏదో ఒకమార్గం ఉంటుంది. కొన్ని విధానాలు, కొన్ని laws ఉంటాయి. అందులో విప్లవాలు, భీభత్సాలు సంభవిస్తాయి. ఇవి జరిగేటప్పుడు, ఇది భీభత్సమేమోనని సూక్ష్మదృష్టిలేని-కేవలం స్థూలదృష్టి కలిగినటువంటి వారికి కనిపిస్తుంది. ఘటన అయిపోయిన తరువాత భీభత్సమే కావచ్చు, కాని అభివృద్ధి చెందినామని అభివృద్ధి నివారించేవారు గమనిస్తారు. తరువాత దాన్నికూడ తిరస్కరించే వాళ్లగాని, మెచ్చుకోలేని వాళ్లగాని, బాధపడే వాళ్లు గాని ఎవరైనా వుంటే అభివృద్ధి నిరోధకులు మాత్రమే ఉంటారని 1917 అక్టోబరులో రష్యాలో జరిగినటువంటి విప్లవాన్ని గురించి ఒకమారు కలకత్తాలో ఎవరో కొంతమందిమిత్రులు ప్రశ్నిస్తే రవీంద్రనాథ్ టాగూర్ గారు సమాధాన మిచ్చారు. బహుశ ఇలాంటి విషయాలు నాకంటె ఎక్కువగా ముఖ్యమంత్రిగారికే తెలిసి ఉంటాయనుకుంటాను.

ఇక, అధ్యక్షులవారి అనుమతితోటి, Civil Works లో మరియొక అంశాన్ని నేను ముఖ్యమంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. ఇది కేవలం నాగార్జునకొండరోడ్డుకు, లేకపోతే ఆకంచు విగ్రహానికి మాత్రమే పరిమితిచేసి వున్నప్పటికి, ఇతర grants విషయములో ఆ సంబంధంగా ఇతర అంశాలుకూడ చెప్పినట్లుగానే మరొక చాలా ప్రమాదమైనటువంటి ఒక civil works విషయం వారిదృష్టికి తెస్తున్నాను. అధ్యక్షులవారి అంగీకారముతో, తూర్పుగోదావరి జిల్లాలో పిఠాపురం తాలూకాలో ఉప్పాడు అనే గ్రామమున్నది. అది మా స్వగ్రామము. అది చేనేత పరిశ్రమకు చాలా ప్రధానమైనటువంటి గ్రామము. అది major panchayat board ఎనిమిదివేల జనాభాగలది. ఆగ్రామం సముద్రప్రాంతంలో ఉన్నది. ఇప్పుడు దానికి సముద్రపు ముంపు ప్రమాదం చాలా దగ్గిరికి వచ్చేసింది. ఇక ఇంచుమించు 4, 5 సంవత్సరములలో గ్రామమంతా మునిగిపోతుందేమో ననే స్థితికి వచ్చింది. చరిత్ర ప్రసిద్ధి అయినటువంటి ఉప్పాడు బట్టలు గురించి మీరు వినేఉంటారు. అక్కడ చాలామంది income tax చెల్లించేవారున్నారు. Sales tax చెల్లించేవారున్నారు. అది పెద్ద వ్యాపారకేంద్రము. సినిమాహాలున్నది. హైస్కూలు ఉన్నది. మగ వాళ్ళకు, ఆడవాళ్ళకు ప్రత్యేకంగా Elementary Schools ఉన్నాయి. ఇదంతా ఆ గ్రామంయొక్క విస్తృతాన్ని గురించి మాత్రమే చెప్తుచున్నాను. ఏదో 20, 30 చిన్న తాటాకుఇళ్లతో కూడినటువంటి చిన్న పేటఅయితే, అబ్బో! దీనికిగాను సముద్రంలో ఒక పెద్ద వారధికట్టడానికి లక్షలు ఎక్కువ ఖర్చుపెడతాము, మీరు ఎక్కువైనాపొండి అనవచ్చును. కాని ఆలాంటి వ్యవహారం కాదు ఇది. ఇది చాలా పెద్దవ్యవహారము. కనుక దీన్నిగురించి కొంత పరిశోధన చేయించవలసిందని ప్రభుత్వాన్ని నేను కోరుతున్నాను. ఈ విషయం గురించి నేను ఇటీవల కాకినాడలో వున్న State Port Officer తో కూడ మాట్లాడాను. కాకినాడలో సముద్రము వెనుకకు పోతూన్నది. దీనికి సరిగా 1½ మైళ్ల తరువాత ఉప్పాడులో సముద్రము ముందుకు వస్తూవున్నది. ఇది 50 సంవత్సరములనుంచి జరుగుతున్నటువంటి నాటకము, అదివరకు కాకినాడలో Port Office కు రెండు ఫర్లాంగులలో ఒక Light House ఉండేది. దాన్ని మొన్న యుద్ధములో పగులగొట్టేశారు. మళ్ళీ దానికి 6 మైళ్ల అవతల సముద్రపుఒడ్డున ఒక Light House కట్టారు. ఎందుచేత యిది లోపలికి పోతుంది, అది ముందుకువస్తుంది, ఈ రెంటికి ఏదైనా సంబంధం వున్నదా, అని ఆ Port Officer ను అడిగితే, ఈ రెంటి సంబంధాన్ని నేనేమైనా establish చేస్తానేమోననే భయముతో దానికి దీనికి సంబంధంలేదని క్రింద మీద పడి ఏదో సమాధానం చెప్పారు. లేకపోతే, port funds నుండి ఏమైన compensation అడుగుతారేమోనని భయపడ్డారేమో! మనకు తెలియదు. ఆ సముద్రములో

సరిగా 6 మైళ్లకు అవతల గోదావరి point అనేది ఒక పెద్ద projection ఉన్నది. ఆ projection రావడము, ఇది లోపలికి పోవడము, అక్కడ erosion లేవడము ఉన్నది. వీటన్నిటికీ అనుగుణ cross currents ఉన్నాయి. వీటికి సంబంధించిన విషయాలన్నీ ఆంధ్రలో యూనివర్సిటీలలో ఉన్నటువంటి oceanographists కు పంపించి కొంతమంది పరిశోధన చేయించవలెనని కోరుచున్నాను. దీనికి సంబంధించిన కొంతమంది చేత specialists తో మాట్లాడితే, దీనికి మహాఅయితే ఒక లక్ష రూపాయలు మాత్రమే ఖర్చుఅవుతుంది, అంతకంటే ఎక్కువకాదు అని వారు చెప్పారు. అందుచేత ఈ విషయాన్ని note చేసుకొని దీన్ని పరిశోధన చేయించవలసిందని ప్రభుత్వాన్ని కోరుతూ విరమిస్తున్నాను.

SRI G. BAPAIAH :—On a personal explanation, Sir, పొట్టి శ్రీరాములుగారు ఆంధ్ర రాష్ట్రావతరణం కొరకు బంధానం చేయుట గొప్పవిషయమే నని నేను అంగీకరిస్తున్నాను. నేను ఇక్కడ explain చేసే దేమిటంటే వారు గొప్పవారే, ఆంధ్ర రాష్ట్రావతరణకు వారు కారకులు కావచ్చు కాని ఆంధ్ర రాష్ట్రావతరణకు వారి ఆత్మ బలిదానమే కారణమని చెప్పితే మన ప్రజారాజ్యమునకు న్యూనత అని మాత్రం నేను అభిప్రాయపడుచున్నాను.

THE HON SRI B. GOPALA REDDI :—అధ్యక్షా, ఇక్కడ మేము చెప్పినటువంటి విషయం ఒకటైతే, జరిగినటువంటిది మరొకటైంది. పొట్టి శ్రీరాములు మరణించిన గృహాన్ని ప్రభుత్వంవారు acquire చేస్తున్నారు. దానికిగాను 25 వేల రూపాయలు sanction చేసినారు. దాన్ని ఈ అసెంబ్లీ ఆమోదం కోసం మేము తీసుకువచ్చాము. దానికి వంద రూపాయలు మాత్రం ఒక token గ్రాంటు మేము అడిగాము. ఈ ఇల్లు స్వాధీనము చేసుకొన్న తరువాత ఈ భవనాన్ని ఏ రకంగా వినియోగించాలి, మద్రాసులో ఉన్నటువంటి ఆంధ్రులుకూడ ఈవిషయంలో ఎంతవరకు సహకరిస్తారు, ఆంధ్రదేశముయొక్క ప్రజానీకమంతా ఈ విషయంలో ఎటువంటి సానుభూతి చూపిస్తారు, ఆ భవనాన్ని భజనమందిరముగా చేయవలెనా, Reading Room గా చేయవలెనా, లేక ఒక Hall మాదిరి కట్టవలెనా, దాని చుట్టు ప్రక్కల ఉంటే స్థలము కూడా acquire చేయవలెనా ఆ నేటటువంటి విషయము ప్రభుత్వపు ఆలోచనలో ఉన్నది. దానికి ప్రాతిపదికగా ఈనాడు 25 వేలు రూపాయలు ఖర్చుపెట్టి ఆ భవనాన్ని గవర్నమెంటువారు acquire చేసుకొని దాన్ని ప్రజలకు వినియోగించాలనే ఉద్దేశిస్తున్నది. అది అసలు విషయము. దానికి గోపాలకృష్ణయ్యగారు ఒక సవరణ చేయడము, దానిమీద తర్జన భర్జనలు, ఆ వేశాలు జరగడం తటస్థించింది. ఇదంతా న్యాయంకాదేమో అనుకొంటాను. అసలు ప్రభుత్వం

వారు ప్రతిపాదించినటువంటి విషయము చాలాసరళమైనటువంటిది. అందరుకూడ ఆమోదించినటువంటిది. ఎవరుకూడ దీనిని వ్యతిరేకించలేదు. మీరు ఈవిధంగా దీనికి 25 వేలు ఖర్చు పెట్టుట తప్పు అని ఎవరుగాని, ఏ పార్టీవారుగాని చెప్పలేదు. అటువంటి సందర్భంలో ఏదో ఒక భేదాభిప్రాయాన్ని పట్టుకొని ఆవేశాలు కలుగజేసుకోవడం సరికాదనుకుంటాను. వ్యక్తులైనటువంటివారు ఉన్నప్పుడు కొన్ని కొన్ని విషయాలలో భేదాభిప్రాయాలు చెప్పడం సహజమే. ఈనాడు విద్యార్థులు చేస్తున్నటువంటి పనుల విషయంలో, కొంతమంది వాటిని సమర్థించవచ్చు, కొంతమంది సమర్థించకపోవచ్చును. ఉదాహరణకు మొన్న Capital విషయంలో కర్నూలులో జరిగినటువంటి . విషయాలు కొందరు సమర్థించవచ్చు, కొంతమంది సమర్థించలేకపోయి యుండవచ్చును. లేక రేపుప్రొద్దున ఇనాముల విషయంలో కొందరు విద్యార్థులు సత్యాగ్రహం చేస్తే అది మంచిదని కొందరుచెప్పవచ్చును, అది మంచిది కాదని మరి కొందరు చెప్పవచ్చును. ఇంకొకరు ఈ కల్లు సారాయి అంతా తీసివేయడానికి నేను ఒక సత్యాగ్రహం చేస్తానని విద్యార్థులను నడిపిస్తే అది దేశభక్తి అని చెప్పేవాళ్ళు కొంతమంది ఉండవచ్చును. అది దేశభక్తి కాదని చెప్పేవాళ్లు కూడ ఉండవచ్చును. ఇటువంటి పరిస్థితులలో భేదాభిప్రాయాలు తప్పకుండా ఉంటాయి. నామటుకు నాకు కొన్ని కొన్ని అభిప్రాయాలున్నాయి. విద్యార్థులను ఈ రాజకీయ, స్థానికమైనటువంటి సమస్యలకోసంగా వినియోగించుకోవడానికి ఎంతవరకు వీలున్నది అనే విషయంలో నామటుకు నాకు వేరే అభిప్రాయాలున్నాయి. ఏమైనప్పటికీ, British సామ్రాజ్యంలో నీకు ఏదో చేసినారు కాబట్టి అవన్నీ ఈనాడు చేయవచ్చును. ప్రభుత్వము ఉపేక్షించి ఊరక ఉన్నప్పుడు, ఏదైనా చేయవచ్చు, Unconstitutional గా ఏదైనా చేయవచ్చును, అనేటటువంటి అభిప్రాయంతో మాత్రం నేను లేను. మనకు అనేక సమస్యలు ఉన్నాయి. ప్రజాప్రభుత్వము ఏర్పడిన ఈ సందర్భంలో ఆ సమస్యలన్నికూడా constitutional గా తీర్చుకోవడం న్యాయమైన పద్ధతిగాని, unconstitutional గా లేనిపోని civil disobedience అంతా చేయడం telegraphic lines తెంపివేయడం, taxes ఇవ్వకపోవడం, రైళ్ళనంతా స్తంభింపజేయడం, ఈవిధంగా చేయడమంటె నామటుకు నేను ఒప్పుకోవడానికి వీలులేకుండా ఉన్నది. అందువల్ల ఇటువంటి వాటిల్లో భేదాభిప్రాయాలు ఉంటాయి.

ఇక చూడండి. భేదాభిప్రాయాలంటే నేను చెబుతున్నాను. సత్యాగ్రహాలు చేసి, జైళ్లకుపోయి, అక్కడ రెండు సంవత్సరాలు, మూడు సంవత్సరాలు వున్నటువంటి వారికి ప్రభుత్వమువారు ఏదో రెండేసి, మూడేసి ఎకరాలు యిస్తామని చెబుతున్నప్పుడు, అది తప్పు, ప్రభుత్వము ఆ విధంగా చెయ్యడము తప్పు అని

చెబుతూ, అది అంతా దేశభక్తి అయితే కావచ్చును, కాకపోవచ్చును, దానితో మాకు నిమిత్తములేదు, ఆ విధంగా భూమి యివ్వటానికి వీలులేదు అని చెప్పడము ఎంతవరకు సమంజసమో నాకు తెలియదు. కాబట్టి యీ విషయములో ఒక్కొక్క పార్టీకి ఒక్కొక్క అభిప్రాయము వుంటున్నది. వారికి భూములు యివ్వవలసిన అవసరములేదు, హరిజనులకే భూములు యివ్వాలని చెబుతున్నారు. కేవలము జైళ్లకు పోయినవారికి, త్యాగముచేసిన వారికి first priority యివ్వాలని కొన్ని కొన్ని పార్టీలవారు అభిప్రాయపడవచ్చును. కాబట్టి యిటువంటి విషయములలో భేదాభిప్రాయాలు ప్రస్పష్టము అంతటిలోకే దానికి అంత పెద్ద ఆవేశము పడవలసిన అవసరములేదు. ఒకరు దానిని దేశభక్తి అని అనుకున్నప్పుడు అది దేశభక్తి కాదు అని యింకొకరు అనుకోవడములో తప్పులేదు. అందువల్ల దీనిలో అట్టే ఎక్కువ ఆవేశపడనక్కరలేదు. అందుచేత వావిలాల గోపాలకృష్ణయ్యగారికి నేను యీ హామీయిస్తున్నాను. మద్రాసులో ఆ యిల్లంతా acquire చేసిన తరువాత అక్కడ పొట్టి శ్రీరాములుగారి bust పెట్టవలెనో, లేక statue పెట్టవలెనో oil painting పెట్టవలెనో, లేక యింకా ఏవిధంగా చేయవలెనో అవంతాకూడా ప్రభుత్వము తప్పకుండా ఆలోచిస్తుంది కాబట్టి ఆవిషయంలో గోపాలకృష్ణయ్యగారు తెచ్చిన cut motion ఉపసంహరించుకోవలసిందిగా వారిని కోరుతున్నాను.

రెండవది నాగార్జున సాగర్‌కు వేసే రోడ్డు విషయములో ఒక విధముగా చూస్తే, ఇంజనీర్లను బహుశ నాగిరెడ్డిగారుకూడా అభినందించు చున్నారను కుంటున్నాను. మనము అనుకోనంత త్వరలో పని జరుగుచున్నది. ఇప్పటికింకా హైదరాబాదు ప్రభుత్వమువారుకూడా రోడ్డు వేస్తున్నారు. మనవారు మాత్రము మేము అక్కడకు పోకముందే, రెండుమాసముల క్రిందటనే యీ రోడ్డును తయారు చేశారు. అనుకున్న దానికన్న తొందరగానే వారు ఆ పనిచేసినందుకు నేను వారిని అభినందిస్తున్నాను. అయితే నాగిరెడ్డిగారు చూస్తే, అక్కడ కంట్రాక్టర్లు కూలీలకు సరిగా కూలీలు ఇవ్వడంలేదని, అక్కడ డబ్బు కొంత దుబారా అవుతున్నదని చెప్పారు. ఆ విషయాలన్ని ఎంతవరకు నిజమో, నిజా నిజ పరిస్థితులన్నీ మేము దర్యాప్తు చేస్తాము. నిజానికి ప్రభుత్వము ఒక పని చేస్తున్నప్పుడు ఒక్కొక్క సారి పని త్వరగా చేయించవలసివుంటుంది. కాని ఎక్కడాకూడ, డబ్బు దుబారా చేయమని గాని లేకపోతే అనవసరమైన ఖర్చు చేయమనిగాని కూలీలకు కూలీసరిగా యివ్వవద్దనిగాని ఈ ప్రభుత్వము ఎప్పుడుకూడ చెప్పదు, ఆశించదు, ఉద్దేశించదు. ఇటువంటి విధానాలకు యీ ప్రభుత్వము పాల్పడదు. కనుక ఈ విషయంలో నాగిరెడ్డిగారు చెప్పిన విషయాలన్నీ కూడ దర్యాప్తుచేస్తాము. ఈనెల 29 వ తేదీన

నందికొండ ప్రాజెక్టు బోర్డు అక్కడ ఆ site లోనే సమావేశము కాబోతున్నది. హైదరాబాదు మంత్రులుగూడా అక్కడికి వస్తున్నారు. మేముకూడా పోతున్నాము. నాగిరెడ్డిగారు చెప్పిన విషయాలన్ని నేను మనస్సులో పెట్టుకొని అక్కడ Chief Engineer ను గూడా కలుసుకొని దర్యాప్తు చేస్తాను. కాబట్టి యీ డిమాండు మీద తెచ్చిన cut motion ను వుపసంహరించుకొని యీ డిమాండును బలపరుస్తారని నేను ఆశిస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA: I beg leave of the House to withdraw the cut motion moved by me.

The cut motion was, by leave of the House withdrawn.

SRI M. NAGI REDDI: I beg leave of the House to withdraw the cut motion moved by me.

The cut motion was, by leave of the House, withdrawn.

MR. SPEAKER: I will now put the demand to the vote of the House. The question is.

"That the Government be granted for the year 1955-56 a further sum not exceeding Rs. 7,75,200 under Demand-XXIV, Civil Works-Works."

The Demand was carried and the Grant was made.

## DEMAND XXV—CIVIL WORKS—ESTABLISHMENT AND TOOLS AND PLANT.

The HON. SRI. B. GOPALA REDDI: MR. Speaker, Sir, on the recommendation of the Governor, I move:

"That the Government be granted for the year 1955—56 a further sum not exceeding Rs. 1,50,100 under Demand—XXV—Civil Works—Establishment and Tools and Plant."

MR. SPEAKER: Motion moved:

"That the Government be granted for the year 1955—56 a further sum not exceeding Rs. 1,50,000 under Demand—XXV—Civil Works—Establishment and Tools and Plant."

SRI V. VISWESWARA RAO: MR. Speaker, Sir, I move:

Sri V. Visweswara Rao] [3rd October 1955

"To reduce the allotment of Rs. 1,50,100 for Civil Works —Establishment and Tools and Plant by Rs. 100."

(రోడ్డు రిపైరింగు పనులు సాగించుటకు కావలసిన యంత్రాలుకొనుటకు జరుగు ఆలస్యం, వాటి మరమ్మతులకు వర్క్‌షాప్‌ను నిర్మించుటలో జరుగుచున్న ఆలస్యమును గురించి చర్చించుటకు.)

MR. SPEAKER : The main motion and the cut motion are now before the House for discussion.

Sri V. VISWESWARA RAO :—అధ్యక్షా, ప్రభుత్వమువారు తెచ్చిన యీ సప్లిమెంటరీ డిమాండు యీనాడు ఈ సభముందు ప్రవేశపెట్టబడింది. కాని యీ డిమాండు విషయములో చూస్తే ఈ నాలుగు సంవత్సరాలలోనూ కూడా ఆంధ్ర దేశములో ఏ ఒక్క Work shop కూడా లేకపోవడమనేది చాలా విచారకరమైన విషయము. ఎందుకంటే యంత్రాలతో మనము వెంటవెంటనే అనేకపనులు చేయాలి అని చెప్పి తలపెట్టిన కార్యక్రమము ఆరంభముచేసి పనిచేయడము జరగవలసివున్నది. ఈ విషయము యింతకు ముందుగానే మనము చర్చించాము. నాగార్జునసాగర్ కు 15 మైళ్ల రోడ్డు ఆరువారములలో వేశామని మంత్రిగారు చెప్పారు. అదేవిధంగా బెజవాడదగ్గర ఒకవంతెన అయిదునెలలో కట్టామని చెప్పారు. ఈ విధంగా త్వర త్వరగా పనులు చేస్తున్నామనిచెప్పారు. నాకు అదిఅంతాకూడ తెలుసును. మంత్రి గారు చెప్పనక్కరలేదు. ఇంత తొందరలో పనులు పూర్తిజేయించడమంటే, డబ్బు కూడా ఎంతదుబారాచేసివుంటారో అదికూడ మంత్రిగారు గుర్తించాలి. Road rollers మనకు కావలసిన అవసరమున్నది. అదేవిధంగా Cement concrete mixtures కావలసిన అవసరమువున్నది Lorries కు కావలసిన యంత్రసామగ్రి తయారుచేసు కోవలసిన అవసరమున్నది. కాని మనవున్న యంత్రసామగ్రినిచూస్తే వాటి విషయములో ప్రభుత్వము ఏమైనా శ్రద్ధతీసుకుంటున్నదాఅంటే, అది యేమీ కనబడదు. ఈ రోజు వుదయమున ప్రశ్నల సమయములో మంత్రిగారు సమాధానము చెబుతూ Workshop కట్టటము బెజవాడలోనా, యింకొకచోటునా అని P.W.D. వారు High ways Department వారు యిరువురు కూర్చుని చర్చిస్తున్నారని చెప్పారు. అంటే, గత రెండు మూడు సంవత్సరాల కాలములో యింతవరకు మన ఆంధ్ర రాష్ట్రము వచ్చినతరువాత మనకు ఒక చిన్న Workshop గూడా నిర్మించుకో లేకపోవడము అనేది చాలా విచారకరము. ఉదహారణకు ఏ యంత్రానికి అయినా సరే కనీసము ఏ ఒక nut అయినా, ఏ ఒక చిన్న bolt అయినా చిన్న part అయినా యీ యంత్రాలలోనివి చెడిపోతే, వాటిని మరమ్మతు చేసుకోటానికిఅయినా

బజారువెళ్లి కొనుక్కోవలసిన పరిస్థితివున్నది గాని, అటువంటివి చిన్న చిన్న వస్తువుల దగ్గరనుంచి కొనుక్కోవలసిన పరిస్థితిలేకుండా workshop లోనే తయారుచేసుకుంటే, ఎంతో సుళువుగావుండేది. ఉదహరణకు ఒక అయిదురూపాయలు ఖరీదు చేసే సామగ్రికావాలంటే, అది తీసుకొనిరావటానికి ఆ యంత్రమునడిపే డ్రైవరు ఆయనపై అధికారికిచెప్పడం, ఆయన ఎస్టిమేటువ్రాయడం, అవి ఆఫీసుకుపంపడం అది అక్కడకు యిక్కడకు తిరిగి, చివరకు ఇంజనీరుకుచేరి, ఆయన శాంక్షనుచేసి మరల అది కొనుక్కొనే stage కి వచ్చేటప్పటికి ఏ అయిదారునెలలో పట్టుతున్నది. ఇంత చిన్న వస్తువుకు యింతపెద్ద ఆలస్యమవుతున్నదంటే, యీ అయిదారునెలలో ఆ యంత్రములు నడపటానికి వీలులేకుండా మూలపడేసి వుంచవలసినదేగదా. ఇక అవి అక్కడనే మరల కదిలించేటప్పటికి తుప్పపట్టి పాడైపోయియుంటవి. తుప్పుపట్టి పాడైపోతే, ఎంతబాగుచేసినను ఆ యంత్రములు నడవవు. సరేకదా పైగావాటిని condemn చేయమని పై అధికార్లు సలహాయిస్తారు. ఆ సంగతి యింజనీరుకుచెప్పి వేరే కొత్తయంత్రాలు తెప్పించటానికి proposals పెట్టి తెప్పించడము జరుగుచున్నది. ఈ యంత్రాలుఅంటే ముఖ్యంగా road rollers విషయముఅంటే, steam engines, oil engines తో నడిచేవాటి విషయములో జరుగుతున్న విషయము, యిది ఈ యంత్రాలు బెజవాడలోనూ, గుంటూరులోను ఉన్నవి అన్నీ లెక్కవేసి చూస్తే సుమారు పదిపదిహేనువుంటవి. అంటే యీ అంకె బహుశ తప్పుగావుండవచ్చును. కాని road rollers మాత్రము అక్కడ పడివున్నవి. ఆ విషయము నాకు తెలుసును. అవి అన్నీ గూడా లక్షలకొద్ది రూపాయలు ఖర్చుపెట్టికొన్నవే. వీటికి ఎంత డబ్బు. ప్రభుత్వము ఖర్చుచేశారు. ఈ నష్టముఅంతా ఎవరు భరిస్తారు, అనేది ఆలోచించాలి ఇకపోతే ప్రభుత్వానికి డబ్బుకావాలంటే, పన్నులువేసి ప్రజలను బాధించటము, వసూలుచేసి యీ విధంగా సుబారాచేయడము, యిటువంటి పనులుమాత్రము చాలా త్వరగాను చులకనగాను ప్రభుత్వమువారు జరపటానికి తయారవుతున్నారు. ఒక్క అయిదు రూపాయలు ఖరీదుచేసే యంత్ర సామగ్రికి యింత తంగముచేసి, చివరకు అయిదు రూపాయలుకొరకు అసలు యంత్రమే condemn చేయబడి చివరకు క్రొత్త యంత్రము తెచ్చుకునే పరిస్థితి ఏర్పడ్డది. కనుక ప్రభుత్వము యీ విధంగా administration జరుపుతున్నదన్నమాట. ఇటువంటిది red-tapism కాకమరేమిటి? దీన్ని తొలగించటానికి ప్రయత్నముచేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

తరువాత workshop పెట్టేటివిషయంలో బెజవాడ సెంటరుగా వుంటుంది. కాబట్టి యీ workshop ను అక్కడనే పెట్టాలని కోరుతున్నాను. ఆ విధంగా చేయక, ఎక్కడో యేమ్మూలజిల్లాలోనో పెట్టితే, అక్కడనుంచి యీ యంత్ర

Sri V. Visweswara Rao] [3rd October 1955

సామగ్రిని వెంటనే తెప్పించుకోటానికి వీలుండదు. అవి తెప్పించుకునేటప్పటికి ఆలస్యము జరుగుటము వుంటుంది. చేరువలో వుంటే, ఆలస్యము లేకుండా పని జరిగి పోవటానికి వీలుఅవుతుంది. ఆ విధంగా చేయకపోతే రాష్ట్రములో ఎక్కడెక్కడ యీ యంత్రాలువున్నవో అవన్నీ పనికిరాకుండా పోయేపరిస్థితులు ఏర్పడుతాయని నమ్మండి. కాబట్టి మంత్రిగారు యీ workshop ను బెజవాడలోనే ఏర్పాటు చేయిస్తారని ఆశిస్తున్నాను.

తరువాత యిప్పటికి 20, 25 సంవత్సరాలనుంచి P. W. D. లోను దానికి సంబంధించిన Highways లోనూ పని చేయువాళ్లకు పనులు ఖాయము చేయలేదని గోల పెట్టుతున్నారు. ఈ విషయము మంత్రి గారికి తెలుసుననుకుంటాను. ఎన్ని సంవత్సరములు పనిచేసినా, వుద్యోగము ఖాయముచేయకపోతే, వారు నిరుత్సాహపడి, ప్రభుత్వ కార్యములు చేయడము అంతంతమాత్రమవుతవి. గనుక వారిని అందరిని వెంటనే ఖాయముచేసి వుత్సాహవంతులనుచేసి, ప్రభుత్వ కార్యక్రమములు వుత్సాహపూరితముగా చేయించవలసిందిగా కోరుతూ విరమిస్తున్నాను.

THE HON. Sri B. GOPALA REDDI :—అధ్యక్షా, మీరు పనులు త్వరత్వరగా చేయించారు, అట్లా కాకుండా నెమ్మదిగా చేయించండి, లేకపోతే డబ్బు దుబారా అవుతుంది అని నాగిరెడ్డిగారు అన్నారు. పనులు అన్నీ ఆలస్యముగా జరుగుచున్నవి, work shop లేకుండా వున్నది. త్వరగా పెట్టించి, పనులు త్వరగా చేయించండి అని విశ్వేశ్వరరావుగారు అంటున్నారు. ఈ ఆలస్యములు అన్నీ P. W. D. లో జరుగుచున్నవి. ఇదంతా అరికట్టింప చేయాలి. పనులు తొందరగా జరగాలి అనే చెప్పారు. ఈ విధంగా ఒకరు పనులు తొందరగా చెయ్యాలి అని, యింకొకరు కాదు, నెమ్మదిగా చేయించండి, లేకపోతే డబ్బు దుబారా అవుతుంది అని చెప్పుతూవుంటే, యిక ప్రభుత్వ కార్యక్రమములు జరిగేది ఎట్లా? అటుచేసినా విమర్శిస్తారు, యిటుచేసినా విమర్శిస్తారు. ఇదంతా చెబుతూ వుంటే, ప్రయోజనము వుండదు. ఏది ఏమైనప్పటికిన్నీ యంత్రాలు అన్నీకూడా పరిశీలనచేసి వాటికి కావలసిన సామగ్రి తయారు చేసుకోటానికి work shop నిర్మాణానికి తప్పకుండా ప్రయత్నము చేస్తాము. ఆ విషయములో ఏలాంటి ఆక్షేపణ లేదు. ప్రభుత్వము ఒక పనిచేయ దలచుకున్నప్పుడు, దానికి తగిన tools and plants, ఏవీకూడా లేకుండానే ఇంజనీర్లను పనిచేయమంటే, వారు ఏవిధంగా చేస్తారు? చేయటానికి వీలుండదు. ఆ పనులు త్వరగాచేసినా నష్టమే, నెమ్మదిగా చేసినా నష్టమే. త్వరగాచేస్తే డబ్బు దుబారా అవుతుందంటారు. నెమ్మదిగాచేస్తే యంత్రాలు చెడిపోతున్నవి అంటారు. కాబట్టి యీ విషయాలన్నియు సమ

న్యాయముచేసి, బాగా పరిశీలించి, ఏదో సంసారపక్షముగా పోతూ వుండాలి. (laughter) గాని, ఒకరుఅటు, ఒకరుయిటు చెప్పితే యీ పనులు జరిగేదిఎట్లా? నేను నందికొండకు వెళ్ళేటప్పుడు విశ్వేశ్వరరావుగారు చెప్పిన విషయాలు అన్ని గూడా దర్యాప్తుచేస్తాను. కనుక యీ విషయాలలో ప్రభుత్వము తప్పకుండా శ్రద్ధతీసుకొని, ఏవిధమైన ఆలస్యము జరగకుండా పనులు జరిపిస్తుందని చెబుతున్నాను.

MR. SPEAKER : It being 5 O'Clock, now, in pursuance of sub-rule 3 of rule 133 of the Assembly Rules, I proceed to put forthwith the question on the demand under discussion and also the questions on other demands notice of which has been given by the Government.

The question is .

" That the Government be granted for the year 1955—56 a further sum not exceeding Rs. 1,50,100 under Demand XXV —Civil Works—Establishment and Tools and Plant."

The Demand was carried and the Grant was made.

## DEMAND XXVI—CIVIL WORKS-GRANTS—in—AID.

MR. SPEAKER : The question is :

" That the Government be granted for the year 1955—56 a further sum not exceeding Rs. 31,41,600 under Demand XXVI —Civil Works—Grants-in-Aid.

The Demand was carried and the Grant was made.

## DEMAMD XXXI—MISCELLANEOUS.

MR. SPEAKER : The question is :

" That the Government be granted for the year 1955—56 a further sum not exceeding Rs. 100 under Demand XXXI—Miscelleneous."

The Demand was carried and the Grant was made.

## B. OTHER EXPENDITURE.

### DEMAND XXXIV—CAPITAL OUTLAY ON IRRIGATION.

MR. SPEAKER : The question is :

" That the Government be granted for the year 1955—56 a further sum not exceeding Rs 2,700 under Demand XXXIV —Capital Outlay on Irrigation. "

The Demand was carried and the Grant was made.

### DEMAND XXXVIII —CAPITAL OUTLAY ON CIVIL WORKS.

MR. SPEAKER : The question is :

" That the Government be granted for the year 1955—56 a further sum not exceeding Rs 51,800 under Demand XXXVIII—Capital Outlay on Civil Works. "

The Demand was carried and the Grant was made.

### DEMANDXXXIX—CAPITAL OUTLAY ON ELECTRICITY SCHEMES.

MR. SPEAKER : The question is :

" That the Government be granted for the year 1955—56 a further sum not exceeding Rs. 4,96,800 under Demand—XXXIX—CAPITAL OUTLAY ON ELECTRICITY SCHEMES.

The Demand was carried and the Grant was made.

MR. SPEAKER : The House will now adjourn and meet again at 11 a. m. tomorrow.

The House then adjourned.

---